

ఇందులో:

★ ప్రజాస్వామిక ప్రజాతంత్రం

★ వ్యవసాయ సమస్య:
భారత విప్లవ పోరాటం

8

1-2-49

# జనత



"కార్మిక వర్గంలో ఒకభాగాన్ని నమ్మించే వాళ్ళూ, 'సంస్కరణల ద్వారానే అంతా సాధ్యమవుతుంది' అనేమాటలతో, అందమైన రంగులతో, పైపూతలతో, పెట్టుబడిదారీవర్గానికి మేలిముసుగు వేసేవాళ్ళూ, మాటలతో ప్రజల కండ్లల్లో దుమ్ము గొట్టేవాళ్ళూ, సంస్కరణమార్గం చేపట్టడంద్వారా లభించే అవకాశాలను ఉద్వాలంగా, బ్రహ్మాండంగా చిత్రించి ప్రజలను విప్లవమార్గంనుంచి తప్పుదారి పట్టించేవాళ్లూ—ఇలాంటి వాళ్లు తమ తొత్తులుగా ఉండడం పెట్టుబడిదారీవర్గానికి అవసరం."

— లెనిన్ (1919)



# ప్రజాస్వామిక ప్రజాతంత్రం



## (నేటి భారత రాజకీయ విప్లవదశ)

ఇండియాలో నేటి విప్లవదశను గురించి కామ్రేడ్స్ కొన్ని ప్రశ్నలడుగుతున్నారు. ఇప్పుడు మనరష్యాలోని ఫిబ్రవరి విప్లవదశలో ఉన్నామా? లేక నవంబరు విప్లవదశకు పూర్వమున్న స్థితిలో ఉన్నామా?

* ప్రజాస్వామిక ప్రజాతంత్రం అనగా నేమి?

ఆయాదేశాలలో ఆయా కాలానికి సంబంధించిన విప్లవదశను నిర్ణయించాలంటే ఆదేశంలో వర్గసంబంధాలు ఎంత పరిపక్వదశకు వచ్చాయో చూడవలసిఉంటుంది. ఆ దేశంయొక్క వర్గసంబంధాలను మొత్తం ప్రపంచంలోని వర్గసంబంధాల దృష్టితో పరిశీలించవలసి ఉంటుంది. పెట్టుబడిదారీవిధానం ఏవిధంగా పతనోన్ముఖమైపోతూఉందో, ఈనాటి ప్రధానమైన వర్గవైరుధ్యం అనగా పెట్టుబడిదారీ, శ్రామికవర్గ వైరుధ్యం – ఏదశలో ఉందో గ్రహించవలసిఉంటుంది. మొత్తం ప్రపంచంలోఉన్న ప్రధాన వర్గవైరుధ్యాన్ని పట్టిచూస్తే సోషలిస్టువిప్లవమే ఈనాటి ఆవశ్యకత అని స్పష్టంగా బోధపడుతుంది. సోషలిస్టువిప్లవదశకు సాగిపోడానికి ముందు దాటవలసిన పరివర్తనదశఏది? అసలు ఆ పరివర్తనదశ అంటూ ఒకటి ఉందా? అనే విషయం ఆ దేశంయొక్క మొత్తం వర్గసంబంధాలపై ఆధారపడి ఉంటుంది.

వలసదేశాల్లోనూ, తక్కువ అభివృద్ధి చెందిన దేశాల్లోనూ జరిగే ప్రజాస్వామిక విప్లవాన్ని శ్రామికవిప్లవమనే గొలుసులో ఒక లింకుగానూ, అందుకు దారితీసే స్వల్పకాలపు ఒకదశగానూ మార్క్సిజం-లెనినిజం ఎల్లప్పుడూ గుర్తిస్తూనేవుంది. ఇందుకు కారణం పెట్టుబడిదారీవిధానం పతనావస్థలో వుండడం చేత అది అభివృద్ధికరపాత్రను నిర్వహించలేదు.

* 'పీపుల్స్ డెమోక్రసీ' అనే పదానికి ప్రజాస్వామిక ప్రజాతంత్రం అనీ, 'బూర్జువా డెమోక్రసీ' అనే పదానికి బూర్జువా ప్రజాతంత్రం అనీ తర్జుమా చేయబడింది.

— అనువాదకుడు

ప్రజాస్వామిక విప్లవం నిర్వహించవలసిన కర్తవ్యాలను తదేకదీక్షతో నిర్వహించలేదు. సామ్రాజ్యవాద బానిస బంధనాలనుంచి ఆ దేశాలను విముక్తం చేయలేదు. ఇక పెట్టుబడిదారీ ప్రపంచాన్ని యెదుర్కొంటూ ప్రధాన సమస్యను పరిష్కరించడమనేది కల్ల. వలసదేశాలలో, దాస్యవిముక్తి పొందిన ఫలితంగా, పెట్టుబడిదారీ విధానం దీర్ఘకాలం అధికారం చలాయిస్తుందనీ, అభివృద్ధి చెందుతుందనీ, పెట్టి అవకాశవాదులు మాత్రమే ఊహించారు.

కాని శ్రామికవర్గం మాత్రం అలాంటి వెర్రిఊహాలకు లోనుగాకుండా సామ్రాజ్యవాదవ్యతిరేకపోరాటాన్ని ప్రజాస్వామిక విప్లవ అంత్యదశవరకూ - అవిచ్ఛిన్నంగా సాగించ పూనుకుంది. శ్రామికవర్గ నియంతృత్వంవైపు పురోగమించడానికి ప్రజాస్వామిక విప్లవ అంత్యదశ - కార్మిక కర్షకుల ప్రజాస్వామిక నియంతృత్వం - ఒక పరివర్తనదశ మాత్రమే. పెట్టుబడిదారీవర్గానికి పట్టంకట్టేందుకు గాదు సామ్రాజ్యవాదాన్ని ఓడించేది. పెట్టుబడిదారీ వర్గాన్ని అధికారంనుంచిమారంచేసి ప్రజలే ఆ అధికారాన్నిహస్తగతంచేసుకోవలసివుంటుంది. అదశే కార్మిక కర్షకుల ప్రజాస్వామిక నియంతృత్వదశ. ఆ దశలో అవలంబించే ఆర్థిక కార్యక్రమం కూడా అందుకనుగుణంగానే వుండాలి. కార్మికుల కర్షకుల చేతుల్లోనే ప్రధానమైనఆర్థికసాధనాలన్నింటినీఉంచాలి. అప్పుడే ఆయా పరిస్థితుల కనుగుణంగా తదనంతర దశకు సాగిపోవడం సాధ్యమవుతుంది.

## 2

రష్యావిప్లవంవల్ల గడించిన మహత్తర అనుభవాన్నీ, 1905_1917 రష్యా విప్లవాన్ని గురించి లెనిన్ చేసిన మహోపదేశాలను ఆధారంగా తీసుకొని అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీ ఆరో కాంగ్రెసు ప్రకటించిన 'కలోనియల్ థీసిస్'లో వలసదేశాలకు సంబంధించిన కమ్యూనిస్టు వ్యూహం, ఎత్తుగడలపై యిలా వుంది:

"చైనా, ఇండియాలతోసహా అన్ని వలస దేశాల్లోనూ, అర్థవలసదేశాల్లోనూ, ఉత్పత్తి శక్తుల అభివృద్ధి తదితర దేశాలకంటె చాలా తక్కువ స్థాయిలో ఉండడం, శ్రమను సంఘపరం చేయడం కూడా తక్కువ స్థాయిలోనే ఉండడం, విదేశీ సామ్రాజ్యవాదుల ఆధిపత్యంతోపాటు జమీందారీ భూస్వామ్య విధానాలు ఇంకాబలీయంగాఉండడం, పెట్టుబడిదారీవిధానదశకు పూర్వపు సంబంధాలే ఇంకా మిగిలిఉండడం-ఇవన్నీ ఆ దేశాల విప్లవంలో ప్రథమదశయొక్క స్వభావాన్ని నిర్ణయిస్తాయి. ఇలాంటి దేశాల విప్లవోద్యమాల బూర్జువా ప్రజాతంత్ర విప్లవదశను మనం దృష్టిలోఉంచుకోవలసి ఉంటుంది. బూర్జువా ప్రజాతంత్ర విప్లవం అంటే శ్రామిక వర్గ నియంతృత్వానికీ, సోషలిస్టు విప్లవానికీ ముందు కావలసిన సన్నాహం అంతా సిద్ధంగా తయారు చేసుకోవడ మన్నమాట. ఈ సిద్ధాంతాన్ని ఆధారంచేసుకొని ఈదిగువ నుదహరించిన వివిధ కర్తవ్యాలు సూచింపబడుతున్నాయి. వలసదేశాల్లోనూ, అర్థవలసదేశాల్లోనూ సాగించవలసిన బూర్జువా ప్రజాతంత్ర విప్లవానికి వీటిని సాధారణంగా ప్రధాన కర్తవ్యాలుగా పరిగణించవచ్చును.

(అ) విప్లవశక్తుల సంబంధాల్లో శ్రామిక వర్గానికి అనుకూలమైనమార్పును గొనిరావడం, సామ్రాజ్యవాద బానిసత్వంనుంచి దేశాన్ని విముక్తిచెయ్యడం, (విదేశీ పెట్టుబడినీ, రైల్వేలనూ, బ్యాంకులనూ జాతిపరం చేయడం)

దేశంలో జాతీయైక్యతను సాధించడం, (అంతవరకూ జాతీయైక్యత సాధింపబడని దేశాల్లో) సామ్రాజ్యవాదులచే బలపరచబడుతోన్న దోపిడివర్గాలఅధికారాన్ని కూలదోయడం, కార్మికకర్షక సోవియట్లనుఏర్పరచడం, కార్మిక కర్షకుల నియంతృత్వాన్ని స్థాపించడం, శ్రామిక నాయకత్వాన్ని సుస్థిరంగా నెలకొల్పడం.

(ఆ) వ్యవసాయ విప్లవాన్ని కొనసాగించడం, పెట్టుబడిదారీ విధానానికి పూర్వముండే పరిస్థితులనుంచీ వలసదేశపు పరిస్థితుల నుంచీ బానిసత్వంనుంచీ, రైతులనువిముక్తిచేయడం, భూమిని జాతిపరంచేయడం, పట్టణాలకూ పల్లెటూళ్ళకూ మధ్య సాధ్యమైనంత ఎక్కువ ఆర్థిక రాజకీయైక్యత ఏర్పడేటట్లు రైతుల పరిస్థితిని బాగుచేయడానికి తీవ్రమైన మార్పులు తీసుకొనిరావడం.

(ఇ) పరిశ్రమలూ, రవాణా సౌకర్యాలూ, వగైరాలను ఇతోధికంగా అభివృద్ధి పరిచే నిమిత్తం, శ్రామికవర్గం అభివృద్ధి చెందిన కొలదీ, కార్మికవర్గంయొక్క ట్రేడ్ యూనియన్ సంఘ నిర్మాణాన్ని సర్వత్రా వ్యాప్తంగా అభివృద్ధిచేయడం, కమ్యూనిస్టు పార్టీని యింకా బలపరచడం, కష్టజీవులైన ప్రజాసామాన్యాన్ని నడిపించడంలో ప్రధాన పాత్ర వహించేటట్లు కమ్యూనిస్టుపార్టీని తయారుచేయడం, రోజుకు ఎనిమిదిగంటల పని సూత్రాన్ని సాధించడం.

(ఈ) స్త్రీపురుషులకూ, సర్వజాతులకూ సమానహక్కులు, ప్రభుత్వాన్నుంచి 'చర్చి'ని (మతబోధను) విడదీయడం, కులభేదాలను రద్దుచేయడం, పట్టణాల్లో, పల్లెల్లో ఉండే ప్రజలందరియొక్క సాంస్కృతిక స్థాయిని పెంపొందించడం, రాజకీయవిద్యను గరపడం.

ఈ ప్రధాన కర్తవ్యాలన్నిటినీ బూర్జువా ప్రజాతంత్ర విప్లవం ఆచరణలో ఎంతవరకు నెరవేర్చగలిగేదీ, వీటిలో ఎంతభాగాన్ని సోషలిస్టు విప్లవంద్వారానే అమలుపరచవలసి వచ్చేదీ కార్మిక కర్షకులు సాగించే విప్లవోద్యమంపైనా, సామ్రాజ్యవాదులకూ జమీందారులకూ, భూస్వాములకూ, పెట్టుబడిదారులకూ వ్యతిరేకంగా సాగించే పోరాటంయొక్క జయాపజయాలపైనా ఆధారపడి ఉంటుంది. పెట్టుబడిదారీ ప్రపంచంలో సోషలిస్టు విప్లవం అభివృద్ధిచెందడం సామ్రాజ్యవాదబానిసత్వం నుంచి వలసదేశం విముక్తిపొందడానికి ఎక్కువగా తోడ్పడుతుంది. ముఖ్యంగా ప్రధాన పెట్టుబడిదారీ దేశాల్లో శ్రామికవర్గం విజయాన్ని సాధించినప్పుడే వలసదేశానికి సంపూర్ణంగా విముక్తిలభిస్తుంది. అందుకు తగిన హామీ కూడా ఏర్పడుతుంది. విప్లవం సోషలిస్టుదశకు పరివర్తన చెందాలంటే దేశంలో పరిశ్రమలు కొంతవరకు అభివృద్ధిచెంది ఉండడం, శ్రామికవర్గం ట్రేడ్‌యూనియన్లలో సంఘటితమై ఉండడం, కమ్యూనిస్టుపార్టీ బలంగా ఉండడం వగైరా కొన్ని కనీసవిషయాలు అందుకు అత్యవసరం. అన్నిటికన్నా ముఖ్యంగా కమ్యూనిస్టుపార్టీ ప్రజల్లో అత్యధికంగా పలుకుబడి కలిగి బలవత్తరమైన పార్టీగా అభివృద్ధిచెంది ఉండాలి. వలసదేశాల్లో అనుకూల భౌతిక పరిస్థితులుండడంచేత బూర్జువాప్రజాతంత్ర విప్లవం త్వరితంగా అభివృద్ధి చెందుతూంటుంది. ఈ బూర్జువా ప్రజాతంత్ర విప్లవంద్వారా కమ్యూనిస్టుపార్టీ త్వరగా ముందుకు సాగిపోని పక్షంలో తర్వాత దాని అభివృద్ధి చాలా మందకొడిగా ఉంటుంది. ముందుకు సాగిపోవడం కష్టతరమవుతుంది.

(రివల్యూషనరీ మూవ్‌మెంట్ ఇన్ ది కాలనీస్ అండ్ సెమీకాలనీస్, పి. పి. హెచ్. ప్రచురణ. పేజీ 22—23)

'ప్రపంచంలో శ్రామికవర్గ నియంతృత్వం కోసం, వలసదేశాల విప్లవంకోసం పోరాటం'

అనే శీర్షిక క్రింద 'అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీ కార్యక్రమం'లో ఇలా ఉంది:

"వలసదేశాల్లోనూ, అర్ధవలసదేశాల్లోనూ ఉన్న విప్లవపోరాటంయొక్క ప్రత్యేక పరిస్థితులూ, కార్మిక కర్షకుల ప్రజాస్వామిక నియంతృత్వంకోసం, ఈ నియంతృత్వాన్ని శ్రామికవర్గ నియంతృత్వంగా మార్చడంకోసం, దీర్ఘకాలపర్యంతంజరిగే అనివార్యమైన పోరాటమూ, ఆపోరాటంలోని జాతీయస్వరూపాల యొక్క నిర్ణీతప్రాముఖ్యతా, ఇవన్నీ వలస దేశాల, అర్ధవలసదేశాల కమ్యూనిస్టుపార్టీలపై అనేక బాధ్యతల నుంచుతున్నాయి. శ్రామిక నియంతృత్వం అనే ప్రధాన ఆశయసంసిద్ధికి ఇవన్నీ సోపానాలుగా ఉపయోగపడతాయి. ఆ బాధ్యత లన్నింటిలో ఈదిగువ నుదహరించినవి అత్యంతప్రాముఖ్యమైనవిగా అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ భావిస్తోంది.

1. విదేశ సామ్రాజ్యవాదుల, స్వదేశీ సంస్థానాధిపతుల, జమీందారుల, అధికారానికీ, భూస్వాముల నిరంకుశత్వానికీ పూర్తిగా స్వస్తిచెప్పడం.

2. సోవియట్ల ప్రాతిపదికపై కార్మికుల కర్షకుల నియంతృత్వాన్ని స్థాపించడం.

3. సంపూర్ణమైన జాతీయ స్వాతంత్ర్యం, జాతీయైక్యతా సాధించడం.

4. ప్రభుత్వ అప్పులన్నింటినీ రద్దుచేసి వేయడం.

5. సామ్రాజ్యవాదుల చేతుల్లో వున్న భారీ పరిశ్రమ లన్నింటినీ (రవాణాలు, బ్యాంకులూ తదితర పెద్దపరిశ్రమ లన్నింటినీ) జాతీయంచేయడం.

6. భూస్వాముల యాజమాన్యంలోనూ మతపీఠాల యాజమాన్యంలోనూ వున్న భూములను స్వాధీనపరచుకోవడం, భూమినంతా జాతీయంచేయడం.

7. రోజుకు 8 గంటల పనిని అమలు పరచడం.

8. విప్లవకరమైన కార్మికకర్షక సైన్యాన్ని నిర్మించడం.

పోరాటంలో కార్మికవర్గమే నాయకత్వం వహించి నడిపిన వలసదేశాల్లో, అర్ధవలస దేశాల్లో బూర్జువా ప్రజాతంత్ర విప్లవమే ఏకబిగువున శ్రామిక విప్లవంలోకి మారుతుంది. పోరాటం అభివృద్ధిచెంది తీవ్రతరమైన కొలదీ పెట్టుబడిదారులు విచ్ఛిన్నచర్యలకు పూనుకుంటారు: ఆవిధంగా విచ్ఛిన్న చర్యలకు పూనుకునే పెట్టుబడిదారుల చేతుల్లో వుండే పరిశ్రమలను స్వాధీనం చేసుకోడం మూలంగా చివరకు తప్పనిసరిగా పెద్ద పరిశ్రమ లన్నింటిని జాతీయం చేయవలసి వస్తుంది. శ్రామికవర్గంలేని వలస దేశాల్లో సామ్రాజ్యవాదుల అధికారాన్ని కూలద్రోయడమంటే ప్రజల (రైతుల) సోవియట్లను నెలకొల్పవలసి వుంది. విదేశీ పెట్టుబడిదారుల చేతుల్లో వున్న పరిశ్రమలనూ, భూములనూ స్వాధీనపరచుకొని ప్రభుత్వపరం చేయవలసివుంటుంది.

(అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ కార్యక్రమం నుండి; పి. పి. హెచ్. ప్రచురణ. పేజి 46-47)

పై నుదహరించిన విషయాన్నిబట్టి వలస దేశ ప్రజాతంత్ర విప్లవాలు లేక జాతీయ ప్రజాతంత్ర విప్లవాలు శ్రామిక విప్లవానికి సోపానాలు అని స్పష్టమవుతోంది. ఈనాడు మొత్తం ప్రపంచంమీద శ్రామికవిప్లవానికి పరిస్థితులు పరిపక్వ మవుతున్నాయి. అంతర్జాతీయ పరిస్థితులూ, ప్రజలను నడపడానికి శ్రామికవర్గ సంసిద్ధత, శ్రామికవర్గ పరిపక్వత, అగ్రగామిదళంగా పనిచేసేందుకు తగిన సమర్థత కమ్యూనిస్టుపార్టీకి వుండడం వగైరా విషయాలపై మొదటి దశనుంచి రెండోదశకు ఎంత త్వరగా చేరుకోడమనే సమస్య ఆధారపడి వుంటుంది.

# 3

ప్రజాతంత్ర విప్లవం సోషలిస్టు విప్లవంగా మారుతుందని లెనినిస్టు సిద్ధాంతం. ఈ సిద్ధాంతాన్ని గురించి లెనిన్ తాను వ్రాసిన 'టు టాక్టిక్స్ ఆఫ్ సోషల్ డిమాక్రసీ'లో సమగ్రంగా వివరించాడు. 1917 విప్లవం లెనిన్ చెప్పిన సత్యాన్ని రుజువుచేసింది. కార్మిక కర్షకుల ప్రజాస్వామిక నియంతృత్వాన్నుండి శ్రామిక నియంతృత్వానికి-సోషలిస్టువిప్లవానికి-సాగిపోడానికి రష్యాలో తొమ్మిదిమాసాల కాలం పట్టింది.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ చరిత్రలో స్టాలిన్ ఇలా వ్రాశాడు :

"బూర్జువావిప్లవ విజయంకోసం, ప్రజాస్వామ్య రిపబ్లిక్ సాధనకోసం ప్రచారం చేస్తోన్న లెనిన్ అంతటితో ఆగలేదు. ప్రజాస్వామికదశలోనే ఆగిపోవడానికీ, బూర్జువా ప్రజాస్వామిక కర్తవ్యాలనునిర్వహించే విప్లవోద్యమంయొక్క అవకాశాన్ని పరిమితంచేయడానికీ లెనిన్ కేమాత్రమూ ఇష్టంలేదు. ప్రజాస్వామిక కర్తవ్యాలు పూర్తి అయిన తర్వాత శ్రామికవర్గం, పీడిత ప్రజాసామాన్యం ఇక ముందు సోషలిస్టు విప్లవం కొరకు పోరాటాన్ని ప్రారంభించాలి. లెనిన్ కిది తెలుసు. ప్రజాస్వామిక విప్లవాన్ని సోషలిస్టు విప్లవంగా మార్చడం సోషల్ డెమోక్రాట్ల విధి అని భావించాడు. లెనిన్ శ్రామికవర్గ రైతాంగాల నియంతృత్వం కావాలన్నది జారు ప్రభుత్వంపై విజయాన్ని సాధించడంతోనే విప్లవాన్ని ఆపడానికికాదు. పైగా సాధ్యమైనంత వరకు విప్లవదశను కొనసాగించడానికీ, విప్లవ ప్రతిఘాత తుదిచిహ్నాలనుకూడా నాశనంచేయడానికీ, యూరప్‌లో విప్లవజ్యోతిని వ్యాపింపజేయడానికీ; ఈలోగా, శ్రామికవర్గం తనకు తాను రాజకీయంగా శిక్షణపొందడం కోసం, గొప్ప సైన్యంగా సంఘటితంకావడంకోసం, శ్రామికవర్గానికి అవకాశాన్ని కలిగించి సోషలిస్టు విప్లవానికి సూటిగా సాగిపోవడంకోసం ఆ నియంతృత్వం అవసరమని లెనిన్ భావించాడు.

బూర్జువా విప్లవంయొక్క అవకాశాన్ని గురించి చర్చిస్తూ మార్క్సిస్టుపార్టీ దానికే స్వరూపం యివ్వవలసి వుంటుందో లెనిన్ యిలా వ్రాశాడు.

"నిరంకుశ ప్రభుత్వ ప్రతిఘటనను బల ప్రయోగంతో అణచివేయడానికిగాను, పోరాటంలో బూర్జువావర్గంయొక్క అస్థిర స్వభావాన్ని స్తంభింపజేయడానికిగాను శ్రామికవర్గం రైతాంగ ప్రజాబాహుళ్యంతో కలసి ప్రజాతంత్ర విప్లవాన్ని పూర్తిచేయాలి, బూర్జువా ప్రతిఘటనను బలప్రయోగంతో అణచివేయడానికీ, రైతాంగంయొక్క, పోరాటంలో పెటీబూర్జువావర్గంయొక్క అస్థిరత్వాన్ని స్తంభింప జేయడానికీ జనసామాన్యంలోని అర్ధశ్రామికవర్గ జనబాహుళ్యంతో కలిసి సోషలిస్టు విప్లవాన్ని పూర్తిచేయాలి. ఇవీ శ్రామికవర్గ కర్తవ్యాలు. వీటినే కొత్త ఇస్క్రాయిస్టులు (అంటే మెన్షివిక్కులు-సంపాదకుడు) విప్లవస్వభావాన్ని గూర్చి గావించే తమ వాదనల్లోనూ, తీర్మానాల్లోనూ చాలా సంకుచిత పరుస్తున్నారు."

'రెండు ఎత్తులు' ప్రచురించిన రెండు నెలలకు లెనిన్ మరొక వ్యాసంలో ఈ విషయాన్నే మరీ స్పష్టపర్చుతూ ప్రకటించాడు; ఆ వ్యాసంపేరు "రైతాంగ ఉద్యమంయెడల సోషల్ డెమాక్రాట్ల వైఖరి". ఆవ్యాసంలో లెనిన్ యిలా విశదపరచాడు :

"మనశక్తిసామర్థ్యాలనుబట్టి, చైతన్యవంతమైన, సంఘటితమైన శ్రామికవర్గ బలాన్ని

అనుసరించి ప్రజాస్వామిక విప్లవం నుండి మనం వెనువెంటనే సోషలిస్టు విప్లవానికి సాగిపోతాం. విప్లవం కుంటుపడకుండా - విప్లవ ప్రవాహం ఆగిపోకుండా - చూస్తాం మార్గ మధ్యంలో మనం ఆగిపోము."

బూర్జువా విప్లవానికీ, సోషలిస్టు విప్లవానికీ మధ్యనుండే సంబంధంపై ఇది ఒక కొత్త విధానం - 'బూర్జువా విప్లవం యొక్క అంత్యంలో సోషలిస్టువిప్లవానికి సూటిగా పరివర్తన చెందడంకోసం శ్రామికవర్గంచుట్టూ విప్లవశక్తులను తిరిగి సమీకరించే ఒక నూతనమైన సిద్ధాంతం-బూర్జువా ప్రజాతంత్ర విప్లవం సోషలిస్టు విప్లవంలోకి మారే సిద్ధాంతం.

ఈ సిద్ధాంతం పశ్చిమ యూరోపియన్ సోషల్ డెమాక్రటిక్ పార్టీల ఎత్తుగడలను ఖండించివేసింది. వారి ఎత్తుగడలప్రకారం "బూర్జువా ప్రజాతంత్ర విప్లవం తర్వాత బీద రైతులతో సహా రైతాంగజనసామాన్యం తప్పనిసరిగా విప్లవపోరాటాన్ని వదలివేస్తారు. తత్ఫలితంగా బూర్జువా విప్లవానంతరం ఒక దీర్ఘవ్యవధి కనీసం 50 ఏండ్లు లేక 100 ఏండ్ల దీర్ఘ సుషుప్తి - నిస్తబ్ధత - వస్తుంది. మరో విప్లవం - సోషలిస్టు విప్లవం - వచ్చే ఈలోగా శ్రామికవర్గం 'శాంతియుతంగా' దోపిడిచేయబడుతుంది. బూర్జువావర్గం ధనరాసుల్ని అపరిమితంగా 'న్యాయసమ్మతంగా' (చట్టబద్ధంగా) కూడబెడుతుంది."

లెనిన్ జెప్పిన ఈ నూతనసిద్ధాంతంప్రకారం మొత్తం బూర్జువావర్గానికి వ్యతిరేకంగా శ్రామికవర్గం ఒక్కటే ఒంటరిగా సోషలిస్టు విప్లవాన్ని పూర్తిచేయదు. జనసామాన్యంలో అర్ధశ్రామికవర్గానికి చెందిన కష్టజీవులైన పీడిత ప్రజాసామాన్యంతో, కలిసి శ్రామికవర్గం తన నాయకపాత్రను నిర్వహిస్తూ సోషలిస్టు విప్లవాన్ని సాధిస్తుంది.

ఈ సిద్ధాంతంప్రకారం బూర్జువావిప్లవంలో రైతాంగంతో సన్నిహిత సంబంధం కలిగివున్న శ్రామికవర్గంయొక్క నాయకత్వం సోషలిస్టు విప్లవంలో శ్రామికవర్గ నాయకత్వంగా పెంపొందుతుంది. అయితే ఈసారి శ్రామికవర్గం కష్టజీవులైన పీడితప్రజలతో సమ్మేళనమై వుంటుంది. కార్మిక కర్షకుల ప్రజాతంత్ర నియంతృత్వం శ్రామికవర్గ సోషలిస్టు నియంతృత్వానికి మార్గాన్ని సుగమం చేస్తుంది.

(సోవియట్ కమ్యూనిస్టుపార్టీ చరిత్ర: పేజి 67 నుంచి 172)

ఈ రెండు విప్లవాలు ఒకదానితో మరొకటి కలసిపోవడం సోషలిస్టు విప్లవంయొక్క పరిపక్వస్థితిని సూచిస్తుంది - ప్రపంచం సోషలిస్టు విప్లవయుగంలో ప్రవేశించిందని తెలియజేస్తుంది-పెట్టుబడిదారీ విధానం అభివృద్ధిచెందిన దేశాల్లో సోషలిస్టు విప్లవం నేటి తక్షణ కర్తవ్యంగా వుంది. తదితర వైరుధ్యాలన్నీ, నేడు, పెట్టుబడిదారీ విధానంలోని ప్రధాన వర్గసంఘర్షణముందు లోబడిపోవడం వర్గ సంఘర్షణయొక్క తీవ్రతను సూచిస్తుంది.

## 4

నేడు ఈ వైరుధ్యాలన్నీ ఇంతతీవ్రంగా పరిణమించడానికిగల కారణాలేమిటి? మొదటికారణం యుద్ధం. ఫాసిస్టువ్యతిరేక యుద్ధంలో సోవియట్ యూనియన్ ప్రధాన పాత్ర నిర్వహించింది. తత్ఫలితంగా సోషలిస్టు భూమి అయిన సోవియట్ యూనియన్ యొక్క శక్తిసామర్థ్యాలు విపరీతంగా అభివృద్ధిపొందాయి. పెట్టుబడిదారీ పరిధినుంచి తూర్పు యూరప్ దేశాలు విముక్తిచెంది బయటపడ్డాయి. అందు

వల్ల సోషలిస్టు ప్రపంచం ఇంకా ఎక్కువగా బలపడింది. సామ్రాజ్యవాద ప్రపంచంయొక్క బలం క్షీణించింది. ఇది రెండో కారణం. అమెరికా సామ్రాజ్యవాదుల ఏజెంట్లయొక్క బానిసత్వంనుంచి చైనాదేశంలో ఒక పెద్దభాగం విముక్తిచెందటంతో పెట్టుబడిదారీ విధానానికి మరో దెబ్బతగిలింది. తత్ఫలితంగా ప్రపంచమంతటా పెట్టుబడిదారీవర్గానికీ శ్రామికవర్గానికీ మధ్యజరిగే సంఘర్షణ ఇంకా తీవ్రతరమయింది. ఇది మూడో కారణం. కార్మికవర్గ ఉద్యమాలు తీవ్రంగా విజృంభించడం, అనేక దేశాల్లో కమ్యూనిస్టు పార్టీలు బలపడడం, పెట్టుబడిదారీవిధానాన్ని సుస్థిరంగా అట్టిపెట్టి ప్రజలను చిరకాలం బానిసత్వంలో బంధించజూచే మార్షల్ ప్లానుకు వ్యతిరేకంగా ఆయాదేశాల ప్రజల్లో నూతనజాగృతి పెంపొందడం, వీటిఫలితంగా వైరుధ్యం మరింత తీవ్రతరమై అంతర్యుద్ధదశకు పరిణమించింది. ఇది నాలుగో కారణం. పతనోన్ముఖమైన పెట్టుబడిదారీ విధానం సృష్టించిన దుఃఖమూ, దారిద్ర్యమూ, దురాశాపూరితమైన అమెరికా సామ్రాజ్యవాదం బలాత్కారంగా రుద్దిన బానిసత్వమూ, ప్రపంచ ఆర్థిక సంక్షోభమూ, - ఇవన్నీ-నేడు ఒకేఒకప్రశ్నను వేస్తున్నాయి. పెట్టుబడిదారీ విధానమా? సోషలిస్టు విధానమా? వలసదేశాల్లో రోజురోజుకూ విజృంభిస్తోన్న పోరాటాలు దీర్ఘకాలయుద్ధాలుగా పరిణమిస్తున్నాయి. ఈ యుద్ధాల్లో కార్మికవర్గమూ, కార్మికవర్గ పార్టీ అయిన కమ్యూనిస్టుపార్టీ నాయకపాత్ర వహిస్తున్నాయి. రాజీధోరణి నరికట్టి తదేకదీక్షతో విప్లవాన్ని కొనసాగిస్తున్నాయి అందువల్ల సామ్రాజ్యవాదంలో ఉన్న ఆంతరంగిక సంక్షోభం మరింత తీవ్రతరమయింది. సామ్రాజ్యవాదానికి వినాశకాలం దాపురించింది. వీటి ఫలితంగా సామ్రాజ్యవాద దేశాల్లో పరస్పర వైరుధ్యాలుకూడా ఇంకా తీవ్రతరమవుతాయి. వలసదేశాల పోరాటాలు పూర్తిగా శ్రామిక వర్గ ఆధ్వర్యంక్రిందికి పోతాయి. పోరాటాల్లో శ్రామికవర్గం ప్రధానపాత్ర నిర్వహించిన ఫలితంగా స్వాతంత్ర్యం సాధించిన దేశాలు పెట్టుబడిదారీ పరిధి నతిక్రమించి బైట బడతాయి. ఈనాడు ప్రపంచమంతా రెండు శిబిరాలుగా చీలిపోయింది. ఒకటి సామ్రాజ్యవాదశిబిరం. రెండవది సామ్రాజ్యవాద వ్యతిరేక శిబిరం. సామ్రాజ్యవాద శిబిరం ప్రపంచ పెట్టుబడిదారీ విధానానికీ, సామ్రాజ్యవాద వ్యతిరేక శిబిరం సోవియట్ యూనియన్ ఆధ్వర్యాన ప్రపంచ సోషలిస్టు విధానానికీ ప్రాతినిధ్యంవహిస్తున్నాయి. ఈ రెంటిమధ్య నున్న భేదం రోజురోజుకు మరింత స్పష్టంగా గోచరిస్తోంది. సోవియట్ యూనియన్‌కూ, తదితర ప్రజాతంత్ర దేశాలకూ ప్రపంచ సోషలిజానికీ వ్యతిరేకంగా సామ్రాజ్యవాదశిబిరం యుద్ధసన్నాహం చేస్తూఉంది. ప్రపంచంలో - ప్రతిదేశంలో- వర్గవైరుధ్యం మరింత తీవ్రతరం కావడంతో పెట్టుబడిదారులంతా తెగించి చిట్టచివరి ప్రయత్నంగా సోషలిస్టు, ప్రజాస్వామిక, శాంతిశక్తులకు వ్యతిరేకంగా మరో అంతర్జాతీయ యుద్ధం తెచ్చిపెట్టాలని ఉద్యమిస్తున్నారు. మరో ప్రపంచయుద్ధంకోసం కలలు గంటున్నారు.

కాబట్టి పెట్టుబడిదారీవిధానం అభివృద్ధి చెందడానికి కొంత దీర్ఘకాలం అవసరం అని వాదించడం (కొందరు కమ్యూనిస్టునాయకులు ఆవిధంగానే వాదించారు.) కేవలం అర్థంలేని విషయం. ఆ విధంగా వాదించడం ప్రజాస్వామిక విప్లవానికీ సోషలిస్టు విప్లవానికీ మధ్య ఒక పెద్ద అడ్డుగోడను నిర్మించే సోషల్ డిమాక్రాట్ల తుప్పుబట్టిపోయిన ఆ తప్పుడు సిద్ధాంతానికే తలఒగ్గడం అవుతుంది.

ఈనాడున్న ఈ ప్రపంచ పరిస్థితులనుబట్టి ప్రతిదేశంలోనూ – మన దేశంలో కూడా – అభివృద్ధి చెందుతూవున్న విప్లవాలను పరిశీలించవలసిఉంటుంది. వెనకబడిన దేశాల్లోనూ, వలస దేశాల్లోనూ ఇదివరకే జరగవలసిన ప్రజాతంత్ర విప్లవాలు నేడు పెట్టుబడిదారీ వర్గానికీ శ్రామిక వర్గానికీ మధ్య, కష్టజీవులైన ప్రజాసామాన్యానికీ– అనగా శ్రామికవర్గానికి, శ్రామికవర్గానికి చెందని తదితర కష్టజీవులైన ప్రజాసామాన్యానికీ, –మరోవైపు పెట్టుబడిదారీవర్గానికీ మధ్య సంఘర్షణ తీవ్రతరమైన నేటి పరిస్థితుల్లో ఒక్కుమ్మడిగా విజృంభిస్తున్నాయి. ప్రపంచమంతటా పెట్టుబడిదారీవర్గానికీ శ్రామికవర్గానికీ, సంఘర్షణ అత్యంత తీవ్రతరం కావడం, దానితోపాటే ప్రతిదేశంలోనూ బయులుదేరిన తీవ్రసంఘర్షణ ఫలితంగా రెండువిప్లవాలూ చాలా సన్నిహితమై ఒకదానినుంచి మరొకటి విడదీయ వీలులేనంతగా కలిసిపోతున్నాయి. రెండో విప్లవాన్ని కూడా సాధించడానికి ముందుకుసాగిపోకుండా మొదటి విప్లవాన్ని సాధించడం అసంభవమైన పరిస్థితి ఏర్పడింది. ఈ రెండు విప్లవాలు చాలా సన్నిహితంగా కలసిపోవడం వల్లనే పెట్టుబడిదారీ వర్గానికీ శ్రామికవర్గానికీ మధ్య జరుగుతూన్న అపూర్వమైన తీవ్ర సంఘర్షణే పెట్టుబడిదారీవర్గానికీ, కష్టజీవులైన తదితర ప్రజాసామాన్యానికీ మధ్యకూడా ప్రతిదేశంలోనూ జరుగుతూఉంది. అందువల్ల ప్రస్తుతం జరుగుతూన్న విప్లవాన్ని ప్రజాస్వామిక ప్రజాతంత్ర విప్లవంగా పరిగణించవలసివస్తోంది. ఈ ప్రజాస్వామిక ప్రజాతంత్ర విప్లవం సోషలిస్టు విప్లవానికి అత్యంత సన్నిహితంగానూ బూర్జువా ప్రజాతంత్ర విప్లవానికి పూర్తిగా విభిన్నంగానూ ఉంటుంది. ప్రజాస్వామిక ప్రజాతంత్రం బూర్జువా ప్రజాతంత్రానికి పూర్తిగా విభిన్నమైనది.

## 5

ఇండియాలో ప్రజాస్వామిక ప్రజాతంత్రం కోసం మనంసాగించే పోరాటంలో పైజెప్పిన లక్షణాలన్నీ మనకు కన్పిస్తాయి. ఇప్పటికే ఆలస్యమైన ప్రజాతంత్ర విప్లవాన్ని అపూర్వమైన తీవ్రవైరుధ్యాలమధ్య–ఒకవైపు పెట్టుబడిదారీవర్గానికీ మరోవైపు శ్రామికవర్గం తదితర కష్టజీవులైన ప్రజాసామాన్యానికీ జరిగే తీవ్ర వైరుధ్యం మధ్య – ముందుకు కొనిపోవలసి ఉంది. ప్రతిసమస్యపైనా పెట్టుబడిదారీ వర్గానికీ కష్టజీవులైన ప్రజాసామాన్యానికీ మధ్య

వైరుధ్యం ఏర్పడడం మనం స్పష్టంగా చూస్తూన్నాం. పై రెండువర్గాలకూ ప్రతి సమస్యపైనా వైరుధ్యం ఏర్పడడం సహజమే. అసలు పెట్టుబడిదారీ విధానమే నేడు విచ్ఛిన్నమై పోయేదశ. ఈ దశలో పెట్టుబడిదారీవర్గం ఆర్థికజీవితాన్ని పునర్నిర్మించలేదు. ఫ్యూడల్ వర్గాల దోపిడిచే ఇదివరకే క్రుంగిపోతూన్న రైతాంగాన్ని పైపెచ్చు ఇంకా బూర్జువావర్గంకూడా దోపిడీచేయ పూనుకుంటుంది. ఉదాహరణకు బూర్జువావర్గం ప్రకటించే వ్యవసాయ ప్రణాళికలనే చూడండి. అవి శ్రామికవర్గానికే కాకుండా బీద, మధ్యతరగతి రైతాంగంయొక్క ప్రయోజనాలకు కూడా విరుద్ధమైనవే.

శ్రామికవర్గంతో బూర్జువావర్గంయొక్క సంఘర్షణ తీవ్రతరమవుతుందని ఇక వేరే చెప్ప నవసరంలేదు. కమ్యూనిస్టుపార్టీపై సాగించే దాడులు, దేశమంతటా జరిగే సమ్మెపోరాటాలు, కార్మికులపై అమలుజరిపే నిర్బంధ విధానమూ, క్రొత్తగా ప్యాసుచేసిన నిరంకుశ చట్టాలూ, కార్మికుల కూలివిషయమై ప్రభుత్వమవలంబించే వైఖరీ, – ఇవన్నీ వైరుధ్యం తీవ్రతరం అయిందని అనడానికి ప్రత్యక్ష నిదర్శనలు. వ్యక్తిగత ఉత్పత్తి విధానాన్ని అట్టిపెట్టడం, పరిశ్రమలను జాతీయంచేయ నిరాకరించడం, అధికలాభాలను అరికట్టుటకు పూనుకోకపోవడం, అధికధరలకూ, నోట్లముమ్మరానికీ దారితీసేపంథా నవలంబించడం, దొంగ మార్కెట్ సమస్యను పరిష్కరించలేకపోవడం వీటి అన్నిటిఫలితంగా బూర్జువావర్గం శ్రామికవర్గంతోపాటు పట్టణాల్లో, పల్లెల్లో నివసించే తదితరకష్టజీవులైన ప్రజాసామాన్యమంతటితోను సంఘర్షణకు తలపడుతూఉంది. అసలు పెట్టుబడిదారీ విధానమే సమూలంగా విచ్ఛిన్నమై పోతూన్న ఈ దశలో ప్రపంచ పెట్టుబడిదారీ విధానంతో ఇండియా భవిష్యత్తును ముడిబెట్టడం, ఆర్థిక సంక్షోభంయొక్క భారాన్ని అంతా ప్రజలనెత్తిపై మోపడానికి ప్రయత్నించడం, ఇందువల్ల పెట్టుబడిదారీవర్గమూ ఆవర్గప్రభుత్వమూ ప్రజాసామాన్య ప్రయోజనాలకే విరుద్ధంగా నడిచి ప్రజలందరితో సంఘర్షణకు తలపడుతూఉంది.

ఎక్కువమందికి పనిచూపెట్టడానికి పరిశ్రమలను నిర్మించే విషయంలోనేమి, నేషనల్ ప్లానింగు విషయంలోనేమి, ధరలవిషయంలోనూ, ఆర్థికవిధానంలోనూ ప్రభుత్వం అవలంబించే వైఖరిలోనేమి, అభ్యుదయకరమైన, మనం బలపరచదగిన విషయమంటూ మచ్చుకు ఒక్కటికూడాలేదు. ప్రతిసమస్యలోనూ పరివర్తనదశలో ప్రజాస్వామిక ప్రజాతంత్ర ప్రభుత్వంమాత్రమే సాధించగలిగే కార్యక్రమాన్ని అవలంబించడంతప్ప శ్రామికవర్గం చేయగలిగింది మరేమీలేదు. ప్రతిరంగంలో, ప్రతికార్యంలో, ప్రతివిషయంలో పెట్టుబడిదారీవర్గం అభివృద్ధినిరోధకంగా వ్యవహరిస్తూఉంది. శ్రామికవర్గం ఈ అభివృద్ధినిరోధక కార్యక్రమాన్ని పూర్తిగా శ్రామికవర్గ పద్ధతులద్వారా ఎదిరించవలసి వస్తుంది. ప్రజాతంత్ర విప్లవంకోసం వేసే ప్రతి ముందడుగూ తప్పకుండా పెట్టుబడిదారీ వ్యతిరేక స్వరూపాన్ని తీసుకుంటుంది. ఈ విధంగా (విప్లవంలోని) రెండుదశలూ పరస్పరం కలిసి పెనవేసుక పోతున్నాయి.

వెనకటి పరిస్థితులకంటె నేటి పరిస్థితి పూర్తిగా విభిన్నమైనది. పెట్టుబడిదారీ వర్గం నుంచి అధికారాన్ని గుంజుకోవడం, పెట్టుబడిదారీవర్గంయొక్క రాజకీయాధికారాన్ని తొలగద్రోయడం నేటివిప్లవంయొక్క తక్షణ ఆశయం. వెనకటిరోజుల్లో – పూర్వపుదశలో ప్రజాస్వాతంత్ర్య విప్లవం సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా సాగింపబడేది. బూర్జువావర్గంయొక్క ఊగిసలాటను స్తంభింపచేయడానికి ప్రయత్నించేది. కాని ఇప్పుడు బూర్జువావర్గానికి పూర్తిగా ఎదురుబదురుగా నిలబడి బూర్జువావర్గాధికారాన్ని సూటిగా దెబ్బ

గొట్టడమే ప్రజాతంత్ర విప్లవంయొక్క ఆశయం. ఈనాడు బూర్జువావర్గంయొక్క ఊగిసలాటను స్తంభింపచేయడంకాదు కావలసింది. పూర్తిగా బూర్జువావర్గాన్ని రాజకీయ పోరాటంలో ఓడించడమే, జయించడమే ప్రజాస్వామిక ప్రజాతంత్ర విప్లవంయొక్క తక్షణ రాజకీయాశయం.

ఇదిప్రస్తుతపరిస్థితియొక్క సరికొత్తలక్షణం. పరిస్థితుల్లో ఎట్టిమార్పు రాలేదనే వాళ్ళూ, వెనకటిలాగానే ఇప్పుడుకూడా కూలద్రోయవలసింది సామ్రాజ్యవాదాన్నే అని వాదించే వాళ్ళూ, బూర్జువా వర్గాధికారాన్ని తొలగించాల్సిన నేటి ఆవశ్యకతనుబట్టి కొత్తగా ఏర్పడిన వర్గసంబంధాలను మరుగుపరిచేవాళ్ళూ, అవకాశవాదధోరణి నవలంబించి నూతన పరిస్థితిని గ్రహించలేకపోయ్యారు. నేటి ఈ ఆవశ్యకతయే ప్రజాస్వామిక విప్లవపోరాటానికీ శ్రామికవర్గ విప్లవపోరాటానికీ సంబంధం కలుపుతోంది. బూర్జువావర్గాధికారాన్ని కూలద్రోయకుండా ప్రజాస్వామిక విప్లవాన్ని సాధించడం అసంభవమని నేడు విస్పష్టంగా కనిపిస్తోంది.

ఈ పోరాటంలో సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంయొక్క స్థాన మెంతవరకుంది? దీన్నికూడా మరోవిభిన్నస్థాయిలో కొనసాగించవలసి ఉంటుంది. పెట్టుబడిదారీవర్గం 'జాతీయప్రభుత్వాన్ని' చేపట్టి దానిని ప్రపంచ పెట్టుబడిదారీవిధానంతో ముడిబెట్టింది. ఒక ఉపగ్రహరాజ్యంగా తయారుచేసింది. ఈనాడు నిజమైన స్వాతంత్ర్యాన్ని సాధించడమంటే ప్రపంచ పెట్టుబడిదారీ విధానంయొక్క పరిధి నుంచి దేశాన్ని బైటబడేటట్లుచేసి సోషలిస్టు రంగంలోకి – సోషలిస్టు విధానంలోకి – తీసుకొనిరావడంఅన్నమాట. స్వేచ్ఛాస్వాతంత్ర్యాలంటే నేడు ఒక దేశంయొక్క సామ్రాజ్యవాదంనుంచో లేక మరో దేశంయొక్క సామ్రాజ్యవాదంనుంచో బైటబడడంగాదు; మొత్తం ప్రపంచ పెట్టుబడిదారీ విధానం నుంచే బైటబడడం. కాబట్టి నేడు నిజమైన స్వాతంత్ర్యం అనేది స్వదేశీ పెట్టుబడిదారులతోపాటు విదేశీపెట్టుబడిదారుల ఓటమితో కూడా ముడిపడిఉంది. మొత్తం పెట్టుబడిదారీ విధానంనుంచి పూర్తిగా తెగతెంపులు చేసుకోడమే నేటి నిజమైన స్వాతంత్ర్యం.

విప్లవం ఫ్యూడలిజాన్నికూడా పూర్తిగా తుడిచిపెట్టివేయవలసి ఉంటుందని ఇక వేరే చెప్పనవసరంలేదు. కాని ఇదికూడా పల్లెల్లో ఉన్న పెట్టుబడిదారులకు వ్యతిరేకంగా పోరాటం కొనసాగించకుండాను, అదే సమయంలోనే బూర్జువావర్గ రాజకీయాధికారాన్ని కూలద్రోయడానికి కూడా పోరాడకుండానూ సాధ్యపడదని మనకు స్పష్టంగా కనిపిస్తోంది. అందువల్ల పోరాటం యొక్క ఫ్యూడల్ వ్యతిరేక స్వరూపమూ, పెట్టుబడిదారీ వ్యతిరేక స్వరూపమూ రెండూ ప్రాముఖ్యత వహిస్తున్నాయి.

ఈ విధంగా ఈ రెండు స్వరూపాల సమ్మిశ్రణ – కలయిక–యే మనదేశంలో ప్రజాస్వామిక ప్రజాతంత్ర విప్లవావసరాన్ని కల్పిస్తూ ఉంది.

## 6

నేటి భారతదేశ విప్లవదశను రష్యాలోని ఫిబ్రవరి విప్లవదశతోగానీ లేక నవంబరువిప్లవ దశతోగానీ పోల్చవచ్చునా? నేటి భారత దేశ విప్లవదశ రష్యాలోని అటు ఫిబ్రవరి దశా కాదు; ఇటు నవంబరు విప్లవదశాకాదు; ఆ రెండు విప్లవదశలయొక్క మిశ్రమమే నేటి భారతవిప్లవం. ఇండియాలో ఈ రెండుదశలూ మిళితమై పోవటమనేది రష్యాలో జరిగినట్లుగా ఖచ్చితంగా అదేపద్ధతిమీద జరగలేదు. మన లక్ష్యం నిరంకుశ ప్రభుత్వాన్ని కూలద్రోయడం

గాదు. బూర్జువా అధికారాన్నే తొలగించడం. కాబట్టి ఇది ఫిబ్రవరి విప్లవంగాదు. బూర్జువా వర్గంయొక్క అస్థిత్వాన్ని స్తంభింపజేయడం కాదు మన ఆశయం. ఆ వర్గాన్నే త్రోసి వేయడం మన ఆశయం.

బూర్జువా అధికారాన్ని మనం తొలగిస్తున్నా వెంటనే మనం శ్రామికవర్గ నియంతృత్వం అనే నినాదం ఇవ్వగలిగితేము కాబట్టి ఇది నవంబరు విప్లవదశకూడా కాదు. మధ్యస్థ ప్రజలయొక్క, పార్టీలయొక్క, వర్గాలయొక్క అవకాశాలకు పూర్తిగా ఇంకా తావులేకుండా పోలేదు. కాబట్టి వాటితో కలిసి ఒకసంఘటనగా ఏర్పడవలసిన అవశ్యకతను త్రోసివేయడానికి వీల్లేదు. బూర్జువాప్రభుత్వం విప్లవపంథా ననుసరించి ఫ్యూడల్ సంబంధాలను నిర్మూలించ లేకపోవడం– అంటే ప్రజాస్వామిక విప్లవకర్తవ్యాలను నెరవేర్చలేకపోవడం – వల్ల పెటీబూర్జువా ప్రజా బాహుళ్యమూ మధ్యతరగతి రైతులూ బూర్జువా వర్గంతో సంఘర్షణకు దిగవలసి రావడం మనం స్వయంగా ఒకవైపు చూస్తూనేఉన్నాం. ఈ శక్తులు మనకు చాలా ఉపయోగకరమైనవి. ఈ శక్తులు ఇంకా తమ అవకాశాలను కోల్పోలేదు అనే విషయం మరచిపోవడం ఆశక్తులయొక్క చైతన్యాన్ని తక్కువఅంచనా వేసి దాటిపోవడమే అవుతుంది. ప్రజాతంత్ర సంఘటనను విచ్ఛిన్నంచేసి ఆశక్తులను బూర్జువావర్గం చేతుల్లో ఒప్పగించడమే అవుతుంది. ప్రజాస్వామిక నియంతృత్వానికున్న అవకాశాలన్నీ అయిపోయిన తర్వాతనే అధిక సంఖ్యాక ప్రజలను తమవైపు రాబట్టుకున్న మీదటనే, రష్యాలో బోల్షివిక్కులు శ్రామికవర్గ నియంతృత్వం అనే నినాదాన్ని ఇవ్వగలిగారు.

మనం నవంబరు విప్లవదశలో ఉన్నాం అని వాదించేవారు నవంబరుకు పూర్వం రష్యాలో బూర్జువా నియంతృత్వంతోపాటు మరోవైపున కార్మికకర్షకుల ప్రజాస్వామిక నియంతృత్వం కూడా ఏర్పడి ఉన్నదనీ, అప్పటి రష్యా జన సామాన్యపు పెటీబూర్జువా స్వభావఫలితంగా కార్మిక కర్షకుల ప్రజాతంత్ర సంఘటన తప్పని సరి అయిందనీ మరచిపోతున్నారు.

అయితే ఈ సందర్భంలో మరో ముఖ్య విషయాన్నికూడా మనం గుర్తుంచుకోవలసి ఉంటుంది. పోరాటగమనంలో మనం నూటిగా శ్రామికవర్గ నియంతృత్వానికి సాగిపోయేదీ లేనిదీ గట్టిగా ఎవరూ చెప్పలేరు. శ్రామికవర్గ నియంతృత్వానికి నూటిగా సాగిపోవడమనేది శ్రామికవర్గంయొక్క శక్తిపై, ఆ వర్గంయొక్క నాయకత్వంపై, కష్టజీవులను నడుపగల సామర్థ్యంపై, పోరాటగమనంలో శ్రామిక వర్గానికిచెందని ఇతర కష్టజీవులైన ప్రజా సామాన్యం ఎంత త్వరగా బూర్జువావర్గంపై తమకున్న భ్రమలను పోగొట్టుకుంటుందనే విషయంపై, ఆధారపడిఉంటుంది. దీన్ని గురించి ముందే ఇదమిత్థమని చెప్పడానికి సాధ్యపడదు. ప్రస్తుత పరిస్థితుల్లో పరస్పర సంబంధంగల శక్తులయొక్క బలంపైనే ఆధారపడి మనం పనిచేయవలసి ఉంటుంది.

మొత్తంమీద దీని సారాంశం మధ్యతరగతి ప్రజలవిషయంలో శ్రామికవర్గం ఎక్కువ ప్రాముఖ్యత నివ్వాలి. ఆప్రజలను తమవైపు రాబట్టుకోవాలి. వారిలో చీలికలు కలగకుండా చూడాలి. వారిని తప్పుదారి పట్టించడానికి బూర్జువావర్గంచేసే ప్రతిఎత్తునూ భగ్నం చేయాలి. వారి స్వానుభవంద్వారానే బూర్జువా వర్గంపై వారికున్న భ్రమలన్నీ తొలగిపోయేటట్లు చేయడానికి తగిన ఎత్తుగడల నవలంబించాలి. వట్టి పదాడంబరమూ, మధ్యస్థ ప్రజలు నిర్దిష్టమైన కృషి ఏమీ లేకుండానే తమంతతామే వచ్చి కలుస్తారని అనుకోవడం, సందర్భశుద్ధిలేకుండా ఊరికే మూలసూత్రాలు వల్లించడం, వీటివల్ల బూర్జువావర్గా

నికీ, ఆవర్గానికి ఏజెంట్లయిన సోషలిస్టులకూ చోరవనిచ్చిన వారమవుతాం.

మొత్తం ప్రపంచంలోనూ, ప్రతిదేశంలోనూ, సోషలిస్టు విప్లవంతో ఇదివరకెన్నడూ లేనంత యెక్కువగా సమ్మిళితమైపోయిన ప్రజాతంత్ర విప్లవమే ప్రజాస్వామిక ప్రజాతంత్ర విప్లవం. అధికారంనుంచి బూర్జువా వర్గాన్ని తొలగించడంతో ఈ విప్లవం ప్రారంభమవుతుంది. మన దేశంలో మొట్టమొదట ఏర్పడే ప్రభుత్వంయొక్క స్వరూపం ఇప్పటి మన దృష్టికందినంతవరకు శ్రామికవర్గం, ఆవర్గానికి చెందని తదితర ప్రజాసామాన్యంయొక్క సంఘటనగా ఉంటుంది. అంటే కార్మిక కర్షకుల ప్రజాస్వామిక నియంతృత్వం అన్నమాట. ప్రపంచ సోషలిస్టు విప్లవసమయంలో, పెట్టుబడిదారీ పరిపాలనకు వ్యతిరేకంగా సూటిగా పోరాటం సాగించేదశలో ఏర్పడే ఈ ప్రభుత్వం - కార్మిక కర్షకుల ప్రజాస్వామిక నియంతృత్వం - అతిశీఘ్రంగానే శ్రామికవర్గ నియంతృత్వంలోకి మారుతుంది. ఈ ప్రభుత్వంయొక్క కార్యక్రమం అయిన భూములనూ భారీపరిశ్రమలనూ జాతీయం చేయడం ద్వారా కార్యక్రమంలోనే పరివర్తనదశకు చెందిన కార్యక్రమం కూడా ఇమిడిఉంటుంది.

ఈ ప్రభుత్వం - కార్మిక కర్షకుల ప్రజాస్వామికసంఘటన-ఎట్టి కాలవ్యవధిలేకుండానే ముందుకు సాగిపోతుంది. పట్టణాల్లో పల్లెల్లో ఉన్న పెట్టుబడిదారీ శక్తులను వ్యతిరేకంగా వెంటనే చర్యతీసుకుంటూ, ఆ శక్తులను బలహీనపర్చే పంథాను కొనసాగిస్తుంది. సోషలిస్టు దేశాలు సహాయంచేసే టెక్నికల్ సాధన సంపత్తిద్వారా శీఘ్రంగాపురోగమించడానికీ, పరిశ్రమల పునర్నిర్మించుకోడానికీ సోషలిస్టు పద్ధతులపై ఆర్థికవిధానాన్ని పునర్నిర్మించుకోడానికీ ఇదివరకెన్నడూ లేనంత అవకాశంఉంది. కాబట్టి పెట్టుబడిదారీ శక్తులను త్వరగానిర్మూలించగలిగి ఉంటుంది.

రాజకీయంగా, ఆర్థికంగా పెట్టుబడిదారులు చేసే విచ్ఛిన్నచర్యలకు వ్యతిరేకంగా శ్రామికవర్గం ప్రజాతంత్ర సంఘటనను యెంతవరకు ఖచ్చితంగా శక్తిమంతంగా ముందుకు నడిపిస్తుందో, అంతవరకు రాజ్యాంగ యంత్రం శ్రామికవర్గ నియంతృత్వంలోకి పరిణతి చెందుతుంది. తర్వాత ఈ ప్రజాతంత్ర సంఘటన స్థానాన్ని ఐక్యశ్రామికవర్గ నాయకత్వం తీసుకుంటుంది. ప్రజాస్వామిక ప్రజాతంత్రానంతరం వర్గసంఘర్షణ తీవ్రంగా ఉండదనీ, పూర్తిగా సమసిపోతుందనీ అనుకోవడంలోనే టిటోముఠా తప్పుజేసింది. తన మిత్రవర్గంయొక్క ఊగిసలాటకు వ్యతిరేకంగా శ్రామికవర్గం పోరాడవలసి వుంటుంది. రాజ్యాంగ యంత్రాన్ని ఇంకా ముందుకు నడిపించవలసి వుంటుంది. బూర్జువావర్గాన్ని అణచివేసి సోషలిజంవైపు పురోగమించడానికి నిర్దిష్టపంథా నవలంబించవలసి వుంటుంది. తన మిత్రవర్గాన్ని అంతటినీ తన నాయకత్వం క్రిందకు శ్రామికవర్గం తెచ్చుకున్నప్పుడే యిదంతా సాధ్యపడుతుంది. అప్పుడే శ్రామికవర్గ నియంతృత్వం ఏర్పడుతుంది.

వార్సాలో జరిగిన తొమ్మిది కమ్యూనిస్టు పార్టీల సమావేశంలో అంతర్జాతీయ పరిస్థితిపై కామ్రేడ్ జదనోవ్ ఇచ్చిన రిపోర్టులో ప్రజాస్వామిక ప్రజాతంత్ర ప్రభుత్వమంటే కార్మికవర్గ నాయకత్వాననడిచే సంఘటన అనీ, రైతులతో ప్రజలతో కూడిన ఈ సంఘటనలో బూర్జువావర్గానికెట్టి స్థానంలేదనీ చెప్పాడు. ఈ సంఘటన (పరిశ్రమలూ భూములూ వగైరాలను జాతీయంచేసి) బూర్జువా ప్రజాతంత్రంకంటె చాలా ముందుకు పోయిందనీ - సోషలిజంవైపు పురోగమిస్తుందనీ - కామ్రేడ్ జదనోవ్ స్పష్టంచేశాడు.

సోవియట్ యూనియన్‌కు అనుకూలమా? ప్రతికూలమా? అనే వ్యాసంలో (15-1-49 జనత చూడండి) కూసినెన్ కూడా ప్రజా

స్వామిక ప్రజాతంత్ర ప్రభుత్వాన్ని సోషలిజానికి పరివర్తన చెందే పరివర్తన దశ అని పేర్కొన్నాడు. ఇది చాలాముఖ్యమైన విషయం. ఈ పరివర్తనదశలో - మాధ్యమిక దశలో-వర్గసమస్యపై అంతిమనిర్ణయం జరగబోతుంది. కాబట్టి వర్గసంఘర్షణకూడా అత్యంత తీవ్రతరం అవుతుంది. రాజకీయాధికారంనుంచి బూర్జువావర్గం తొలగింపబడినా ఆర్థికంగాకూడా ఇంకా అపర్గాన్ని ఓడించవలసి ఉంటుంది.

# 7

ప్రజాస్వామిక ప్రజాతంత్రంలో అసలు స్వభావరీత్యా నూతనత్వం ఏమీలేదు. ప్రపంచమంతటా సంఘర్షణ తీవ్రతరమైన సందర్భంలో సోషలిస్టు విప్లవంలోకి పరిపక్వమవుతూఉన్న, ఇంతకుపూర్వమే జరగవలసిన, ప్రజాతంత్ర విప్లవమే నేటి ప్రజాస్వామిక ప్రజాతంత్రం. ప్రస్తుత పరిస్థితులకు లెనినిజాన్ని సరిగా అన్వయించడమే ప్రజాస్వామిక ప్రజాతంత్రం. అంతేగాని శ్రామికవర్గ నియంతృత్వానికి ఇది ఒక ప్రత్యామ్నాయంగాదు. ఇది ఒక ప్రత్యేక దశలో ఆదశకు సంబంధించిన వర్గసంబంధాలనూ, పరిస్థితులనూ సరిగా అంచనావేయడం మీద ఆధారపడిన శ్రామికవర్గ నాయకత్వం అనే సూత్రాన్ని అన్ని విప్లవదశలకూ సక్రమంగా సమన్వయించిన దాని ఫలితమే మన దేశంలోని ప్రజాస్వామిక ప్రజాతంత్రం.

ఈ ప్రజాస్వామిక ప్రజాతంత్రంలో చురుకుగా ఏ వర్గాలు పాల్గొంటాయో గ్రహించడం తేలిక అయినవిషయమే. బూర్జువా వర్గానికీ శ్రామికవర్గానికీ మధ్య, బూర్జువా వర్గానికీ తదితర వర్గాలకూ మధ్య వైరుధ్యం తీవ్రతరం కావడంవల్ల ఒక్క శ్రామికవర్గమే పట్టినపట్టు సడలకుండా దీన్ని నడిపించగలదు. ఈవర్గానికి ఎప్పుడూ తొణకకుండా అండగా నిలబడేది పల్లెల్లోఉండే శ్రామికులు తర్వాత పేదరైతులు. మధ్యతరగతి రైతులు ఊగిసలాడుతూ ఉంటారు. కాని వారిని శ్రామిక వర్గం తనవైపు రాబట్టుకోవలసి ఉంటుంది. అదేవిధంగా పెటీ బూర్జువావర్గంకూడా ఊగిసలాడుతూ ఉంటోంది. క్రమక్రమంగా సోషలిజంవైపు మొగ్గుతూన్న ఈవర్గాన్ని కూడా తనవైపు రాబట్టుకోవలసి ఉంటుంది. తదితరవర్గాలు ఇంకా ఎక్కువగా ఊగిసలాడుతూ ఉంటాయి. కాబట్టి ఆవర్గాల్లో చీలిక బయలుదేరుతుంది. మేధావుల విషయంలోకూడా ఇంతే. శ్రామికవర్గంనుంచి కొన్నిగ్రూపులనుచీల్చి తనవైపు రాబట్టుకోడానికి బూర్జువావర్గం నానావస్థ పడుతుంది. బూర్జువావర్గానికీ, శ్రామికవర్గానికీ ఇదొక తీవ్రమైనపోటీ. మధ్యస్థంగా ఊగిసలాడే గ్రూపులను కలుపుకోడానికి శ్రామికవర్గం సిద్ధాంతరీత్యా కార్యరీత్యా తీవ్రంగా పోరాడవలసి ఉంటుంది.

ప్రజాస్వామిక ప్రజాతంత్ర విప్లవంలో కూడా శ్రామికవిప్లవాన్ని సాధించేవర్గ సమ్మేళనమే - పల్లెల్లోని శ్రామికులతో పేద రైతులతో ఐక్యమైన శ్రామికవర్గమే - నాయకత్వపాత్ర నిర్వహించే ప్రధాన సమ్మేళనగా ఉంటుంది. ఈ సమ్మేళనయొక్క బలంపైనే ఒకదశ మరోదశలోకి ఎంతత్వరితంగా పరిణతి చెందేదీ ఆధారపడి ఉంటుంది. ఈవిధంగా విప్లవంలోని రెండుదశలూ ఒకదానితో మరొకటి కలిసిపోవడం మనం మరోసారి స్పష్టంగా చూస్తున్నాం.

[1949 జనవరి 'కమ్యూనిస్టు' మాస పత్రికలో ఆ పత్రికా సంపాదకవర్గం అధికార రీత్యా చేసిన ప్రకటన]

14

# వ్యవసాయ సమస్య

## :: భారత విప్లవ పోరాటం ::

వ్యవసాయ సమస్యకు సంబంధించిన మౌలసూత్రాలపై కొందరు వెలిబుచ్చిన సందేహాలకు సమాధానంగా కమ్యూనిస్టుపార్టీ వ్యవసాయక సమస్యపై తిరిగి నూతనంగా తన దృక్పథాన్ని విపులీకరించవలసిన అవసరం వచ్చింది. నూతన సంఘటనలను దృష్టిలో వుంచుకొని గ్రామసీమల్లోని వర్గసంబంధాలను సరిగా అంచనావేసి తదనుగుణ్యంగా వ్యూహాన్నీ, పోరాటపు ఎత్తుగడలనూ నిర్ణయించుకోవాలి.

కమ్యూనిస్టు ఇంటర్‌నేషనల్ ఆరో కాంగ్రెసు వలసదేశాల సమస్యపై ఆమోదించిన తీర్మానం నాటిపరిస్థితిని యీ క్రింది విధంగా వివరించింది :

"వలసదేశాలలోని అత్యధిక సంఖ్యాకులైన ప్రజానీకమంతా గ్రామాలలో నివసించుతూ భూమిపైనే ఆధారపడివుంది. కాబట్టి కర్షకావళిని సామ్రాజ్యవాదమూ, దానికితోడుగా వుండే భూస్వాములూ వడ్డీవ్యాపారులూ, దోపిడీచేసే పద్ధతులు ఒక ముఖ్యమైన ప్రత్యేకరూపాన్ని పొంది వున్నాయి. సామ్రాజ్యవాదంయొక్క జోక్యంవుండటంవలనా, (పన్నులను విధించడం, సామ్రాజ్యవాద దేశాలనుండి పారిశ్రామిక వస్తువులను దిగుమతి చేయడంవలన) గ్రామాలలోకి డబ్బుచెలామణీ, వ్యాపారం, మారకపద్ధతులు ప్రవేశించడం మూలంగానూ, రైతాంగం మరింత దరిద్రస్థితికి దిగజారడం, గ్రామాలలో చేతిపరిశ్రమలు నాశనమయ్యే పరిస్థితులు ఏర్పడటమూ ప్రారంభమైంది. ఈ విధమైన పరిణామం ప్రధాన పెట్టుబడిదారీ దేశాలలో జరిగినదానికంటే యింక ఎక్కువత్వరితంగా యిక్కడ జరుగుతోంది. రెండోప్రక్కన వలసదేశాలలో పారిశ్రామికాభివృద్ధి ఆలస్యంగా జరగడం మూలంగా శ్రామికవర్గ అభివృద్ధికూడా చాలా సంకుచిత హద్దుల మధ్యనే జరుగుతూవుంది. పాతకాలపు ఆర్థిక విధానం ఇంత త్వరితంగా నాశనంకావడం మూలంగానూ దానిస్థానే నూతన ఆర్థిక విధానం అభివృద్ధిచెందడంలో యింత ఆలస్యం జరగడం మూలంగానూ చైనా, ఇండియా, ఇండోనీషియా, ఈజిప్టు మొదలుగాగల దేశాలలో వ్యవసాయంపై విపరీతమైన ఒత్తిడి ఏర్పడింది. అందుమూలంగా వ్యవసాయకులు వలసపోవడం, పన్నులు, మక్తాలు అధికమవడం, రైతాంగం సాగుచేసే భూఖండాలు మరింత చిన్నాభిన్నమై ముక్కలు ముక్కలుగా చీలిపోవడం సంభవించింది. కాని అదే

సమయంలో వెనకటి భూస్వామిక, అర్ధ భూస్వామిక, బానిస, దోపిడి విధాన భారమంతా – ఒక విధంగా 'ఆధునికం చేయబడ్డా'(కాని ఏమీ తగ్గించలేదు)-యథా ప్రకారంగానే రైతాంగం మోయవలసివచ్చింది. పెట్టుబడిదారీ విధానం, వలసదేశాల్లోని గ్రామాలలో పన్నులు విధించినప్పటికీ, వ్యాపార, మారకవిధానాలను ప్రవేశపెట్టినప్పటికీ, పెట్టుబడిదారీ విధానానికి పూర్వంవున్న ఆర్థిక సంబంధాలను (గ్రామ కమ్యూన్‌లను నాశనంచేయడం ముఖ్యమైన వాటిని) తలక్రిందులు చేసినప్పటికీ, పెట్టుబడిదారీవిధానానికి ముందున్న బానిసత్వం నుండిగానీ, దోపిడీవిధానం నుండిగాని రైతాంగాన్ని విముక్తిచేయలేకపోయింది. ఆ దోపిడీవిధానానికి డబ్బు చెలామణి రూపం (ఇదివరకు కౌలు ధాన్యరూపేణా చెల్లించుకోవలసివస్తే యిప్పుడు కొంతవరకు డబ్బు రూపేణా, యిదివరకు వస్తువులరూపంలో చెల్లించే పన్నులు ఇప్పుడు డబ్బురూపేణా చెల్లించడం వగైరా) మాత్రం కల్పించబడింది. ఇది రైతాంగంయొక్క కష్టాలను మరింత అధికంచేసింది. రైతాంగం యిటువంటిఆర్థికదుస్థితిలో ఇండియా చైనా లాంటి దేశాలలోని కొన్ని ప్రాంతాలలో వడ్డీవ్యాపారి రైతుల 'ఉద్ధరించే' పేరుతో తన దోపిడీ పద్ధతులకు పాల్పడ్డాడు. రైతుల రుణభారాన్ని వినియోగించుకొని, వారిని వడ్డీవ్యాపారి వంశపారంపర్యంగా బానిసత్వంలో వుంచడం జరుగుతోంది.

వివిధ వలసదేశాలలోనూ, ఒక దేశంలోనే వివిధప్రాంతాలలోనూ, వేరువేరుగా ఎంతో తేడాలతో కూడిన వ్యావసాయిక పరిస్థితులున్నప్పటికీ కర్షక జనసామాన్యం యొక్క దారిద్ర్యస్థితిగతులు మాత్రం అన్నిచోట్లా దాదాపు ఒకేవిధంగా ఉన్నాయి. అసమానత్వంతో కూడుకొన్న అననుకూలమైనట్టి మారకపు పద్ధతులవల్ల, కొంతవరకూ ప్రత్యక్ష దోపిడీవిధానం అమలు జరపడంవల్ల కొంతవరకూ యీ దేశాలలోని రైతాంగం టెక్నికల్‌గానూ, నిర్మాణ రీత్యానూ తన ఆర్థికవిధానాన్నీ, వ్యవసాయాన్నీ పెంపొందించుకొనే స్థితిలో లేదు. పురాతనకాలపు ఇరిగేషన్ (నీటి పారుదల) పద్ధతులు ఈదేశాలలోని వ్యవసాయానికి ఎంతో ఉపయోగకరంగా ఉండేవి. పురాతనకాలపు నీటిపారుదల పద్ధతులు, సామ్రాజ్యవాదం అడుగుపెట్టిన పుణ్యమా అంటూ మొట్టమొదట్లోనే శిథిలమైపోయాయి. ఆ తరువాత పెట్టుబడిదారీ విధానపు పద్ధతులపై తిరిగి నిర్మించబడ్డాయి. కాని యివి రైతులు భరించలేనంత వ్యయంతో కూడుకొన్నవై పోయాయి......

వలస ఆర్థికవిధానానికి దెబ్బతగులకుండా వ్యవసాయ సంస్కరణలను ప్రవేశపెట్టే అల్ప ప్రయత్నాలన్నీ అర్ధఫ్యూడల్ భూస్వామ్యవిధానాన్ని క్రమేణా పెట్టుబడిదారీ భూసామ్య విధానానికి మార్చడానికిమాత్రమే ఉద్దేశించబడ్డాయి. కొన్నికొన్ని సందర్భాలలో యీ సంస్కరణలు అత్యల్పసంఖ్యాకులైన కులక్ రైతాంగ వర్గాన్నొకదానిని (ధనిక రైతులను) సృష్టించడానికి మాత్రమే ఆచరణలో ఉపకరిస్తున్నాయి. ఇదంతా రైతుల్లో అత్యధిక సంఖ్యాకులను మరింత దరిద్రులను చేస్తుంది. దానితో అంతరంగిక (దేశంలోని) మార్కెట్టు అభివృద్ధి స్తంభిస్తుంది. ఇలాంటి పరస్పర విరుద్ధకరమైన ఆర్థిక పరిణామం మూలంగానే వలసదేశాల ఉద్యమంలోని అతి ముఖ్యమైన సామాజికశక్తుల పురోగమనం యిమిడి ఉంటుంది."

(“వలస దేశాలలోని, అర్ధ వలస దేశాలలోని విప్లవోద్యమం” పి. పి. హెచ్. ప్రచురణ 16–18 పేజీలు)

బ్రహ్మాండమైన పెట్టుబడిదారీ ఆర్థిక సంక్షోభానికీ, రెండో ప్రపంచ యుద్ధానికీ, దానికి ముందున్న ఆర్థిక పరిస్థితులకీ పూర్వమున్నట్టి రెండు దశాబ్దాల క్రిందటి విషయం ఇది.

సామ్రాజ్యవాదుల అడ్డంకులను అధిగమించి అభివృద్ధి చెందిన భారత పరిశ్రమల ఫలితంగా వాణిజ్యవ్యాపారాలూ, పట్టణాలూ అభివృద్ధి కావడం, వస్తూత్పత్తి పెరగడం, గ్రామసీమల్లో జరిగే వ్యవసాయోత్పత్తి మార్కెట్టు అమ్మకానికి తయారౌతూ వుండడం మనం యిప్పుడు చూస్తున్నాం. రెండో ప్రపంచయుద్ధానికి ముందు రెండు దశాబ్దాలక్రితం – భారతీయ గ్రామసీమల్లో పండిన పంటంతా మార్కెట్టులోకి వచ్చి, మారకపువస్తువులుగా మారి, ఉత్పత్తి దాన్ని మార్కెట్టు అవసరాలకు అనుగుణ్యంగా మార్చి, గ్రామాలలో యిదివరకు కనివినిఎరగని కొత్త మార్పులు రావడానికి పూర్వం – పరిస్థితిని గురించి ఆరో కాంగ్రెసు వలసదేశాల సమస్యపై చేసిన సిద్ధాంత తీర్మానం వివరించింది.

## 2

కమ్యూనిస్టు ఇంటర్‌నేషనల్ ఆరో కాంగ్రెసు వలసదేశాల సమస్యపై చేసిన సిద్ధాంత తీర్మానం తదనంతరం కమ్యూనిస్టు పార్టీ రైతాంగ సమస్యకు సంబంధించిన మూల సూత్రాలపై తిరిగి ఎట్టిసిద్ధాంతీకరణ చేసియుండలేదు. భారతీయ గ్రామాల్లో అప్పటి నుండి యిప్పటివరకూ వచ్చిన మార్పులను దృష్టిలో వుంచుకోకుండా రెండుదశాబ్దాల క్రిందట చేయబడ్డ ఆ సిద్ధాంత వివరణమైననే యిప్పటికీ పార్టీ పాలసీ, రైతాంగ పోరాటపు ప్రధాన దృక్పథమూ ప్రధానంగా ఆధారపడి ఉన్నాయి.

ఈ సమస్యపై కొత్తగా ఎలాంటిసిద్ధాంత వివరణను చేసుకుపోవడమటుంచి అసలా కలోనియల్ థీసిస్‌ను అర్థంచేసుకోకుండా నామమాత్రంగా చదవడమో లేక దానిని పూర్తిగా నిర్లక్ష్యంచేయడమో జరిగింది. సంయుక్త జాతీయ సంఘటననుగురించి వున్న తప్పుడు సంస్కరణ భావాలన్నీ భారత కమ్యూనిస్టు పార్టీ ద్వితీయ కాంగ్రెసు సమావేశంలో నిశితవిమర్శకు గురిఅయ్యాయి. పరిపూర్ణమైన వ్యవసాయక విప్లవాన్నిగాని లేక బలవత్తరమైన రైతుఉద్యమాన్నిగాని ఎన్నడూ తనంతటతాను నడపగలశక్తి లేనటువంటి మధ్యతరగతి రైతుపై ప్రధానంగా ఆధారపడడమనే ఈ తప్పుడు సిద్ధాంతం ఫలితంగానే పార్టీయొక్క రైతురంగంలో ఈ లోపం జరిగింది. ఉదాహరణకు మనం నాయకత్వం వహించి, నడుపుతున్న కిసాన్‌సభ ప్రధానంగా మధ్యతరగతిరైతుపై ఆధారపడుతూ, అతని అనుమానాలనూ, వూగిసలాటను ప్రతిబింబించుతూవచ్చింది. మనం ముఖ్యంగా ఊగిసలాడే మధ్యతరగతి రైతుపై ఆధారపడుతూ, ఒక్కొక్కప్పుడు ధనికరైతువర్గసిద్ధాంతాల అవసరాల ననుసరించి అందుకోసం కిసాన్‌సభ పనిచేసేటట్లుచేసి, బీద రైతును గుర్తించకపోవడమూ వ్యవసాయ కూలీలను అసలే దూరంగా ఉంచడమూ జరిగిందని కమ్యూనిస్టులంగా మనం ఒప్పుకొనితీరాలి. అంతమాత్రంచేత యింతకాలంగా కిసాన్‌సభ చేసిన కృషిని తక్కువ అంచనా వేస్తున్నామని ఎవరూ తలచరాదు. వ్యవసాయ కూలీలను ప్రత్యేకసంస్థలో సంఘటితపరచకపోవడమనేలోటు ఏదో యాదృచ్ఛికంగా జరిగిన విషయంకాదు. అది ధనికరైతుకూ మధ్యతరగతి రైతుకు కష్టం

కలుగుతుందేమోనని భయపడుతూ 'రైతాంగ' ఐక్యతను విచ్ఛిన్నం చేస్తున్నామనే సంకోచంతో ఎప్పటికప్పుడు మనం ధనిక, మధ్య రైతులకు లొంగిపోవడంమాత్రమే అది తెలియ జేస్తుంది. కిసాన్ సభలలోనూ కిసాన్ ఫ్రాక్షన్‌ల లోనూ, భూమి పునర్విభజన సమస్య చర్చ కొచ్చినప్పుడల్లా కొంతమంది కామ్రేడ్సు ధనిక రైతుకు వంద యకరాలు వుండాలనీ ఒక నిర్ణీత మాత్రంలాగా డిమాండ్ చేయడమూ-అదీ రైతాంగ ఐక్యత అనే పేరుమీద చేయడం-మనం ఎరుగుదుము.

ఈ రోజునకూడా అలాంటి లొంగుబాటు సంస్కరణ ధోరణే ధనికరైతును "తటస్థం" చేయాలనే నినాదం క్రింద తిరిగి ప్రత్యక్షమవుతోంది. నిజానికి ధనికరైతుకు వ్యతిరేకంగా వ్యవసాయ కార్మికులు సాగించే ప్రత్యక్షసంఘర్షణనుంచి తప్పుకోడానికి అది మరొక పేరు మాత్రమే. ఆ విధంగా చేయడమంటే పోరాటానికి బదులుగా తటస్థవైఖరిని అవలంబించి, ధనికరైతుముందు మోకరిల్లడం మాత్రమే అవుతుంది. అంతేకాదు. ధనిక రైతును మధ్యతరగతి రైతుగా నిర్వచనం చేస్తూ లెనిన్ స్టాలిన్‌ల పేరుమీదుగా అతనితో కలసి పనిచేయాలని నినాదమివ్వడంలోకూడా యీ లొంగుబాటుతనమే ప్రస్ఫుటమవుతోంది. ఈ లొంగుబాటుతనంవల్లనే వ్యవసాయ కార్మిక సంఘాన్ని ప్రత్యేకంగా నిర్మించడానికి వెనుదీయడం, వ్యవసాయ కార్మికునికి న్యాయమైన వేతనంకోసం పోరాడే సమస్యను త్యజించడం సంభవిస్తోంది.

ఈసంస్కరణదృక్పథం ఫాసిస్టు వ్యతిరేక యుద్ధకాలంలో బాగా బలపడింది. ఆదశలోనే పార్టీ అనేక సమస్యలపై వర్గరాహిత్య సంస్కరణ దృక్పథాన్ని అవలంబించి అనేక ఘోరతప్పిదాలను చేసింది. ఈ తప్పుడు ధోరణి అప్పుడు దొంగనిల్వలకూ, దొంగ వ్యాపారానికి వ్యతిరేకంగా పార్టీ నడిపిన ఉద్యమాలలో స్పష్టంగా ద్యోతకమైంది. ఈ ఉద్యమాలు ప్రధానంగా దోపిడీచేయబడే బీదరైతాంగంపై ఆధారపడకుండా, పైవర్గాల సహాయంతో నడుపబడ్డాయి. ఈ ఉద్యమాలను వర్గాలకు సంబంధించకుండా ప్రజలందరి ఉద్యమంగా సాగించాలనే భావాన్ని మన పత్రికలలో ఏవిధంగా ప్రచారం చేశామో తెలియజేస్తూ పార్టీ ద్వితీయకాంగ్రెసులో మితవాదసంస్కరణ ధోరణిపై సమర్పించిన రిపోర్టులో స్పష్టంచేయబడింది. దీనితోపాటు భూమికోసం పోరాటాలను అభివృద్ధిచేయకపోవడంలో మనం అనుసరించిన వర్గరాహిత్య సంస్కరణధోరణి పరాకాష్ఠ చెందింది. అయితే యిది యుద్ధకాలంలో కనిపించిన ఒక ప్రత్యేకలక్షణం మాత్రమే. అంటే చివరకు పార్టీ ఫ్యూడల్ దోపిడీ వర్గాలతోకూడా సహకరించ పూనుకోవడమన్నమాట. ఇలాంటి తప్పుడువైఖరిని పార్టీ యిప్పుడుగానీ లేక ఇంతకు ముందుగాని ఎన్నడూ తీసుకొని వుండలేదు.

యుద్ధానికిముందూ యిప్పుడూ కొనసాగించబడుతున్న యీ సంస్కరణతత్వానికి సిద్ధాంతరీత్యా మూలకారణం ఏమిటి? వ్యవసాయిక పోరాటం అంటే ఫ్యూడల్ భూసంబంధాలకు మాత్రమే వ్యతిరేకమనే సూత్రం-విమర్శనకు నిలబడలేని ఈసూత్రం-వల్ల (సరిగ్గా దీనిననుసరించే జాతీయపోరాటమంటే సామ్రాజ్యవాదానికి వ్యతిరేక పోరాటం మాత్రమే నని అర్థంచేసుకొన్నట్లు) పల్లెటి ప్రాంతాలలో మారుతున్న వాస్తవిక వర్గ సంబంధాలను అర్థంచేసుకోలేక పోవడమూ, రైత్వారీ ప్రాంతములోనూ, జమీందారీ ప్రాంతములోనూ వున్న గ్రామంలో త్వరితగతిని సంభవిస్తున్న వర్గతారతమ్యాలను గమనించకపోవడం జరిగింది. ఇందు మూలంగానే పీడించే ధనికవర్గ శక్తులతో సహకరించాలనే ఎత్తుగడలను ప్రచారం చేశాం. అందువల్లే రైతాంగంలో అణచబడిన వర్గమూ, నిజంగా

ముందుకు నడిపించే శక్తి, అయిన వ్యవసాయ కార్మికులకు, బీదరైతులకు నాయకత్వం స్థానం లేకుండా చేసి, రైతు ఐక్యత అనే దృక్పథాన్ని మనం అభివృద్ధిచేయడం జరిగింది.

మధ్యతరగతి రైతు జమీందారీ ప్రాంతాలలో ఫ్యూడల్ వర్గాల పెత్తనంక్రింద బాధలు పడటం, రైత్వారీ ప్రాంతాంలో వడ్డీవ్యాపారీవల్లా, భూస్వాములవల్ల బాధలు పడటం, ధనికరైతు భూస్వామిని విమర్శనాదృష్టితో చూడటం, భూస్వామి అధికారాన్ని తగ్గించడానికి ముఖ్యంగా ఆపని యితరులవల్ల చేయబడుతున్నపుడు ధనికరైతు వ్యతిరేకత మాపించకపోవడమూ – వీటన్నింటినీ తగిన కారణంగా తీసుకొని ధనికరైతుతో, అతని షరతుల పైననే ఐక్యమవడానికి మనం ప్రయత్నించడం జరిగింది. పూర్తిగా మధ్యతరగతి రైతునే పోరాటానికి ఆధారంగా తీసుకొని వ్యవసాయకార్మికుల పేదరైతుల పోరాటాన్ని, కోర్కెలను మధ్యతరగతి రైతుల వూగిసలాట కనుగుణ్యంగా తగ్గించుకుంటూ రావడంమూలంగా వుద్యమంలోకి ధనికరైతులు దూరడానికి అవకాశం కలిగింది. అయితే యీ వర్గాలన్నీ ఖచ్చితంగా ఎంతవరకు ఫ్యూడల్ విధానానికి వ్యతిరేకంగా నిలబడగలవు? ప్రజాస్వామిక విప్లవాన్ని సంపూర్ణంగా సాధించటానికి యీ వర్గాలన్నీ యెంతవరకు ఖచ్చితంగా సానుకూల పడతాయి? అనే ఈ ప్రశ్నలను మనం వేసుకొనియుండలేదు. అంతేకాదు; భూస్వామ్య విధానంయెడల ధనికరైతుకుగల వ్యతిరేకతకూ, వ్యవసాయ శ్రామికులకు, పేదరైతులకు గల వ్యతిరేకతకు మధ్యవున్న భేదాన్ని మనం తెలుసుకోడానికి ప్రయత్నించలేదు. ధనికరైతు తన స్వప్రయోజనాల సిద్ధికొరకే యీ విధంగా తతిమ్మారైతువర్గాలతో రాజీపడుతున్నాడనే విషయాన్ని మనం గమనించలేదు.

రైతాంగంలోని వివిధ వర్గాల స్థితిగతులను సరిగా అంచనా వేసుకోకపోవడం, ఫ్యూడల్ వర్గానికి వ్యతిరేకంగా ఏవర్గం ఎంతవరకు నిలబడుతుందనే విషయాన్ని తర్కించుకోకపోవడం – ఉత్పత్తివిధానంలో ఒక్కొక్క వర్గంయొక్క పాత్రా, ప్రస్తుత సమాజంలో వాటికున్న సంబంధబాంధవ్యాలూ, ఫ్యూడల్ గర్భంనుండే ఉద్భవిస్తు అభివృద్ధిచెందుతున్న నూతనవర్గాలకున్న పరస్పర వైరుధ్యాలను గమనించకపోవడమూ, వ్యవసాయంలో పెట్టుబడిదారీ సంబంధాలు అభివృద్ధి చెందడం మూలంగా ఉత్పన్నమైన వర్గతారతమ్యాలను పరిశీలించకపోవడమూ – ఈ వర్గ తారతమ్యాలే ఫ్యూడలిజానికి వ్యతిరేకవైఖరిని ప్రదర్శిస్తున్నప్పటికీ ఎవరెవరు రాజీవాదులో, ఫ్యూడల్ విధానంవల్ల బాధలుపడుతూ దానిపై కత్తిగట్టాలని కబుర్లుచెప్పినా వూగిసలాడేదెవరో, పాతదోపిడి విధానానికీ, కొత్తదోపిడీవిధానానికీ ఖచ్చితంగా వ్యతిరేకంగా నిలబడి ఏవర్గం ప్రధాన సంచాలకశక్తిగా పనిచేయగలిగివుంటుందో – యివన్నీ తెలుసుకోకపోవడమే రైతురంగంలో మన సంస్కరణతత్వానికిగల మూలకారణాలు.

మనం మార్క్సిస్టు - లెనినిస్టు రచనల కనుగుణ్యంగా కట్టుబడివుంటే యీ తప్పులు జరిగియుండేవికావు. ఎందువల్లనంటే ప్రజాస్వామికవిప్లవంలో ఏయేవర్గాలు కలసిరాగల అవకాశాలున్నాయో లెనిన్ స్టాలిన్ రచనలలో తిరిగి తిరిగి నొక్కిచెప్పబడ్డాయి. ప్రజాస్వామికవిప్లవంలో ఏదశలోనూ మనం మధ్యతరగతి రైతుపై ఆధారపడటానికి లెనినిజం ఎక్కడా అంగీకరించివుండలేదు. విప్లవంయొక్క ప్రతిదశలోనూ శ్రామికవర్గం వ్యవసాయ కార్మికులపైనా, పేదరైతాంగంపైనా ఆధారపడాలి. మన పోరాటంలో ప్రధాన శత్రువుగా పరిగణించబడేవర్గాలు మధ్యతరగతి రైతుపట్ల అవలంబించే వైఖరినిబట్టి, విప్లవంలోని విభిన్నదశలను గుర్తించుకోవలసి ఉంటుంది.

# 3

పార్టీ ద్వితీయ కాంగ్రెసు 'రాజకీయ థీసిస్'లో వ్యావసాయిక ప్రాంతాలలోని వర్గ సంబంధాలనుగురించి లోతుగా తరచి తిరిగి అంచనా వేసి వివరించడం జరగలేదు. పార్టీని జాతీయ బూర్జువావర్గంతో కలసిపోయే ప్రమాదాన్నుండి రక్షించి, బూర్జువా జాతీయ ప్రభుత్వానికి వ్యతిరేకంగా నిలబడి పోరాడేటట్లు చేసే సరియైన రాజకీయపంథాను చర్చించి నిర్ణయించుకొనే ప్రయత్నంలోనే ప్రధానంగా పార్టీ కాంగ్రెసు మునిగిపోయింది. ఆ పరిస్థితులలో పార్టీ వ్యవసాయక పరిస్థితులలో వచ్చిన మార్పులను తిరిగి అంచనా వేయడం మాని, పోరాటానికి జనరల్ గా పిలుపు నివ్వడంతోనే సంతృప్తి చెందింది. ఈ విషయంపై పార్టీ తీర్మానం వెనకటి సంస్కరణవాదం పరిమితులను ఎలా దాటలేవో ఈ క్రింద యివ్వబడిన ఉద్ధరణలో చూడగలం :

"దున్నేవానికే భూమి" అనే కేంద్ర నినాదంపై కష్టజీవులైన రైతులందరినీ సమీకరించి, ఉత్తేజపరచి నాయకత్వం వహించి నడపడమే రైతురంగంలో మన ప్రధాన బాధ్యత. అన్నిరకాలైన భూస్వామ్య విధానాన్ని భూస్వాములకు ఎలాంటి ప్రతిఫలాన్నీ చెల్లించకుండా రద్దుచేయాలి. భూస్వాముల "ఖాస్" (స్వంతకమతము) భూములనూ, ధనికరైతుల భూములనూ కష్టంచేసే రైతులందరికీ పంచిపెట్టాలి. అన్నిరకాలైన ఫ్యూడల్, అర్ధఫ్యూడల్ దోపిడీవిధానాన్ని పూర్తిగా మటుమాయం చేయాలి. భుక్తభూములనుండి రైతులను తొలగించే విధానానికి వ్యతిరేకంగానూ, పన్నుల భారానికి ప్రతికూలంగానూ, వడ్డీవ్యాపారుల బానిసత్వానికి వ్యతిరేకంగానూ, ధాన్యరూపేణా యిచ్చే కౌలును డబ్బురూపంలోకి మార్చేందుకూ, పండిన పంటలో కౌలుదార్లకు మూడింట రెండువంతులు భాగం వచ్చేందుకూ జరిగే పోరాటాల నన్నిటినీ బలపరచి, దున్నేవానికే భూమిపై హక్కు కలగడానికి జరిగే మహాపోరాటంగా అభివృద్ధి చేయాలి. వ్యవసాయకశ్రామికు లందరినీ ఖచ్చితంగా అఖిల భారత కిసాన్‌సభా యాజమాన్యం క్రింద దాని కనుబంధంగా వుండే సంస్థలగానో లేక ప్రత్యేకంగా అందులోనే సంఘటిత భాగాలుగానో వారి న్యాయమైన వేతనముల కొరకూ, ఇతరంగా వారి పరిస్థితులను బాగుపరచేందుకు సంఘటితపరచాలి.

"రైతాంగ పోరాటాల తీవ్రత ఎంత వ్యాప్తిగా, ఎంత హెచ్చుగా వున్నాయంటే కాంగ్రెసుమంత్రులే జమీందారీ వ్యతిరేక "అనబడే" బిల్లులతో ముందుకు రావలసిన అవసరం వచ్చింది. వారంతటవారే జమీందారీ విధానాన్ని రద్దుచేయాలనే నినాదం తీసుకోవలసి వచ్చింది. ఎందువల్లనంటే జమీందారీ విధానాన్ని రద్దుచేస్తామని అనకుండా రైతాంగాన్ని మోసంచేయడం యిక సాధ్యంకాని పని అని బూర్జువావర్గం గ్రహించగలిగింది. కాని వారు తెచ్చే శాసనాలకు మనం మోసపోరాదు. వారి నిజమైన వర్గస్వభావాన్ని బట్టబయలుచేయాలి. జమీందారీ విధానాన్ని రద్దుచేస్తామని వారు చేసే వాగ్దానాలు ఎలా బూటకమో నిరూపించి, స్పష్టపరచాలి. నిజానికి నేడు కాంగ్రెసు నాయకులూ, మంత్రులూ జమీందారుల వొత్తిడికి లొంగిపోయి, తాము తెస్తున్నామన్న జమీందారీ వ్యతిరేకపు బిల్లులను తొక్కిపెట్టివుంచుతూ, అన్ని చోట్లా సమానపద్ధతిలో తగినంత ప్రతిఫలం యివ్వడానికి ఆలోచిస్తున్నామని సాకులు చెప్పుతున్నారు.

"వారు ప్రవేశపెడతామంటున్న బిల్లులలో భూస్వాములకు ప్రతిఫలం యివ్వాలంటున్నారు. దానిని మనం వ్యతిరేకించిపోరాడాలి. జమీందారుల, భూస్వాముల గుత్తాధికారం క్రిందనున్న భూములను వారు స్వాధీనం చేసుకోవడంఅంటూలేదు. కాబట్టి భూమిని సాగుచేసే బీదరైతాంగానికి తిరిగి పంచడమంటూ లేనేలేదు. ఈ నాడు రైతాంగంలో అధిక సంఖ్యాకులుగావుండే పాలుదారులూ, కౌలుదారులూ, కమతదారులకూ భూములపై ఎలాంటి హక్కూ కలగడంలేదు. భూస్వాముల స్వాధీనంలోవున్న భూముల్లోంచి మక్తా పద్ధతిమీద భూమిహక్కుతోసహా రైతులకు యిదివరకే యివ్వబడిన భూముల్ని ప్రతిఫలం యిచ్చి తీసుకోవడానికి మాత్రమే ప్రస్తుత బిల్లులు ఉద్దేశించబడ్డాయి. ఈబిల్లులు అమలు జరగడంమూలంగా భూసామ్యవిధానం రద్దు కాదు. మరోరూపంలో అదిఅలాగే వుంటుంది. ఇదివరకేపన్నులభారంతో కృంగిపోతున్న ప్రజల నెత్తిన యీప్రతిఫలంఅనేభారంరుద్ది భూస్వాములకు లాభాలను కట్టిపెడతారు.

"భూస్వామ్య విధానాన్ని కొత్తపద్ధతులలో సుస్థిరంచేసేందుకు కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు తయారుచేస్తున్న కొత్త ప్రణాళికలను గమనిస్తే వారి ధోరణి ఎటువైపు మొగ్గుతూ వుందో మనం అర్థంచేసుకోవచ్చు. (ఉదాహరణకు బెంగాల్ ప్రణాళిక చూడండి) ఈ కొత్త ప్రణాళికలలో వివిధ ప్రాంతాలలో వున్న వ్యవసాయ భూములమీద పెత్తనం భూస్వాములూ రైతులూ కలిసి ఏర్పడిన సహకారసంఘాల చేతులలో వుంచుతారట. భూస్వాములకు ప్రతిఫలంగా ముట్టజెప్పబడిన ధనాన్ని యీ కో-ఆపరేటివ్ లలో పెట్టుబడిగా ఉపయోగిస్తారట. పెద్ద వాటాగల భూస్వామిచేతులలోవున్న అలాంటి కో-ఆపరేటివ్ లలో సహజంగా ధనిక భూస్వాములు భూమినంతనూ, పండినపంటనూ కంట్రోలు చేసేస్థితిలో వుంటారు.

"ఈ కొత్త చట్టాలు అమలులోకి వచ్చే లోపున జమీందారులు పెద్దపెట్టున రైతులను భూములనుండి తొలగించుతున్నారు. ఇందుకు రైతులు ప్రతిఘటిస్తే పోలీసుల సాయంతో వారి నణచివేస్తున్నారు. దీనిఫలితంగా జమీందారులు స్వంతభూముల వైశాల్యం పెరిగిపోతోంది. గుత్తాధికారాలతో వారిస్వాధీనంలో వున్న భూములు పెరుగుతున్నాయి. నిజంగా భూమిని సాగుచేసే రైతుల చేతులలో నుంచి భూమి పెద్ద ఎత్తున లాగివేయబడుతోంది. కొత్తగా ప్రవేశపెట్టబడుతున్న యీ చట్టాలు పైవిధంగా హరించబడిన భూములు భూస్వాములవిగానే నమోదుచేస్తాయిగాని మరొకటి చేయవు.

"ఈ చట్టాలన్నీ అభివృద్ధికరమైనవనీ, ముందడుగువేయడమనీ పెద్దగా పొగడటం అంటే రైతులను దగాచేసి, బూర్జువా నాయకుల మోసాన్ని కప్పిపెట్టడం మాత్రమే అవుతుంది.

"శాసన సభలలో ప్రవేశపెట్టిన ఈ బిల్లులను నిస్సంకోచంగా బట్టబయలు చేయాలి. ఈ శాసనాలు భూస్వామ్య విధానాన్ని పునరుద్ధరించడానికి మాత్రమే ఎలా వుపయోగపడి, భూమిని సాగుచేసే పేదరైతాంగాన్ని మరింత దరిద్రంలోకి ఈడుస్తాయో, ఈవిధంగా అదివరకే క్లిష్టంగావున్న ఆహారకరువును మరింత తీవ్రపరచడానికి ఎలా అవకాశాన్ని కలుగజేస్తాయో స్పష్టపరచాలి. ఈ శాసనాలు ఆహారపదార్థాలపై గుత్తాధికారుల అధికారాన్ని మరింత బలపరచి, తద్వారా దొంగ వ్యాపారం యింకా విస్తరించడానికి అవకాశాన్ని కలుగజేస్తాయి. భూస్వాములకు ప్రతిఫలం ముట్టజెప్పడాన్ని మనం వ్యతిరేకించాలి. భూస్వాములకు ప్రతిఫలాన్ని చెల్లించడానికి

బదులు ప్రభుత్వం ఎరువులూ, నీటిపారుదల సౌకర్యాలూ, బంజరుభూములను సాగులోకి తీసుకొని రావడానికి వినియోగించాలనీ, రైతులకు పశువులను విత్తనాలను ఆధునిక వ్యవసాయక పరికరాలను సరఫరా చేయాలనీ మనం డిమాండ్ చేయాలి. భూమినంతటినీ సాగుచేసే రైతులకు మాత్రమే యివ్వాలి. భూస్వాములకున్న స్వంతభూములను ఎలాంటి పరిహారాన్ని చెల్లించకుండా స్వాధీనం చేసుకోవాలి. భూస్వాములలో బీదవర్గానికి కొంత కాలంవరకూ సాధారణ భృతిని కలుగజేయడమో లేక అతని అవసరాలకుమాత్రం సరిపడే కొంత స్వంతభూమిని అట్టిపెట్టుకోడానికో అనుమతి నివ్వాలి.

"దున్నేవానికే భూమి లభించనంతవరకూ జమీందారీ వ్యతిరేక రైతువుద్యమం సంపూర్ణం కాజాలదు. రైతులు భూమిని సంపాదించుకోవాలంటే "దున్నేవానికే భూమి" అనే నినాదంతో సంఘటితపడుతూ, మక్తాలూ రుణాలూ తగ్గించాలనే కోరికలపై జరిపే పాక్షిక పోరాటాలనుండి "దున్నేవానికే భూమికావాలి" అనే ప్రధాన పోరాటానికి విజృంభించాలి.

"ప్రభుత్వం అనుసరించే పాలసీ ఫలితంగా ఏర్పడిన ఆహారకరువుకు వ్యతిరేకంగా జరిగే పోరాటానికి మనం నాయకత్వంవహించి నడిపించడానికి ఏమాత్రం వెనుదీయరాదు. పెద్ద పెద్ద వర్తకులవద్దా, భూస్వాములవద్దా వున్న నిలవలను స్వాధీనంచేసుకొని ప్రజలకుఆహారం పంచిపెట్టాలని డిమాండ్ చేయాలి. వెనుకపడివున్న ప్రాంతాలలో బానిసత్వాన్ని, వెట్టిచాకిరినీ, అన్యాయపు పన్నులనూ (వార్లలూ, హాలీలలో వున్నట్లుగా) రద్దుచేయాలని మనం డిమాండ్ చేయాలి. ఈవిధంగా ఆపోరాటాలను "దున్నేవారికే భూమిహక్కు" వుండాలనే నినాదంతో మేళవింపజేయాలి. సంస్థానాలలో కూడా రైతాంగాన్ని మేల్కొల్పి, జాగీర్దారీ, భూస్వామ్యవిధానం, సంపూర్ణంగా రద్దు చేయాలనీ, జమీందారీయుగపు సంబంధాలన్నింటినీ రద్దుచేయాలనీ, దున్నేవానికే భూమి సంక్రమించాలనీవారు డిమాండ్ చేసి పోరాడేటట్లు చేయాలి.

"పల్లెపట్టుల్ని భయంకరంగా అలముకొనుచున్న ఆర్థిక సంక్షోభం బ్రహ్మాండమైన శక్తులను కదుపుతుంది. ఈ రైతుఉద్యమాలన్నీ అసంఖ్యాకులయిన పేదరైతులనూ, మధ్యతరగతిరైతుల్నీ, వ్యవసాయ కూలీలను ఐక్యపరుస్తాయి. జయప్రదంకావలసిన ప్రతిప్రజాస్వామిక ఉద్యమానికి తప్పనిసరిగా అవసరమయ్యే కార్మిక కర్షక ఐక్యతను చేకూరుస్తాయి. సామ్రాజ్యవాదులూ, బూర్జువావర్గమూ కలసి కట్టే ముఠాకు వ్యతిరేకంగా ప్రజాస్వామిక సంఘటన సాగించే ఉద్యమంలో ఆ పోరాటాలు ఒకభాగం మాత్రమే.

"ఈ రైతాంగపోరాటాలకు నాయకత్వం వహించి, రైతాంగ ప్రతిఘటన అనే ఒకే ఒక మహాప్రవాహంలో వీటన్నిటినీ సంఘటిత పరచి, "దున్నేవారికే భూమి," అనే ప్రధాన నినాదంతో అఖిలభారత కిసాన్‌సభను భారత రైతాంగంయొక్క కేంద్రపోరాట సంస్థగా నిర్మించాలి."

(పొలిటికల్ థీసిస్ పేజీ 97_100)

ఈవిధంగా పార్టీకాంగ్రెసు పొలిటికల్ థీసిస్‌లో పోరాటానికి జనరల్‌గా పిలుపు యివ్వబడింది. బూర్జువావర్గం భూస్వామ్యవిధానాన్ని రద్దుచేస్తామంటూ ప్రవేశపెట్టబోతున్న బిల్లుల బూటకత్వం బట్టబయలు చేయబడింది. దున్నేవారికే భూమిపై హక్కుండాలనే నినాదం లేవదీయబడింది. వ్యవసాయ కూలీలను ప్రత్యేకసంస్థలలో సంఘటిత పరచవలసిందిగా పిలుపు ఇవ్వబడింది. ఈవిధంగా పార్టీ రాజకీయ థీసిస్‌లో ఇవన్నీ పేర్కొన

బడినప్పటికీ ఆ వివరణంతో పాత సంస్కరణ వాద చట్రంయొక్క హద్దులను దాటలేక పోయింది. పల్లెటి ప్రాంతాలలో మారిపోయిన వర్గసంబంధాలను సరిగా అంచనా వేయ లేక పోయింది. పెట్టుబడిదారీవిధాన అభివృద్ధి సంబంధాలను, నూతనంగా ఉత్పన్నమవుతున్న వైరుధ్యాలనూ, నూతన వివిధ వర్గాలలోవున్న ప్రధాన పరస్పర వ్యతిరేకతలను దృష్టిలో వుంచుకోకపోవడంవల్ల పల్లెప్రాంతపు కష్ట జీవుల దైనందిన పోరాటానికీ, ప్రజాస్వామిక ప్రజాతంత్ర వ్యవస్థా స్థాపనకూ జరిగే పోరాటానికి సరిగ్గా ఏయేవర్గాల సమ్మేళన అవసరమో అంచనావేసి, పోరాటపు వ్యూహాలను మనం రచించలేక పోయాం. అయినప్పటికీ పార్టీ రాజకీయ సిద్ధాంత తీర్మానంలో యివ్వ బడిన పిలుపు రైతురంగాన్ని పోరాటపు భయాన్నుండీ, భూస్వాముల, కాంగ్రెసు ఏజెంట్లు ముందు లొంగిపోయే తత్వాన్నుండీ, విముక్తి చేయడానికి వినియోగపడి, నూతన శక్తులు విజృంభించడానికి అవకాశం కలుగ జేసింది.

ఈ పోరాటాల విజృంభణ రైతురంగంలో అంతకు ముందునుండీ పరిష్కరించబడకుండా వుండిపోయినసమస్యలనన్నిటినీ ఒక్కసారిగా బయటకులాగాయి. బీహార్‌లో యిటీవల జరిగిన పోరాటాలలో వ్యవసాయ కార్మికుడు ప్రముఖపాత్రనునిర్వహించడమూ, అతని నాయకత్వాన రైతాంగం సమీకరించబడటం మొదలుగాగల సంఘటనలు అతని దైనందిన పోరాటాలకు ప్రత్యేకసంస్థ నిర్మాణ అవసరాన్ని స్పష్ట పరచాయి. పేదరైతుతోనూ, మధ్యతరగతి రైతుతోనూ వ్యవసాయకార్మికునికుండవలసిన సంబంధాలు మొదలైన సమస్యలు తిరిగి ఉత్పన్నమయ్యాయి. ప్రత్యేకసంఘ నిర్మాణం వీరిద్దరిమధ్యా పరస్పర వైరుధ్యాలకు దారి తీస్తుందా? అనే ప్రశ్న ఉదయించింది.

సంయుక్త రాష్ట్రంలోకూడా యిలాంటి అనుభవాన్నే గడించడం జరిగింది. రైతాంగ పోరాటాల్లో వ్యవసాయకార్మికులు వీరోచితంగా నిలబడడంవల్ల యీవిధమైన సమస్య ఉద్భవించింది. కాని సంయుక్తరాష్ట్రంలోని కామ్రేడ్సు మరికొంత లోతుగా వివరణలోకి వెళ్ళి వ్యవసాయకార్మికునికి ధనికరైతుకూ మధ్యవున్న పరస్పరవైరుధ్యాలనుగూర్చి వీక్షించారు. తిరిగి వ్యవసాయ కార్మికులకు ప్రత్యేక సంస్థవుండాలనే సమస్య, అతనికి పేదరైతుతోనూ, మధ్య తరగతి రైతుతోనూ ఎలాంటి సంబంధం ఉండాలనే సమస్యా బయలుదేరింది.

ఈ రెండు రాష్ట్రాలలోనూ యీ సమస్య దైనందిన పోరాటాలను ఆర్గనైజ్ చేసే విషయాన్ని దృష్టిలోవుంచుకొని మాత్రమే ఉదయించింది.

ఆంధ్రలో యీసమస్య ఇంకా ఎక్కువ సిద్ధాంతరీత్యా తరచబడింది. మనవిప్లవ ప్రస్తుత దశనుబట్టి ముఖ్యంగా ఏయే వర్గాల సమ్మేళన జరగాలన్నదృక్పథాన్నుండి ఈ సమస్యనుపరిశీలించారు. మధ్యతరగతి రైతుతో పొత్తుగోరుతామా లేక అతను తటస్థవైఖరిని అవలంబించేటట్లు చేస్తామా అనే ప్రశ్న ఉదయించింది. మనం రష్యలోని ఫిబ్రవరి విప్లవదశలోవున్నామనుకుంటే మధ్యతరగతి రైతుతో పొత్తు కుదుర్చుకోవాలనీ, లేక అక్టోబరు విప్లవదశలో మనం వుంటే మధ్యతరగతి రైతును తటస్థం చేయాలనీ వాదించబడింది. ఇక్కడ, పల్లె ప్రాంతాలలోని వర్గసమ్మేళన సమస్య మరొక వేరుపద్ధతిలో లేవదీయబడింది. మధ్యతరగతి రైతుతో స్నేహపూర్వక సంబంధాలను సురక్షితంగా కాపాడుకోవాలనే ముసుగుతో యీ సమస్యను పరిశీలించడమైంది. అయితే వర్గదృష్టి లోపించిన ఆ వెనకటి పాతసంస్కరణతత్వమే దీనికి మూల ప్రాతిపదికగాపనిచేసింది. ఇందువల్ల రైతు ఐక్యత భగ్నమవుతుందనే

భయంతో వ్యవసాయక కార్మికుల హక్కులకు ప్రాధాన్యత యివ్వడం జరగలేదు.

కాని ఆంధ్రా కామ్రేడ్సులోని సుగుణమేమంటే వారు రైతాంగ ప్రాంతాలకు సంబంధించిన వ్యూహాన్ని ప్రజాస్వామిక ప్రజాతంత్ర విప్లవంలోని శ్రామికవర్గ రాజకీయ ప్రధాన వ్యూహంతో సమన్వయపరచడానికి ప్రయత్నించారు. ప్రధాన (జనరల్) రాజకీయ వ్యూహాన్నుండి దైనందిన పోరాటపు ఎత్తుగడలను నిర్ణయించడానికి - ఈ నిర్ణయంలో వారు తప్పుచేస్తే చేశారుగాక - ప్రయత్నం మాత్రం చేశారు.

కాబట్టి పార్టీ వ్యవసాయ సమస్యను తిరిగి పునర్విమర్శించి, పల్లెప్రాంతాలలో వర్గ సంబంధాలను సరిగా అంచనావేసి తదనుగుణ్యంగా సరియైన వ్యూహంతో ముందుకు రావలసిన అవసరముంది. ఇందుకొరకు మనం వ్యవసాయక పరిస్థితులను గురించి యదార్థ విషయాలను తెలుసుకొని కమ్యూనిస్టు ఇంటర్ నేషనల్ ఆగ్రో కాంగ్రెసు సిద్ధాంతీకరించిన తరువాత పరిస్థితులు ఎంతవరకు మారాయో పరీక్షచేసుకోవలసిన అవసరం వస్తుంది. ఇక ఆ పనికి పూనుకొనే ముందు మనం ఒక విషయాన్ని గుర్తించుకోవాలి. అదేమంటే ఆగ్రో కాంగ్రెసు చేసిన సిద్ధాంతీకరణ ఒకవైపున పెట్టుబడిదారీ వ్యాపార దోపిడీ విధానం తీవ్రతరమవుతుందని ఖచ్చితంగా చెప్పుతూనే మరొకవైపున పరిస్థితులు ఎల్లప్పుడూ ఒకేవిధంగా మార్పులేనిస్థితిలో వుంటవనీ, మార్పులు జరుగుతాయనీ తెలియజేసింది. ఆ తీర్మానం యిలా ప్రకటించింది:

"వలస ఆర్థికవిధానానికి దెబ్బ తగులకుండా వ్యవసాయ సంస్కరణలను ప్రవేశపెట్టే అల్ప ప్రయత్నాలన్నీ అర్ధ ఫ్యూడల్, ఫ్యూడల్ విధానాన్ని క్రమేణా పెట్టుబడిదారీ భూస్వామ్య విధానానికి అనువుగా మార్చడానికీ, మరికొన్ని సందర్భాలలో అత్యల్ప సంఖ్యాకులైన ధనిక రైతాంగ ప్రాతిపదికను సృష్టించడానికీ ఉద్దేశింపబడ్డాయి."

## 4

గత ఐదుసంవత్సరాలలో భారతీయ వ్యవసాయంలో వచ్చిన మార్పులేమిటి? గత యాభై సంవత్సరాలుగా జరిగిన మార్పుల ఫలితమేమిటి? భారతీయ వ్యవసాయ పరిస్థితిని గురించి యింతవరకు మనం చెప్పుతూవస్తున్న దానికీ, యిప్పటికీ మార్పేమిటి?

అన్నిటికంటే ప్రధానంగా కనపడే విషయమేమిటంటే భూమిలేని కూలీవర్గమొకటి పెరిగిపోతూవుంది; ఈ భూమిలేని కూలీలలో అత్యధికభాగం గ్రామాలలోని బానిసలు లేక హిందూగ్రామాల బానిసలు - అస్పృశ్యులు. వారికి స్వంతభూమి అనేది ఏమాత్రం లేదు. ఇక తతిమ్మావారు భూమిని పోగొట్టుకొన్న సవర్ణ రైతులు. ఈ రెండు తరగతులవారు కలసి భూమిలేని వ్యవసాయ కూలీలవుతున్నారు.

ఈ క్రింద యివ్వబడిన లెక్కలు గమనించదగ్గవి:

### వ్యవసాయకూలీల సంఖ్యలో పెంపుదల *

| 1882 | 1921 | 1931 | 1933 | 1944 |
|---|---|---|---|---|
| జనాభా | జనాభా | జనాభా | ఐ. యల్. ఓ | అంచనాలు |
| 75 లక్షలు. | 2 కోట్ల 15 లక్షలు | 3 కోట్ల 30 లక్షలు | 3 కోట్ల 50 లక్షలు | 6 కోట్ల 80 లక్షలు |

రజనీ పామీదత్తు "నేటి భారతదేశం" అనే తన గ్రంథంలో మద్రాసు రాష్ట్రంలోని వర్గవిభజనమీద ఇచ్చిన లెక్కలు.

(రైతాంగంలో వెయ్యికి వ్యవసాయకూలీల సంఖ్య)

| | 1901 | 1911 | 1921 | 1931 |
|---|---|---|---|---|
| కూలీలు | 345 | 340 | 317 | 429 |

బెంగాల్ నుగురించి పామీదత్తు పై గ్రంథంలో యిచ్చిన లెక్కలు

| | 1921 | 1931 |
|---|---|---|
| కూలీలు | 18,05,502 | 27,18,939 |

1944-45 ప్రభుత్వ లెక్కలప్రకారం బెంగాల్ లోని 78 లక్షల యకరాలలో 20.6% భూమి వ్యవసాయకూలీలచేత సాగు చేయబడుతోంది.

ప్రభుత్వ లెక్కలప్రకారమే బెంగాల్ లో రైతాంగంలోని వివిధవర్గాల బలాబలాలు యీ క్రిందివిధంగా ఉన్నాయి.

| రైతువర్గ వివరణ | మొత్తం రైతాంగంలో నూటికి | వారి స్వాధీనంలో సాగుఅవుతూవున్న భూమి నూటికి |
|---|---|---|
| భూమిలేని రైతులు | 36.4 | 1.8 |
| ఒక యకరంలోపుభూమిపై ఆధారపడే కుటుంబాలు | 17.7 | 4.2 |
| ఒకయకరంకంటె ఎక్కువ, మూడు యకరాలకంటె తక్కువ ఉన్నవారు | 22.0 | 16.9 |

* ఈ లెక్కలను ఇండియా ప్రభుత్వ వ్యవసాయశాఖా మంత్రివర్గ కార్యాలయంలోని డైరక్టరేట్ ఆఫ్ ఎకనామిక్సు అండ్ స్టాటిస్టిక్సు అనే శాఖ ప్రకటించింది. ఇవి ప్రభుత్వం నెలవారీగా ప్రచురించే భారతదేశంలోని వ్యవసాయక పరిస్థితి సంపుటి 3, సంచిక 4 లో ప్రచురించబడినాయి. ఇవి అఖండ భారతానికి సంబంధించిన లెక్కలు. ఈ డిపార్టుమెంటే 1948 ఇండియన్ యూనియన్ లోని వ్యవసాయకూలీలసంఖ్య 3 కోట్ల 39 లక్షల 86 వేలుగా యిచ్చింది. ఇదిచాలాతక్కువ అంచనా అని వేరే చెప్పనవసరంలేదు.

| రైతువర్గ వివరణ | మొత్తం రైతాంగంలో నూటికి | వారి స్వాధీనంలో సాగుఅవుతూవున్న భూమి నూటికి |
|---|---|---|
| మూడుయకరాలకంటె పైనా, 5 యకరాలకంటె తక్కువ ఉన్నవారు | 9.6 | 14.7 |
| 5 యకరాలకు పైగా ఉన్నవారు | 14.3 | 62.8 |

(వ్యవసాయ స్థితిగతుల లెక్కలు)
(1944-1945 పేజీ 48)

ఈ విధంగానే మద్రాసు రాష్ట్రంలో 1931 లో మొత్తంరైతాంగంలో నూటికి 42 మంది భూమిలేని కూలీలే. 1944-45 లో బెంగాల్‌లో రైతాంగంలో నూటికి 36 మంది భూమిలేనివారే. ఒకయకరంకంటే తక్కువ వున్న అర్ధశ్రామికులనుకూడా కలుపుకుంటే నూటికి 53 గురు ఉంటారు. అంటే మొత్తం రైతాంగంలో మెజారిటీ అన్నమాట.

కమ్యూనిస్టుపార్టీ ఆంధ్రకమిటీ ఆంధ్ర ప్రాంతాన్నిగురించి తెలిపిన లెక్కలు యీ విధంగా వున్నాయి: 417 కుటుంబాలున్న ఒక గ్రామంలో 220 కుటుంబాలు భూమి లేని కుటుంబాలు. 49 కుటుంబాలు నివసిస్తున్న మరొక గ్రామంలో 16 భూమిలేని కుటుంబాలు, 22 పేద రైతుకుటుంబాలు. 492 కుటుంబాలున్న మరొక గ్రామంలో 350 వ్యవసాయకూలీ కుటుంబాలు (వృత్తిపనుల వారితోకూడా కలుపుకొని) ఉన్నాయి. దీన్ని బట్టి భూమిలేని రైతులు సగటున మొదటి గ్రామంలో 50% రెండో గ్రామంలో 30% మూడో గ్రామంలో 70% ఉన్నారు.

కమ్యూనిస్టుపార్టీ యు. పి. రాష్ట్రకమిటీ లోని ఒక సభ్యుడు తన రిపోర్టులో యిలా తెలియజేశాడు:

"ఇక్కడ నేను 'రైతు' అనే పదాన్ని వ్యవసాయకూలీనికూడ కలిపేవాడాను. ఇప్పుడిది చాల ముఖ్యమైనవిషయం. ఎందుకంటే వ్యవసాయకూలీలు సంఖ్యరీత్యా చూస్తే చాల తక్కువభాగం మాత్రమే.

రైతు లేక 'రియాయ' అంటే గ్రామం లోని చిన్న వృత్తిపనివారూ, మంగలి, కమ్మరి, వడ్రంగి, ఊడ్చే పనిమనిషి మొదలగువారు వస్తారు. ఇందులోకి వ్యవసాయకూలీకూడా వస్తారు. వీరంతా సామాన్యంగా భూమి లేనివారే.

గ్రామాలలో 'రియాయ' (ప్రజ) నూటికి 30 నుండి 45 వరకు ఉంటారు. గ్రామం ఎంత పెద్దదైతే అంత ఎక్కువసంఖ్యలో 'రియాయ' వర్గం ఉంటుంది.

కులంరీత్యా చూస్తే ఊడ్చేపనివారూ, చమార్లు (మాలమాదిగలు, చర్మకార్లు) రైతాంగంలో ఎక్కువభాగం ఉంటారు. వారే అందరికంటే ఎక్కువ పీడితవర్గాలు.

ప్రస్తుతం వ్యవసాయకూలీలు 'చమారుల' (మాలమాదిగలు) నుండి ప్రధానంగా వస్తున్నారు. వీరిలో వ్యవసాయవృత్తికి సంబంధించనివారు వేరువేరు వృత్తులు చేసుకొంటారు. ఇక కూలీవర్గంలోకూడా రెండురకాలవారున్నారు - సంవత్సరంపొడుగూనా పనిచేస్తున్న వారూ, అడపాతడపా పనిచేసేవారూ.

వేతనాలు, భూమిసమస్య మొత్తం రైతాంగానికంతకూ సంబంధించినది. భూమిసమస్య

ముఖ్యంగా వ్యవసాయకూలీకి సంబంధించినది. జీవనానికి సరిపడ వేతనం కూడా అతనికి సంబంధించినదే. ఇక తలిమ్మ్యావారందరిదీ న్యాయమైన పద్ధతిపై సంవత్సరంవారీగా గానీ, లేక రుతువుల (టరములు) వారిగా గానీ కష్ట ఫలితాన్ని రాబట్టుకోవాల్సిన ఆర్థికసమస్య.

వారుచేసేపనికి ముట్టజెప్పే ప్రతిఫలం చాల తక్కువ. వారి కనీస జీవనానికికూడా అది సరిపడదంటే సందేహపడనవసరంలేదు, ఈ విషయమై ముఖ్యంగా ఊడ్పేపనివాండ్రు తీవ్రంగా ఆందోళన చేస్తున్నారు. కాని యింతవరకూ మేము రైతాంగంలోని వివిధ తరగతులవారికి నిర్ణత వేతనాలను నిర్ణయించలేదు. అనేక ప్రదేశాలలో ఊడ్పే పనివాండ్రు బింకీసభ నాయకత్వాన, కొందరు అవకాశవాదనాయకుల నాయకత్వాన పనులు చేయడానికి నిరాకరించి సమ్మెలుచేశారు. మొత్తంమీద ఊడ్పేపనివాండ్రు తమ పరిస్థితులను బాగుపరచుకొనేందుకు ప్రయత్నాలు సాగిస్తున్నారు. ఆ తరువాత జమీందార్లవద్దా, ధనికరైతులు, మధ్యతరగతిరైతులలో హైన్యంగం వారివద్దా, భూఖామందులవద్దా ముఖ్యంగా పనిచేసే వ్యవసాయకూలీలు, పాలేళ్ళు వస్తారు.

పాలేళ్ళకిచ్చే జీతాలరేటు మరీ అధ్వాన్నంగా వుంది. ఈరేటు ప్రాంతప్రాంతానికీ మారుతూవుంటుంది. సామాన్యంగా వారికి నెలకు 15 రూపాయలిచ్చి మామూలు భోజనం పెడతారు; లేక యేడాదికి రెండు మణుగుల ధాన్యం భోజనంక్రింద యిస్తారు. పని తరుణంలో అప్పుడప్పుడు పనిచేసే కూలీలకు సామాన్యంగా రోజుకు రూపాయిచొప్పున కూలి యిస్తారు.

వారికూడా ఇంతవరకు మేము కనీస జీవితభృతిని నిర్ణయించియుండలేదు. ఇటీవల సంవత్సరాలలో మరీ అధ్వాన్నపు కూలిరేటు వల్లా, ఎక్కువపని చేయించుకోవడ వల్లా వ్యవసాయకూలీలు పనికి లభ్యంకావడమే దుర్లభమైంది. ఈవిషయాన్ని మనం ముఖ్యంగా గుర్తించాలి. పారిశ్రామిక ప్రాంతాలలో వ్యవసాయకూలీలంతా పారిశ్రామిక కార్మికులయ్యారు. యితరప్రాంతాలలో పాలమ్ముకొనేవారుగా తయారయ్యారు. ఇంకా మరికొంతమంది యితర చిల్లరవృత్తులను స్వీకరించారు.

అనేక ప్రదేశాలలో పాలేళ్ళ సమ్మెలు జరిగాయి. కొద్దిగా జీతాలు పెంచినతరువాతనే సమ్మె విరమించడం జరిగింది; చాలా ప్రదేశాలలో వారికిప్పుడు నెలకు తిండిపెట్టి 30 రూపాయల జీతం, ఇస్తున్నారు.

రాజకీయంగా చమార్లు (వ్యవసాయ కూలీలతోకూడా) 'దళిత'సంఘంవైపుకూ, ఊడ్పే పనివాండ్రు 'బబింకీ' సభవైపుకూ మొగ్గుతున్నారు. ఇవన్నీ కులసంఘాలే. వారివారి కులాల్లోవున్న కాంగ్రెసువాదులచేత యీ సంఘాలు నడుపబడుతున్నాయి. కాని మనం పనిచేసిన ప్రాంతాలలో మనవైపుకూడా మొగ్గుతున్నారు.

కూలినిగురించీ, భూమినిగురించీ వారికోర్కెలను మనం వారిముందు పెట్టినవెంటనే రైతాంగంఅంతా శ్రద్ధగా ఆలోచించడం ప్రారంభిస్తుంది. వారంతా పేదరైతాంగంతో సంయుక్తంగా సంఘటితపడి ఒకేసంస్థలో చేరడానికి తేలికగా సిద్ధపడుతున్నారు. కాని యింతవరకు పేదరైతులే దానికి ఒప్పుకోవడం లేదు.

అంతేకాక రైతుల్లో పరస్పరంగా చాల దురభిప్రాయాలు పాతుకొనిపోయి ఉన్నాయి. వారంతా కులాలవారీ, ఒకరికొకరు చాల వేరుపడిఉన్నారు. కాని వారందరూ ఒకేవిధమైన నిర్బంధవిధానాన్ని యెదుర్కోవలసినప్పుడు పరస్పరంగావున్న యీ దురభిప్రాయాలన్నీ వాటంతటవే ఎగిరిపోతాయి.

ఈవర్గంలో విపరీతమైన అసంతృప్తి పెరిగి ఉంది. జమీందార్లకూ, రైతులకూ మధ్య అనేక సంఘర్షణలుకూడా జరిగాయి. ఈసందర్భంలో అసంతృప్తిచెందిన యీ జనసామాన్యాన్ని కులప్రభావాన్నుండి, హ్రస్వదృష్టితో కూడుకున్న కులరాజకీయాలన్నింటినుండి బయటకు లాగి సరిగానూ, చైతన్యయుతంగాను వారికి నాయకత్వం వహించి నడుపవలసిన బాధ్యత మనపైనుంది."

ఇక్కడ మరొక కొత్తవిషయముంది. పల్లెప్రాంతాలలోని శ్రామికవర్గంలోకి పాత కాలపునాటి బానిసలూ, ఎలాంటి ఆస్తీలేని రైతులేగాక తనవృత్తిని పోగొట్టుకొన్న వృత్తి పనివాడూ (ఆర్టిజాన్) కూడా కలసిపోయాడు. పైన ఉదహరించిన కామ్రేడ్ తన రిపోర్టులో యితణ్ణికూడా వ్యవసాయకార్మికునితో చేర్చి వేయడానికి కొంతవరకు సందేహించాము. కాని అలా కలిపివేయడమే సరైనవిషయం.

ఇక్కడకూడా పైనచెప్పిన ఉదాహరణ వల్ల భూమిపై ఆధారపడే పల్లెటూరి కార్మికులూ, యింకా యితరవృత్తులపై ఆధారపడే ప్రజలూ గ్రామాలలో నూటికి 30 నుండి 45 వరకూ ఉంటారని స్పష్టపడుతోంది.

ఫ్లౌడ్ కమిషన్ రిపోర్టు ప్రకారం బెంగాల్‌లో మొత్తం జనాభాలో నూటికి 22 రు భూమిలేని వ్యవసాయ కూలీలున్నారు. ఇది పదిసంవత్సరాల క్రిందటి విషయం. 1944-45లో ప్రభుత్వం యిటీవల ప్రకటించిన లెక్కలప్రకారంభూమిలేని వ్యవసాయకూలీల సంఖ్యనూటికి 36.4 రు ఉన్నారు.

## 5

వ్యవసాయ కార్మికులసంఖ్య యీ విధంగా పెరగడంలో గల ఆంతర్యమేమిటి? అది వినియోగానికిగాక అమ్మకానికి వస్తువులను తయారుచేసే పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానాన్ని ప్రధానంగా తెలియపరుస్తుంది. అంతే కాదు, పల్లెలలోని అధికసంఖ్యాకులైన ప్రజలు తమ శ్రమశక్తిని అమ్ముకోకుండా జీవించలేరనే యదార్థాన్నికూడా యిది స్పష్టం చేస్తోంది. శ్రమశక్తి అమ్మకానికి ఒక వస్తువుగా మారింది. ఇందులో చాలమంది తిరిగి కౌలుదార్లుగానూ, పాలుదార్లుగానూ వృత్తి సంపాదించుకోగలిగినా — వారు శ్రమశక్తిని అమ్ముకొనేవారుగా తయారయ్యారనే విషయం మాత్రం స్పష్టం. వారు భూమినిమాత్రమే గాక యితర ఉత్పత్తి సాధనాలైన ఎద్లూ, నాగళ్లు వగైరాలకూడా పూర్తిగా పోగొట్టుకున్నారు. అందువలన వారు అప్పుడప్పుడు కూలికిపనిచేసేవారుగామాత్రమే ఉండగలుగుతున్నారుగాని; మరోవిధంగా ఉండటం అసాధ్యమవుతోంది.

శ్రమశక్తి అమ్మకపు వస్తువుగా తయారవడం పెట్టుబడిదారీ విధానలక్షణం. శ్రమశక్తి యీ విధంగా తయారవడం ఫ్యూడల్ విధాన సంబంధాలకూ, ఫ్యూడల్ భూస్వామ్య సంబంధాలకూ పూర్తిగా విరుద్ధం. యథార్థానికి ఆ ఫ్యూడల్ సంబంధాలకది పూర్తిగా విరుద్ధమైనదే. అది ఫ్యూడల్ ఆర్థిక విధానం ఛిన్నాభిన్నం అవడాన్ని సూచిస్తూ, ఫ్యూడల్ సమాజ గర్భంనుండి పెట్టుబడిదారీ విధానసంబంధాలు ఉత్పన్నం కావడాన్ని తెలియజేస్తుంది.

మన నేటి వ్యావసాయకసంబంధాలలో ఇక బాహాటంగా కనపడే విషయమేమంటే పల్లెప్రజలలో నూటికి 30 నుండి 50 వరకూ పెట్టుబడిదారీ విధాన సంబంధాలలో ఇరుక్కొని తమ శ్రమశక్తిని అమ్ముకొనేవారుగా తయారయ్యారు. యథార్థానికి పేదరైతాంగంతోకూడాకలుపుకుంటే ఇంకా ఎక్కువగా, గ్రామజనాభాలో నూటికి 70నుండి 80 వరకూ ఉంటారు. ఎందువలననంటే పేదరైతులు

కూడ పూర్తిగా కాకపోయినా, సగంవరకైనా యితరులవద్ద కూలిచేసి తమ శ్రమశక్తిని అమ్ము కొంటున్నారు. ఇది వెనకటి పాత ఫ్యూడల్ సంబంధాల మార్పునూ, పెట్టుబడిదారీ సంబం ధాల ప్రాభవాన్ని తెలియజేస్తుంది.

దీనినిబట్టి సహజంగా మనకు మరొక విషయం కూడా బోధపడుతుంది. ఈ నూటికి 70, 80 మంది తమ జీవితావసరమైన (కమొడిటీస్) వస్తువులను మార్కెట్టులో కొనుక్కోవాలి. ఈవిషయం పెట్టుబడిదారీ మార్గపు అస్తిత్వాన్ని తెలుపుతోంది. ఫ్యూడల్ భూసంబంధాలూ, అనేక రకాలుగా వున్న ఫ్యూడల్ శాసనవిధానమూ ఒకవైపున అలాగే తాండవమాడుతున్నా - గ్రామీణుల్లో అత్యధిక సంఖ్యాకులు పెట్టుబడిదారీ వస్తూత్పత్తి మూల సూత్రాలకు తప్పనిసరిగా కట్టుబడేవుంటారు. ఈ ప్రజానీకంపై భూస్వామ్యవిధానదోపిడీ, భూస్వామ్యవిధానం తెచ్చిపెట్టిన బాధలు అట్టే నిలిచియున్నాయి. ఈ ఫ్యూడల్ దోపిడీకితోడు నూతన పెట్టుబడిదారీ దోపిడీ తోడయింది. అసలువిషయ మేమంటే అత్యధిక సంఖ్యాకులైన గ్రామీణులుకూడా పెట్టుబడి దారీ ఉత్పత్తి సంబంధాలకులోనై పెట్టుబడి దారీ దోపిడికిగురవుతారు. ఫ్యూడల్ దోపిడీ దాని సంబంధాలూ విచ్ఛిన్నమవుతూ శిథిలమై పోతున్నాయి. దీనిఫలితంగా నూతన దోపిడీ విధానమూ, నూతన సంబంధాలూ ఉత్పన్న మయ్యాయి.

పల్లెల్లోని శ్రామికవర్గాన్నిగురించి వివరిస్తూ లెనిన్ యిలా వ్రాశాడు :

"మరొక నూతనవర్గ మేమంటే, కూలి చేసుకు బ్రతికే గ్రామీణ శ్రామికులు. వీరికి 'అల్లాట్ మెంటు' భూములు (గ్రామకమ్యూన్ యిచ్చిన భూములు)కూడా వుంటాయి. ఏమీ భూమి లేనినిరుపేదలు, కొద్దిగా భూమిగల్గిన పేదరైతులుగూడ యీ వర్గంలో జేరివుంటారు. కాని అస్పష్టంగా రష్యాలో యీ క్రిందివారిని గ్రామీణ శ్రామికులుగా పేర్కొనవచ్చును: రోజుకూలి చేసుకొని జీవించే వ్యవసాయకూలీ, నిపుణతలేని సామాన్య పనివాడు, తాపీపనివాని చేతిక్రింద పనిజేసేకూలీ, యిదేవిధంగా గ్రామీణ యితరవృత్తులలో పనిజేసే కూలీ యీ వర్గంలోకి వస్తారు. సెంటో, కుంటో భూమిపై వ్యవసాయం చేస్తూండడం, అదీ గూడ శిథిలావస్థలోపడివుండడం (అందుచేతనే ఆ చారెడు భూమి కౌలుకిస్తూవుండడం) లెక్క లమ్ముకోనిదే జీవనం గడవకపోవడం, అతి నికృష్టమైన జీవితాన్ని గడుపుతూ వుండడం - యీ కూలీవర్గపు ప్రత్యేక లక్షణాలు.

పల్లెటూరి కూలీలకు పల్లెల్లో వుండే భూస్వాముల స్వప్రయోజనాల నిమిత్తమే కొద్దిపాటి భూములను యిస్తారు. అందు వల్లనే పెట్టుబడిదారీ దేశాలలో భూమిగల పల్లెటూరి కూలీలు ముఖ్యంగా వుండటం చూడగలం. ఈ కపు శ్రామికవర్గం వివిధ దేశాలలో వివిధస్వరూపాలలో వుంటుంది. ఉదాహరణకు ఇంగ్లీషురైతు (కాటర్ *) కూ కొద్దిపాటి పొలంపై జీవించే ఫ్రెంచి రైతుకూ భేదంవుంది. అలాగే రైన్ రాష్ట్రా లలోవుండే రైతుకూ ప్రష్యాలోని రైతుకూ భేదముంటుంది. ఆయాదేశాలలోని వ్యవ సాయక సంబంధాల పరిణామ క్రమమూ, చరిత్రలనూ అనుసరించీ, ప్రత్యేక వ్యవ సాయక పద్ధతుల ననుసరించి వీరిలో యీ భేదాలు ఏర్పడుతున్నాయి. పల్లె టూరి శ్రామికులగూర్చి మనం గావించిన నిర్వచనం, అతనికి ఆయా దేశాలలో భూమిపై లీగల్ గావున్న హక్కుదృష్ట్యా

* కాటర్ : ఇంగ్లండులో రైతులు పొలాన్ని ఒక నిర్ణీత కాలం అద్దెకు తీసుకొని అక్కడే యిల్లుకట్టుకొనే పద్ధతివుంది. — అనువాదకుడు.

ఏమీ మార్పునవసరంలేదు. భూమి తన స్వంతఆస్తిగావున్నా, లేక భూస్వామి అతనిని కొంతభూమిని సాగుచేసుకోడానికి అవకాశాన్నిచ్చినా, రష్యాలోలాగా మొత్తం గ్రామ కమ్యూన్ సభ్యుడుగా అతనికి కొంతభూమిపై హక్కున్నా – అది పెద్దగా వారివిషయంలో భేదాన్ని కల్గించదు. కాన గ్రామీణ శ్రామిక వర్గాల్లో పేదరైతులనుకూడా కలుపుతున్నామంటే మనం కొత్తవిషయాన్నేమీ చెప్పడంలేదు."

(డెవలప్‌మెంటు ఆఫ్ కేపిటలిజం ఇన్ రష్యా, లెనిన్ సెలక్టడ్ వర్క్సు–యల్. డబ్ల్యూ. ఎడిషన్, పేజీలు 231–233.)

గ్రామీణ శ్రామికవర్గానికి వుండే ప్రధాన లక్షణమేమంటే వారికి కొద్దోగొప్పో పొలమున్నా లేక పోయినా తమ శ్రమశక్తిని తప్పనిసరిగా అమ్ముకొనేవారుగా ఉంటారు.

రైతాంగం శిథిలమై గ్రామీణ శ్రామిక వర్గం ఉద్భవించడంలోని ప్రాముఖ్యతను, గురించివ్రాస్తూ లెనిన్ యిలా అన్నాడు.

"రైతాంగం శిథిలమవడంతో పెట్టుబడిదారీ విధానానికి స్వదేశంలో మార్కెట్టు సృష్టించబడుతుంది.

"గ్రామీణప్రజల క్రింది శ్రేణిలోని (వ్యవసాయ కూలీలకు) వారు నిత్యం వాడుకొనే వస్తువులను మార్కెట్టులో కొనుక్కోవాలి; గాబట్టి ఈ వర్గం ఉద్భవించడంతో అంతరంగిక మార్కెట్టు ఏర్పడుతోంది. గ్రామీణ శ్రామికవర్గం మధ్యతరగతి రైతుతో పోల్చిచూస్తే తక్కువతిండే తింటారు. అంతేగాకుండా తినేతిండి, వాడేవస్తువులు కూడా చాల తక్కువ రకమైనవిగా వుంటాయి. అయినప్పటికీ, మొత్తంగాచూస్తే మధ్యతరగతి రైతుకంటే వీరేఎక్కువ సంఖ్యగా వాటిని కొంటారు"

(అదేగ్రంథంలో 235 పేజీ)

కాబట్టి గ్రామీణ శ్రామికులు మార్కెట్టులో వస్తువుల కొనుగోలుదార్లుగా వుంటున్నారు. ఇందుమూలంగా గ్రామీణ శ్రామిక వర్గం – మధ్యతరగతి రైతుకంటే ఎక్కువగా పెట్టుబడిదారీ సమాజంతో ముడిపెట్టబడిఉంది.

గ్రామీణ శ్రామికవర్గం ఉత్పన్నం కావడంతో పెట్టుబడిదారీ సమాజానికి చెందిన మరొక నూతనవర్గం తయారవుతోంది.

"గ్రామాలలో బూర్జువావర్గం ఉత్పన్నమై అభివృద్ధి చెందడంతో రెండు రకాలుగా మార్కెట్టు సృష్టించబడుతోంది.

మొదటిరకం ఏమంటే: గ్రామ బూర్జువా వర్గం "దెబ్బతిని పోయిన" భూస్వాముల నుండి, చితికిపోతున్న రైతులనుండి పొలాలను 'ప్రోగు జేసి' వాటిని పెట్టుబడిదారీ వుత్పత్తి సాధనాలుగా మార్చడానికి ప్రయత్నించుతూ వుండడంవలన మార్కెటు సృష్టించబడుతుంది. ఇది ప్రధానంగా ఉత్పత్తి సాధనాల అమ్మకానికి సంబంధించిన మార్కెటు. రెండోది; ధనికరైతుల అవసరాలు నిత్యం పెరిగిపోతూ వుండడంవలన నిత్యం వాడుకునే వస్తువులకొరకు గిరాకి ఏర్పడి, ఆవిధంగానూ మార్కెటు యేర్పడుతోంది." (అదే గ్రంథం. 235–236 పేజీలు)

ఈ విధంగా వ్యవసాయక శ్రామికవర్గం ఉద్భవించడం అంటే కేపిటలిస్టుమార్కెట్టూ, పెట్టుబడిదారీ వస్తూత్పత్తీ, పరస్పర విభిన్నమైన నూతనవర్గాలూ, ఉత్పన్నమవడాన్ని తెలియజేస్తుంది. స్వంత జీవితావసరాలనూ వ్యక్తిగత అవసరాలను తృప్తిపరచుకోడానికి మాత్రమేగాక లాభాలకొరకూ, అదనపువిలువలకొరకూ కార్మికశక్తిని దోపిడీచేసే గ్రామ బూర్జువా వర్గం ఉత్పన్నమవడాన్ని అది సూచిస్తుంది.

# 6

వ్యవసాయ కార్మికుల, పేదరైతుల బలాన్నీ, భూమిపై జరుగుతున్న కేంద్రీకరణ లెక్కలను మనం దృష్టిలో వుంచుకుంటే ఈ సంబంధాల యొక్క ప్రాబల్యాన్ని తేలికగా గ్రహించగలుగుతాం.

రోజురోజుకూ భూమి కొద్దిమంది చేతులలో కేంద్రీకరణ అవుతూవుండడం మనం యిన్ని సంవత్సరాలనుండీ గుర్తించుతూనే వున్నాం. కాని దీనినుండి మనం ఒక కొత్త వర్గం - పాతదానికి పూర్తిగా విరుద్ధమైనదీ, పాతదానిపైనే పెరుగుతున్నట్టిదీ అయిన ఒక వర్గం ఉత్పన్నమవుతున్నదనే విషయాన్ని తెలుసుకోలేకపోయాం. దానివలన రైతులు నానాటికి దరిద్రులు గావడమే చూడగలిగాముగాని నూతనవర్గాలు ఏర్పడడాన్ని కానలేకపోయాం. అంతేకాదు; యీ భూములు పోయిన రైతులలో కొందరు భూస్వాముల కౌలుదార్లుగా మారుతూవుండడం వడ్డీవ్యాపారుల బానిసలుగా అయిపోతూవుండడం మూలంగా ఫ్యూడల్ దోపిడీవిధానం తిరిగి ఏర్పడుతూవుందని మాత్రమే అర్థంజేసుకుని మోసపోయాం. ఈరోజున ఈ ఘటనలనే మనం నూతన దృష్టితో అర్థంచేసుకోగలుగుతున్నాం.

ఈ విధంగా రైతులనుండి భూములు పోవడాన్ని సామ్రాజ్యవాద చరిత్రకారులు "సాగుచేసేవారిచేతుల్లోనుండి భూమివెళ్ళిపోవడంగా" మాత్రమే వర్ణించారు. కాని నిజానికి వ్యవసాయ రంగంలోకి పెట్టుబడిదారీ విధానమూ, వడ్డీ వ్యాపారులూ, లాభాలు సాధించే పెట్టుబడులూ, ఆ తరువాత ధనికరైతులూ వాళ్ళ వ్యవసాయపు పెట్టుబడులూ - క్రమేణా ప్రవేశించడాన్ని మాత్రమే అది తెలియజేస్తుంది. ఈ విషయాన్ని ఆర్థిక వేత్తలూ, మన పార్టీ చాలకాలంక్రితమే గ్రహించడం సంభవించింది. అయితే సామ్రాజ్యవాదుల పరిపాలనక్రింద ప్రజానీకం రోజురోజూ మరింత దరిద్రవంతం అవుతున్నదని మాత్రమే అనుకున్నాముగాని దీనితోపాటు నూతనవర్గాలు ఉత్పన్నమవుతున్నాయనే విషయాన్ని గ్రహించడం జరగలేదు. భూములనుండి రైతులను ఈ విధంగా విరివిగా తొలగించడం మూలంగా భూమి కొద్దిమంది చేతులలో కేంద్రీకరించబడటం సంభవిస్తోంది. ఇందుమూలంగా రైతు తను భూమిని పోగొట్టుకోవడమేగాక యితర విధమైన ఉత్పత్తి సాధనాలను (పశువులు, వ్యవసాయ పరికరాలు వగైరా) కూడా కోల్పోయి, తిరిగి అతడు సామాన్య రైతులేక సాగుచేసుకొనే రైతు స్థితికి సహితం రావడం కష్టతరమవుతోంది. బెంగాల్ కరువు కమీషన్ ముందు యివ్వబడిన సాక్ష్యాలనుబట్టి యీ రకమైన పరిణామము జరుగుతూన్నదని తెలుస్తోంది. యుద్ధ పరిస్థితులు యీ పరిణామాన్ని యింకా త్వరితపర్చాయి. కరువు కమీషన్ (బెంగాల్) రాష్ట్రప్రభుత్వాలను యీ క్రింది ప్రశ్నలను అడిగింది. "భూమిపై యాజమాన్యం వ్యవసాయక వర్గాల చేతులలోనుండి వ్యవసాయేతర వర్గాల (ధనికులూ, వడ్డీవ్యాపారులు) చేతులలోకి ఎంతవరకు పోయింది?" "ఈ విధంగా భూమిపై యాజమాన్యం వ్యవసాయేతరుల చేతులలోకి వెళ్ళిపోకుండా చేయబడిందా లేక కొంతవరకైనా తగ్గించబడిందా?"

ఇందుకు సమాధానంగావచ్చిన జవాబులు* యీ క్రిందివిధంగా ఉన్నాయి:

* బెంగాల్ కరువు విచారణ కమీషన్ రిపోర్టు - 1945 - పేజీలు 445-8.

### బెంగాల్:

"భూమి వ్యవసాయకవర్గాల చేతులలోనుండి ఎక్కువగా వెళ్ళిపోతూవుందనే విషయంలో ఎలాంటి సందేహమూ లేదు. ఈ భూములు వ్యవసాయేతరుల చేతులలోనో లేక అదివరకే తాము స్వంతంగా సాగు చేసుకోలేనంత ఎక్కువగా భూములున్న ధనికరైతుల చేతులలోనో వెళ్ళిపోవడం సంభవిస్తోంది. కాబట్టి రైతులు భూములు కోల్పోవడమనే పరిణామము ఆపివేయబడిందనిగానీ లేక కొంత వరకు తగ్గించబడిందనిగానీ అనుకోడానికి ఎలాంటి ఆస్కారమూ లేదు. మీదుమిక్కిలి బెంగాల్ టెనర్సీ (సవరణ) చట్టం (1938) వల్ల పరిస్థితి మరింత అధ్వాన్నమైనదని ఊహించబడుతోంది. ఈ చట్టం, భూమి మార్పిడిగూర్చిన్నీ లోగడఉన్న అడ్డంకులను పూర్తిగా తొలగించి, అసలు వ్యవసాయకులు భూములను కోల్పోయే పరిస్థితులను మరింత సానుకూలంచేసింది."

### ఒరిస్సా:

"భూమిని ఒకరివద్దనుండి మరొకరికి స్వేచ్ఛగా మార్చేహక్కు చిన్నరైతులకు నష్టం కలిగించినదని నమ్మడానికి తగిన కారణాలున్నాయి. భూమిపై యాజమాన్యం వ్యవసాయక వర్గాలనుండి వ్యవసాయేతర వర్గాల చేతులలోకి పోవడం ప్రస్తుతం పెద్దగా కనపడటంలేదు." కాని భూమి చిన్నరైతులనుండి వ్యవసాయదారులుగా వుంటూ యితరవృత్తులలో ఉండేవారి చేతులలోకి పోతూన్నట్లు కనుపించుతోంది – అంటే ధనికరైతులు లేక రైతు కుటుంబాలలోనుండి యితర వృత్తుల ద్వారా డబ్బుగడించి దానిని భూమిపై పెట్టుబడి పెట్టేవారి చేతుల్లోకి పోతోందన్నమాట.

### మద్రాసు:

"1931 నుండి 1934 వరకూజరిగిన భూమి మార్పిళ్ళగూర్చి విచారణచేస్తే – ఆవిధంగా మార్పిళ్ళు జరిగిన భూమిలో నూటికి 20 వంతులు వ్యవసాయేతరుల చేతులలోకి వెళ్లిపోయినట్లూ, ఎక్కువభాగం స్వయంగా వ్యవసాయంచేయనివారి చేతిలోకీ ముఖ్యంగా గ్రామీణ వడ్డీవ్యాపారుల చేతులలోకి వెళ్ళిపోయినట్లూ కనపడుతూ ఉంది. ఇది ముఖ్యంగా ఋణపరిష్కార ఫలితంగా ఏర్పడు పరిస్థితి. ఇటీవల సంవత్సరాలలో రైతులు భూములుకోల్పోవడమనేది తగ్గిందా లేదా అనే విషయాన్నిగురించి ఖచ్చితంగా సమాధానమివ్వలేము;"

### బొంబాయి:

"వ్యవసాయదారులు అప్పులు పాలవడం మూలంగా జరిగిన ఫలితాలలో ఒకటి భూమి వ్యవసాయదారుల చేతులలోనుండి వ్యవసాయేతర వర్గాల చేతులలోకి పోవడం. అయితే యీ పరిణామం మెల్లిగాజరిగి ఆఖరు వారి దక్కన్ అగ్రికల్చరిస్టు రిలీఫ్ యాక్టువల్లా, వ్యవసాయదారుల ఋణనివారణ చట్టంవల్లా, భూమిపై హక్కుపరిమితిని ప్రవేశపెట్టడం మూలంగా ఆగిపోయింది"

ఈవిధంగా భూమి వ్యవసాయేతర వర్గాల చేతులలోకి వెళ్ళిపోకుండా ఆపుచేయగలిగామనే బొంబాయి ప్రభుత్వప్రకటన బూటకం మాత్రమే. ఎందువలననగా రైతులవద్దనుండి భూమి ఎక్కువగా లాక్కొనబడిన రాష్ట్రాలలో బొంబాయి ముఖ్యమైనది.

### మధ్యరాష్ట్రాలూ – బీరార్:

"వ్యవసాయకవర్గాల చేతులలోనుండి భూమి వెళ్ళిపోయే ధోరణి ఎక్కువగానే ఉంది. కాని ఋణపరిష్కార చట్టంవల్లా, వడ్డీవ్యాపారులచట్టం, ఋణభారనివారణ చట్టాల

వల్లా ఇది తగ్గించబడింది. వ్యవసాయంలో మంచిలాభాలు రావడంమూలంగా భూమిపై యాజమాన్యం తిరిగి వ్యవసాయదారుల చేతుల లోకి వెళ్ళిపోయేధోరణి ప్రస్తుతంవుంది. బీహార్‌లో కో-ఆపరేటివ్ బ్యాంకులచే కొనబడ్డ భూములు చాలవరకు తిరిగి వ్యవసాయక వర్గాలకు అమ్మబడ్డాయి."

బీహార్ ప్రభుత్వ ప్రకటనకూడా అబద్ధమే ఎందువలననగా వారి ఉద్దేశంలో వ్యవసాయదారులంటే ప్రత్తినిపండించే ధనికులూ, లేక భూస్వాములు మాత్రమే. కో-ఆపరేటివ్ సొసైటీలవల్ల మంచి లాభాలు రావడం మూలంగా తిరిగి భూమిని ఎవరుకొనగలరో, ఎవరిదగ్గర డబ్బు వున్నదో తేలికగా అర్థంచేసుకోవచ్చు. అసలు జరిగిన విషయమేమిటంటే ఇరవై పాతిక సంవత్సరాల క్రిందట బీహార్‌లో పత్తిధరలు పడిపోవడంవల్ల చిన్నచిన్న రైతులూ, పెద్దరైతులూ వారితో పాటు మరి కొంతమంది భూస్వాములూ దెబ్బతినిపోయారు, వారు విపరీతమైన అప్పులకు లోనయ్యారు. దీనిఫలితంగా చాల భాగం భూమి వ్యవసాయేతరులైన వడ్డీవ్యాపారులకు తనఖా పెట్టబడింది. ఇంకా భూమిలో చాలభాగం పెద్దమొత్తాలుగా అప్పులిచ్చిన సహకారసంఘాలకు పోయింది. భూమిలో చాలభాగం సాగుచేయబడక అలాగే వుండి పోయింది. అప్పులభారాన్ని తగ్గించడానికని ప్రభుత్వం ఋణపరిష్కార బోర్డును నియమించి 25000 రూపాయలవరకూవున్న ఋణాలను తగ్గించాలని నిర్ణయించింది. ఈ విధంగా ఋణ పరిష్కార సందర్భంలో చిన్నరైతు సర్వనాశనమైనాడు. ధనికరైతులూ భూస్వాములూ, తగ్గించబడిన ఋణాలను చెల్లించి తిరిగి తమ భూములను సంపాదించుకో గలిగారు. ఋణాలను తగ్గించే విషయంలో అక్రమ పద్ధతులు జరిగాయి. ఉదాహరణకు ఋణంలో మూడోవంతో లేక సగమో నిర్ణయించి దానిని చెల్లించమనడం, దానికి బదులుగా అతని భూమి అతనికిచ్చివేయడం జరిగింది. చిన్నరైతువద్ద రొఖ్ఖంలేకపోవడంవల్ల తగ్గించబడిన ఋణాన్ని సహితం చెల్లించలేక పోయాడు. పెద్దరైతులు మాత్రమే ఆ తగ్గించబడిన ఋణాలను చెల్లించి తమ భూములను తిరిగి సంపాదించుకో గలిగారు.

## సంయుక్త రాష్ట్రం:

"సాగుచేసుకొనే హక్కు ట్రాన్సఫర్ అయినప్పుడు సర్వసాధారణంగా మార్పు చేయించుకొన్నవాడు వ్యవసాయవర్గాలకే చెందివుంటాడు. తిరిగి అతడు యితరులకు కౌలుకు యివ్వనిపక్షంలో సామాన్యంగా అతడే సాగుచేసుకొంటాడు. తిరిగి కౌలుకిచ్చే విషయంలోనూ, చట్టానికి విరుద్ధంగా సాగు చేసేవాడిని భూమినుండి తొలగించేవిషయం లోనూ సంయుక్తరాష్ట్రాలలోని టెనన్సీ చట్టం కొన్ని హద్దులను విధించింది. టెనన్సీ చట్టం అమలుజరపడంలో యిటీవల అనుభవాన్నిబట్టి చట్టానికి విరుద్ధంగా రైతులను భూములనుండి తొలగించి తిరిగి కౌలుకు యివ్వడమనేది కొంత ఎక్కువ అయిందని తెలుస్తోంది."

యు. పి. ప్రభుత్వం పెద్దరైతుల చేతుల లోకి భూమి ఎంతవరకు పోయిందనే విషయాన్ని చెప్పడంలేదు. అయితే తిరిగి కౌలుకివ్వడం జరుగుతోందని ప్రభుత్వం అంగీకరించడం ఒక ముఖ్యమైన విషయమే. ఎందువలనంటే పెద్దరైతాంగానికి సాగుకు యింకా ఎక్కువభూమి అవసరంవుంటుంది గాబట్టి యీ విధంగా కౌలుకు యిచ్చేది బీదరైతాంగానికే అయివుంటుంది.

యుద్ధకాలంలోనూ, యుద్ధానంతరమూ, ధరలు పెచ్చుపెరిగిపోవడం మూలంగా బీద

రైతాంగం నష్టపడి, ధనిక రైతాంగం మరింత బలపడటం జరిగింది. దీని ఫలితంగా ధనిక రైతుల చేతుల్లోకి అధికంగా భూమి కేంద్రీకరణ జరగడం సహజంగా సంభవించింది. "1942-45 మధ్యలో రుణభారంతగ్గుదల" అన్న శీర్షిక క్రింద కరువు కమీషన్ రిపోర్టులో (299 పేజీలో) యిలా వ్రాయబడింది.

"వ్యవసాయకుల రుణభారం ధాన్యాదుల ధరలు పెరిగిన ఫలితంగా ఎంతవరకు తగ్గిందో - నమ్మకమైన లెక్కలు లేకపోవడంవలన - చెప్పడం సాధ్యంకాదు. అయితే అన్ని రాష్ట్రాలలోనూ చాలవరకు రుణభారం తగ్గిందని మాకువచ్చిన జవాబుల వల్ల తెలుస్తోంది. పెద్ద భూఖండాలు వున్నవారి విషయంలోనూ, ఒక మాదిరి భూఖండాలున్నవారి విషయంలోనూ ఇది ముఖ్యంగా వాస్తవంగా కనపడుతోంది. ఇలా రుణభారం తగినవారిసంఖ్య మొత్తం గ్రామీణ సంఖ్యతో పోల్చినప్పుడు అంతపెద్దదిగా లేదనే విషయాన్ని మాత్రమే పురస్కరించుకొని యీ సందర్భంలో వ్యవసాయాభివృద్ధికి భవిష్యత్తున్నదనే ఆశాపూరితమైన విషయాన్ని తక్కువ అంచనా వేయరాదు. ఈవర్గాలకు చెందినవారి చేతుల్లో ఎక్కువ భాగం భూమి ఉన్నదనే విషయాన్ని మనం మరచిపోరాదు. ఇప్పటివరకూ వ్యవసాయాన్ని మరింత అభివృద్ధిచేయడానికి ఈ రుణభారంవలన ఏర్పడ్డ అడ్డంకులు తొలగడం మూలంగా యికభవిష్యత్తులో సాగయ్యేభూమిలో అధికభాగం విషయం చాల ఆశాజనకంగా ఉన్నదనే చెప్పొచ్చు."

మైనారిటీగా వుండే కొద్దిమంది పచ్చపచ్చగా వున్న ధనికరైతులకూ, వారితో కొద్దిమంది మధ్యతరగతి రైతులకూ మాత్రమే అధికధరలు లాభించాయని రుజువుచేయడానికి కావలసినంత నిదర్శనం వుంది. తతిమ్మావారందరి పరిస్థితులూ అధ్వాన్నమయ్యాయి. మైనారిటీకి చెందిన యీ కొద్దిమంది రైతుల చేతుల్లోనే ఎక్కువభాగం భూమి కేంద్రీకరించి వున్నదని చూపెట్టడానికి కావలసినంత రుజువుంది. ఇందులో కమీషన్కు ఆశాజనకంగా కనపడేదేమంటే వ్యవసాయాన్ని "అధికోత్పత్తి" ప్రాతిపదికపై అంటే పెట్టుబడిదారీ పద్ధతులపై అభివృద్ధి చేయగలమనే విశ్వాసమే. పాతఅప్పులు తీరినవెంటనే ధనికరైతు వడ్డీవ్యాపారుల ఋణపాశాలనుండి శాశ్వతంగా విముక్తిపొందిన ఫలితంగా భూమినీ కూలీలను దోచుకోడానికి తగినంత పెట్టుబడిని కలిగి వుంటాడని కమీషన్లోని సభ్యులు భావిస్తున్నారు.

రాష్ట్ర ప్రభుత్వాలలో అధికభాగం ధనికరైతునూ బీదరైతునూ కలిపివేసి ధరల పెరుగుదల ఫలితంగా వ్యవసాయకుల రుణభారం తగ్గిందని కమీషన్ ప్రశ్నలకు సమాధానం యిచ్చాయి. అయినా, కొన్ని ప్రభుత్వాలు యీ ధరల పెరుగుదలవల్ల ఏవర్గానికి లాభించినదనే విషయాన్ని బయటపెట్టక తప్పింది కాదు.

"ధాన్యాదుల ధరలు పెరగడంమూలంగా రైతుల రుణభారం ఏమైనా తగ్గినవా - తగ్గితే ఏమాత్రం తగ్గినదని మీరు అంచనా వేస్తున్నారు?" అని కరువు కమీషన్ వేసిన ప్రశ్నకు

సమాధానంగా రాష్ట్రప్రభుత్వాలు ఈ క్రింది విధంగా జవాబులు పంపినాయి :

బెంగాల్ :—"చాలభాగం తగ్గుదలకు అవకాశం ఉంది. ఎందువలనంటే వ్యవసాయదారులలో చాలమంది లోగడకంటె తమ అప్పులను నగదురూపంలో తిరిగి చెల్లించ గల స్థితిలో ఉన్నారు. అందువల్ల వారు రుణదాతలకు చెల్లించవలసిన అప్పులు తగ్గ గలవు. వ్యవసాయక రుణగ్రస్తులలో అధిక భాగమైన చిన్నరైతులను ధాన్యాదుల ధరల పెరుగుదలవల్ల ఎంతవరకు లాభించారో చెప్పడం కష్టం. ఎందుకంటే వారి భూములలో పండే పంట వారి కుటుంబ పోషణకే ఒక్కొక్కసారి సరిపోదు. అదీ గాక వారు విపరీతమైన ధరలుపోసి తమకు కావలసిన గుడ్డలూ, ఉప్పు, కిరసనాయిలూ, మందులూ వగైరా కొనుక్కోవలసి ఉంటుంది."

బొంబాయి :—"పచ్చపచ్చగా ఉన్న వ్యవసాయదారులు మాత్రం పోస్టాఫీసు సేవింగ్ బ్యాంక్ క్యాష్ సర్టిఫికెట్లూ, నేషనల్ సేవింగ్ సర్టిఫికెట్లూ ద్వారాను సహకార సంఘాలూ యిచ్చే అవకాశాన్ని వినియోగించుకొని కొంతవరకు డబ్బు దాచుకొనేందుకు అలవాటు పడ్డారు. తక్కిన వారికి అసలు దాచుకొనేందుకు తాహత్తే లేకపోయింది."

ఒరిస్సా :— "డబ్బున్న వ్యవసాయదారులు తమ ఖర్చులు పోగా కొంతవరకు నిలవచేసుకో కలుగుతున్నారు. అందులో నుండి తమ పాత రుణాలను తీర్చుకొంటూ తిరిగి కొత్తఅప్పులు చేయకుండా జాగ్రత్త పడగలుగుతున్నారు. అయిదు ఎకరాల భూమికి లోపుగావున్న చిన్నరైతులకు ఈ ధరల పెరుగుదలవల్ల పెద్దగా లాభించలేదు. పాత అప్పులను తీర్చుకొనేందుకు అదనంగా పండిందేమీలేదు; తాము కొనుక్కోవలసిన వస్తువులకు ధరలు విపరీతంగా పెరిగిపోవడంవల్ల యీ వర్గానికది కొత్త భారంగా పరిణమించింది.

డబ్బున్న ధనికవర్గాలు తాము నిలవ చేసుకోగలిగిన ధనంతో భూములు కొంటున్నారు; డిఫెన్సు సేవింగ్సు సర్టిఫికెట్లూ, యుద్ధపుబాండ్లూ కొంటున్నారు. పల్లె ప్రాంతాలలో భూమికొరకు వ్యవసాయదారులలో డిమాండ్ పెరగడం కనబడుతోంది."

మధ్యరాష్ట్రాలూ, బీరార్ :—"ధరలు పెరగడంమూలంగా చట్టాలవల్ల తగ్గించబడిన రుణాలను వాయిదాలవారీగా క్రమంగా చెల్లించివేయడం, అనేకమంది రుణభారాన్నుండి విముక్తులవడం, మరి కొంతమందికి చెందిన భూములు తాకట్టు నుండి విడుదలవడం జరిగింది." (దీని అర్థాన్ని పైన మనం చూశాం.) "పల్లెటూరి ప్రజలు డబ్బును నిలవజేసుకోవడమంటే భూములనో, పశువులనో, బంగారము, వెండినో కొనుక్కోవడం కంటే మరోవిధం వారికి తెలియదు. వీటన్నింటికి ధరలు పెరిగిపోవడంవల్ల అవకాశమున్నప్పుడల్లా భూములను కొనడానికి వారు తయారవడం జరుగుతున్నది."

[ బెంగాల్ కరువు కమీషన్ తుదిరిపోర్టు, పేజీలు 467-8 ]

# 7

పైన వివరించిన నిదర్శనాలన్నీ ఒక నూతన వర్గం - ధనికరైతువర్గం - వుత్పన్న మవడాన్ని తెలియజేస్తాయి: ఈ వర్గానికి ధరలు పెరగడం లాభదాయకం. ఎందుకంటే ధనికరైతు వర్గం మార్కెట్టుకోసం అదనంగా వుత్పత్తి చేస్తుంది. డబ్బిచ్చి కూలీలను పెట్టుకొని పని జేయిస్తుంది. భూములను కొంటుంది; వ్యవసాయాన్ని జీవితావసరంకోసం గాక లాభాలు పొందుదామనే దృష్టితో కొనసాగిస్తుంది. ఈ వరకే రాష్ట్రప్రభుత్వాల దృష్టిని ఆకర్షిస్తోంది. భూస్వామి, కౌలుదారు లేక రైతు వడ్డీవ్యాపారి యీ మూడువర్గాలే యిదివరకు ప్రభుత్వానికి కనపడుతుండేవి. రైతాంగంలో వున్న వర్గతారతమ్యాలుఏర్పడి, యుద్ధకాలంలో యివి మరీ వృద్ధిఅయ్యాయి. దాని ఫలితంగా యీ నూతనవర్గం - ధనిరైతులు ప్రధానంగా ప్రభుత్వదృష్టిలో పడ్డారు.

ఈ వర్గం రైత్వారీ ప్రాంతాలలో యిదివరకు రుణదాతలుగా। వ్యవహరించే భూస్వాముల నుండి వుద్భవించడం కొన్ని సందర్భాలలో జరుగుతోంది. ఈ భూస్వాములు తమ భూములను యిది వరలాగా కౌలుకిచ్చే బదులు యిప్పుడు కూలీ లను పెట్టుకొని స్వయంగా వ్యవసాయాన్ని సాగించడానికి పూనుకొంటున్నాడు. యీవర్గం మరొకవిధంగా గూడ ఏర్పడుతోంది. పచ్చపచ్చగావున్న రకంనుండి వ్యవసాయ వనరులు బాగావున్న రైతులనుండి గూడ నేరుగా వుత్పన్న మవుతోంది. ఈ వర్గం మరి కొన్నిచోట్ల (జమిందారీ ప్రాంతాలలో) వడ్డీ వ్యాపారుల వద్దా, ఫ్యూడల్ భూస్వాముల వద్దా ధనిక కౌలుదార్లుగా వుండే రైతులనుండి గూడ ఉద్భవించుతోంది.

వ్యవసాయంలో జరుగుతున్న పైరకపు పరిణామానికి సరిగా వ్యతిరేకధోరణిలో మరొక వైపునుండి వ్యవసాయ శ్రామిక వర్గమూ ఉత్పన్నమౌతోంది. ఈ రెండువర్గాలకూ ఒకదానికొకటి పరస్పరవిరుద్ధం. వ్యవసాయకశ్రామికుడు భూమిని పోగొట్టుకోడమే కాక, ఉత్పత్తిసాధనాలనుకూడా కోల్పోయాడు. పెట్టుబడిదారీ వస్తూత్పత్తి, అందు కవసరమైన మార్కెట్టూ అభివృద్ధిచెందడంతో పాటు భూమీ, ఉత్పత్తిసాధనాలూ-ఈ రెండూ మార్కెట్టులో కొనుక్కోవలసిన వస్తువులుగా తయారయ్యాయి. ఇందుకు పెట్టుబడి, డబ్బూ అవసరమైంది. వీటిని పేదరైతుగాని, వ్యవసాయ కూలీగాని - డబ్బులేదుకాబట్టి కొనేస్థితిలోవుండడు. ధనిక రైతు తనవద్ద అదనంగా ప్రోగుపడిన డబ్బుతో వీటిని మార్కెట్టులోకొని, కూలీలయొక్క శ్రమశక్తి కొల్లగొట్టేందుకు వీటిని వినియోగిస్తాడు. అతడు ఉత్పత్తిచేసే విధానం ఖచ్చితంగా పెట్టుబడిదారీవిధానం. తనచేతుల్లో భూమీ, తతిమ్మా ఉత్పత్తిపరికరాలు ఉండటాన్ని ఆధారంచేసుకొని, కూలీలను దోచుకొంటాడు. వారి శ్రమశక్తిని కొనుక్కొంటాడు.

అతడు ఫ్యూడల్ సమాజానికి గాక పెట్టుబడిదారీ సమాజానికి చెందినవ్యక్తి. మారకపు వస్తూత్పత్తి అభివృద్ధితో శిథిలమైపోతున్న ఫ్యూడల్ ఆర్థిక విధానాన్నుండి అతడు ఉద్భవిస్తున్నాడు. ఫ్యూడల్ బానిససంబంధాలను త్రెంచుకుంటూ అమలులోకి వచ్చిన మారకం డబ్బు చెలామణి - వీటన్నింటి ప్రాబల్యంతో ఫ్యూడల్ భూస్వామియొక్క బానిససంకెళ్ళ నుండి బయటబడుతున్న రైతుకి తడు సాధారణంగా ప్రాతినిధ్యం వహించుతాడు.

ఇది రష్యాలో ఏవిధంగా జరిగిందో వర్ణించుతూ లెనిన్ యిలా చెప్పాడు:

"భూమిపై స్వంత యాజమాన్యంగల్గిన సామాజిక శక్తులు రైతాంగంనుండి రోజు రోజు ఉత్పన్నమవడం మనం చూస్తున్నాం. 19 వ శతాబ్దాంతంలో రాచరిక కుటుంబాలకు చెందినవారికి ఫ్యూడల్ లేక బానిస సంధాలతో కూడుకున్న భూమిపై యాజమాన్యంవుంది; స్వంతఆస్తిపరులుగా భూమి గల్గివున్నవారిలో వీరే అప్పట్లో అధిక సంఖ్యాకులుగా వున్నారు. కాని భూమంతా బూర్జువా భూస్వామిక విధానంగా పరిణమించడం సహజంగా కనపడుతోంది. వెనకటి రాచరికపు అంగరక్షకులు, మతాధిపతులు, ప్రభుత్వోద్యోగులనుండి వంశపారంపర్యంగా సంక్రమించిన వ్యక్తిగత స్వంతభూములు తగ్గిపోతున్నాయి. డబ్బుతో కొనడంమూలంగా సంక్రమించిన వ్యక్తిగత స్వంతభూములు పెరుగుతున్నాయి. భూమిప్రాభవం తగ్గిపోతుంది; ధనప్రాబల్యం పెరిగిపోతోంది, రోజురోజుకు భూమి వాణిజ్యప్రవాహంలోకి యీడ్వబడుతోంది."

(రష్యాలో వ్యవసాయక సమస్య: లెనిన్ సెలెక్టెడ్ వర్క్సు యల్. డబ్ల్యూ. ఎడిషను ప్రథమ సంపుటిలో 141 పేజీ)

డబ్బుకూ, మారక వస్తూత్పత్తికీ ప్రాభవం పెరిగిన పుణ్యమా అంటూ కొంచెం పచ్చ పచ్చగావున్న వ్యక్తులంతా మధ్యయుగాలనాటి బానిసత్వపు సంకెళ్ళనుండి బయటపడి, పెట్టుబడిదారీ దోపిడీవిధానానికి పూనుకొన్నారు.

ఈ సందర్భంలో లెనిన్ ఇలా వ్రాసాడు:

"నాచురల్ రెంటు" [అంటే కౌలుడబ్బు రూపంలోగాక వస్తువుల రూపంలోగాని లేక శ్రమరూపంలోగాని భూస్వామికి చెల్లించడం] సర్వసాధారణంగా ప్రతిచోటా డబ్బు రూపేణా చెల్లించే కౌలుకంటే చాల అధికంగా అప్పుడప్పుడు రెట్టింపుగా కూడా వుంటుందని మిస్టర్ కార్యషేవ్ ఒప్పుకొని తీరాలి. అంతేకాదు. బీద రైతాంగంలో "నాచురల్ రెంటు" పద్ధతి విస్తారంగా అమలులోవుంది. కొంచెం బాగావున్న రైతు భూములను డబ్బురూపంలోనే కౌలుకు తీసుకోడానికి ప్రయత్నిస్తాడు. అంతేగాకుండా మామూలు రైతు గూడ తాను చెల్లించవలసిన మక్తాను యెల్లప్పుడూ డబ్బురూపంలో చెల్లించే అవకాశాన్ని వినియోగించుకో జూస్తాడు. ఈ విధంగా ఇతరుల భూమిని కౌలుకు తీసుకోవడంలో చెల్లించవలసివచ్చే అధికమక్తారేటు భారాన్ని తగ్గించుకో జూస్తాడు.

కాబట్టి మన మక్తాపద్ధతిలోవున్న బానిస లక్షణాల భారమంతా నిరుపేదలైన రైతులపై బడతుంది. కొంచెం డబ్బున్న రైతులు యీ మధ్యయుగాలనాటి బానిసత్వాన్నుండి తప్పించుకోడానికి ప్రయత్నిస్తారు. వారికున్న డబ్బునుబట్టి యిది సాధ్యమౌతుంది. తమవద్ద డబ్బున్న పక్షంలో ఆనాటి మార్కెట్టు ప్రకారం డబ్బుకు కౌలుకు తీసుకొంటాడు. ఇక వారివద్ద డబ్బులేకపోతే ఆ బానిసత్వంలో పడి తాము కౌలుకు తీసుకొన్న భూమికి మార్కెటు రేటుకంటే (డబ్బులో లెక్కించిన రేటుకంటె) మూడురెట్లు అధికంగా చెల్లించుకోవలసి వస్తుంది. అది ధాన్యం రూపంలోగాని లేక శ్రమశక్తి అమ్మకుని చాకిరీలోగాని జరగవచ్చు – అదే గ్రంథంలో.

ఇంకా లెనిన్ యిలా వ్రాస్తాడు.

"గుర్రాలులేని (వ్యవసాయ కూలీలు) లేక ఒక గుర్రంగల (అర్ధశ్రామిక పేదరైతులు) కుటుంబాలు ఒక 'డిస్సెయిటన్'గాని (అంటే 2.7 ఎకరాలు) లేక డిస్సెయిటన్‌లో కొంతభాగాన్ని మాత్రమేగాని కౌలుకు తీసుకోగలుగుతున్నప్పుడు మరొకవైపున నాలుగుకాని అంతకు పైగాకాని గుర్రాలు

గల్గిన కుటుంబాలు 7 నుండి 16 'డిస్సెయింటుల' వరకూ కౌలుకు తీసుకో గలగడం మనం చూస్తున్నాం. ఈ విధంగా అసలు స్వభావంలోనే మార్పు వస్తున్నట్లు స్పష్టమవుతోంది. మొదటిరకపు రైతులు తమయొక్క నిరుపేదతనంవల్ల కౌలుకు తీసుకోవలసిన అవసరం కలిగింది. అందుచేత ఈరకపు రైతులు బానిసత్వంలో మునుగుతున్నారు. ఆ పరిస్థితులలో, కౌలుదారుకు పీడనకు గురవడంతప్ప మరో గత్యంతరంలేదు. అతడు బానిసచాకిరీ చేయడంద్వారాను, శీతాకాలంలో సహితం కష్టపడి పనిచేయడం ద్వారానూ, నాములు తీర్చుకుంటూ యీ విధంగా తన కౌలుబకాయలను చెల్లించుతాడు. మరోవైపున ½ నుండి 16 డిస్సెయింట్ల భూమిగల కుటుంబాలవారు తమ భూమికి అదనంగా మరొక 7 నుండి 16 డిస్సెయింట్ల భూమిని కౌలుకు తీసుకొంటారు. తాముబీద వారవడంవల్ల ఈవిధంగా వీళ్లు కౌళ్ళభూములను కోతీసుకోవడంకాదు; మీదుమిక్కిలి వారు ధనవంతులవడం మూలంగానే. తమ కుటుంబ పోషణకు కాదు; మరింత భాగ్యవంతులవడానికే. ఇంక మరికొంత 'డబ్బు కూడబెట్టడానికే.' ఈవిధంగా పొట్టగడుపుకోడానికి కౌలుదార్లు కొనసాగించే వ్యవసాయం పెట్టుబడిదారీ వ్యవసాయంక్రింద ఎలామారిందో తెలుసుకోడానికి చక్కటి నిదర్శనాన్ని మనం చూస్తున్నాం. వ్యవసాయంలో పెట్టుబడిదారీవిధానం ఏవిధంగా తలెత్తుతున్నదో చూస్తున్నాం. పైనచెప్పబడిన కుటుంబాలు వ్యవసాయకూలీలను పెట్టుకోకుండా తమ వ్యవసాయాన్ని కొనసాగించలేరు."

—(అదేగ్రంథం 168 పేజీ)

కాబట్టి ధనికరైతు వుత్పన్నమవడం పెట్టుబడిదారీ చిహ్నం. వ్యవసాయంలో పెట్టుబడిదారీ సంబంధాలు అభివృద్ధి అవడమన్నమాట. మధ్యయుగాలనాటి బానిసత్వంనుండి యీ రకపు రైతాంగం "విముక్తి" కావడం, ఫ్యూడల్ భూస్వామి సంబంధాలు తగ్గించుకొని కాంట్రాక్టు సంబంధాలు మారుతూ వుండడం-యిదంతా భూమిపై డబ్బుయొక్క ప్రభావాన్ని తెలియజేస్తుంది. వుత్పత్తి సాధనాలు కోల్పోయిన మనుష్యులను పీడించుకొని తినే పెట్టుబడిదారీ దోపిడీగా వారి పీడనా పద్ధతి తయారవుతూంది. ధనిక రైతువర్గం రంగంలోకి రావడంమూలంగా గ్రామసీమల్లో పాతపోరాటానికి తోడు మరొక నూతనపోరాటం వుత్పన్నమవడాన్ని తెలియజేస్తుంది. దీనివల్ల పల్లెటి ప్రాంతాలలో ఫ్యూడల్ భూస్వామిక విధానానికి వ్యతిరేకంగా జరిగే పోరాటాన్ని పెట్టుబడిదారీ దోపిడీకి వ్యతిరేకంగా జరిగే పోరాటంతో సమ్మిళితం చేయకుండా, కొనసాగించడం అసాధ్యం అని స్పష్టపడుతోంది. ఈ రెండు పోరాటాలు ఒకదానినొకటి పెనవేసుకొని, కలసిపోతాయి. గ్రామసీమల్లోని అత్యధిక సంఖ్యాకులు భూస్వాములూ, పెట్టుబడిదారుల, సంయుక్త పీడనకు - ప్రత్యక్షంగానో పరోక్షంగానో గురవుతున్నారు.

# 8

పైవర్గాల చేతులలోకి భూమి ఎంతవరకు పోయిందో-భూమంతా రోజురోజుకూ కొద్దిమంది వ్యక్తుల చేతులో ఏవిధంగా కేంద్రీకృతం అవుతున్నదో వివరించే లెక్కలుచూస్తే పెట్టుబడిదారీ సంబంధాలు ఎంత దృఢంగా ఉంటాయో ఇంకా స్పష్టంగా బోధపడుతుంది.

పొలాలను అమ్మడం, కొనడం - లీగల్‌గా అది లైసెన్సీ వాక్కులను ఒకరినద్దనుండి

మరొకరివద్దకు మార్చడం మాత్రమే అయి నప్పటికీ-డబ్బుయొక్క ప్రాబల్యానికి చక్కటి నిదర్శనం. ఈ క్రయవిక్రయాలే నేడు పెట్టుబడి దారీ సంబంధాలకు ప్రాతినిధ్యం వహిస్తున్నాయి. అంటే భూమికూడా నేడు ఒక మారకపు వస్తువుగా మారిపోయింది. ఎవరివద్ద డబ్బుంటే వారు భూమిని మార్కెట్టులో కొనుక్కోవచ్చు. ఇందులో ఫ్యూడల్ ఆస్తివిధానంలో ఉన్న అడ్డంకులేవీ పనిచేయవు. ఫ్యూడల్ ఆస్థివిధానం ఏవిధంగా ఛిన్నాభిన్నమైపోతూ ఉందో ఇది తెలియజేస్తుంది. లెనిన్ చెప్పినట్లుగా ఇప్పుడు భూమికూడా వాణిజ్య సుడిగుండంలోకి యీడ్వబడింది. ఆర్థిక సంబంధాలపై ఫ్యూడల్ వ్యక్తిగత ఆస్థియొక్క ఆధిపత్యం ఉన్నంతకాలమూ, ఉత్పత్తి సహజ ఆర్థిక విధాన ప్రాతిపదికపై జరిగినంతకాలమూ, వస్తువుల మారకం దాదాపు లేనంతకాలమూ, భూమి అమ్మడానికీ కొనడానికీ ఒక సాధన-వస్తువుగా ఉంటానికి వీలులేకుండా పోయింది. ఇతర వస్తువులను కొనడానికి వీలైనట్లు ఆనాడు డబ్బుతో భూమిని కొనడానికి సాధ్యమయ్యేది కాదు.

రెండోదేమంటే: రైత్వారీ ప్రాంతాల లోనూ, జమీందారీ ప్రాంతాలలోనూ భూమి కొద్దిమంది వ్యక్తులచేతులలో కేంద్రీకృతం కావడమంటే అది వర్గసంబంధాలెలా మారి పోతున్నాయో, భూమిపై ఏవిధంగా మారకపువస్తువులే రోజురోజుకీ ఎక్కువగా ఉత్పత్తి అవుతున్నయో, భూమిపై పనిచేసేవారు తమ శ్రమశక్తిని ఏవిధంగా అమ్ముకోవలసి వస్తున్నదో, తన స్వంతకోసం, అవసరాలను నిమిత్తం ఉత్పత్తి చేయడమనే పద్ధతి ఎలా అంతమవుతున్నదో తెలుపుతోంది.

పంజాబునుగురించి బెంగాల్ కరువు కమీషన్ రిపోర్టులో యీ క్రిందిలెక్కలు యివ్వబడ్డాయి:

భూములున్న వారిలో నూటికి 2.4 గురికి ఒక్కొక్కరికి 50 యకరాలకుపైగా భూమి ఉంది. మొత్తంభూమిలో నూటికి 38 వంతులు వీరిక్రింద ఉంది.

నూటికి 28.8 రైతులకు ఒక యకరంనుండి 3 యకరాలవరకూ భూమిఉంది. మొత్తం భూమిలో నూటికి 3.2 మాత్రమేవీరిక్రిందఉంది.

అలాగే యకరంకంటే లోవున్న రైతులు నూటికి 20.2 మంది ఉన్నారు. మొత్తం భూమిలో నూటికి 0.8% మాత్రమే వీరిక్రింధ ఉంది.

ఈవిధంగా నూటికి 2.4 రైతులకు మొత్తం భూమిలో నూటికి 38 ఉంటే - నూటికి 48.8 రైతుల స్వాధీనంలో నూటికి ఆరోవంతు భూమి మాత్రమే ఉంది.

బొంబాయిని గురించిన లెక్కలు యీ క్రింది విధంగా ఉన్నాయి. 5 యకరాలకు తక్కువఉన్నవారు 11,30,000మంది వున్నారు. వీరు మొత్తం భూమిగలవారిలో నూటికి 49 మంది. మొత్తంభూమిలో నూటికి 9.5మాత్రమే వీరి స్వాధీనంలోఉంది.

24 నుండి 100 యకరాలు ఉన్నవారు 22,000మంది వున్నారు. మొత్తం భూమివున్న రైతాంగంలో వీరు 10వ వంతు మాత్రమే. మొత్తం భూమిలో వీరికి నూటికి [illegible]4.4 వుంటుంది.

వందయకరాలకుపైగా వున్నవారు 20,000 మంది ఉన్నారు. వీరు మొత్తం రైతాంగంలో నూటికి ఒక్కరుమాత్రమే. వీరిక్రింద వున్న భూమి నూటికి 15.6

వివిధ రకాలవారి రైతులక్రిందనున్న మొత్తం యకరాల సంఖ్య లెక్కలోకి తీసుకొంటే యీ పరిణామ స్వభావం మరింత స్పష్టంగా కనపడుతుంది.

(1) 11 లక్షల 30 వేలమంది రైతుల చేతుల్లో 25 లక్షల 40 వేల ఎకరాల భూమి ఉంది.

(2) 2 లక్షల 20 వేలమంది రైతుల స్వాధీనంలో 92 లక్షల 30 వేల ఎకరాల భూమి ఉంది.

(3) 20 వేలమంది చేతుల్లో 41 లక్షల 70 వేల ఎకరాలభూమి ఉంది.

ఈ విధంగా నూటికి 11 మంది చేతుల్లో మొత్తంభూమిలో నూటికి 59 వంతులు అనగా 1 కోటి 34 లక్షల ఎకరాల భూమి ఉంది. నూటికి 49 వంతులున్న రైతుల చేతుల్లో 25లక్షలు ఎకరాలు మాత్రమే ఉంది.

(బెంగాల్ కరువుకమీషన్ రిపోర్టు 256-7 పేజీలు)

అయితే ఈ లెక్కలలోకి నూటికి 40 నుండి 50 వరకూ ఉన్న వ్యవసాయకూలీలను తీసుకోలేదు. ఈ విషయాన్నికూడా మనం దృష్టిలో వుంచుకొనిచూస్తే భూమి ఏవిధంగా కేంద్రీకరణ జరుగుతున్నదో యింకా స్పష్టంగా బోధపడుతుంది.

ఈ లెక్కలు భూమిగలవారికి మాత్రమే సంబధించినవి. అందువల్ల భూమి స్వంతంగా కలిగివుండిన రైతులమధ్యనే ఏవిధంగా భూమి కేంద్రీకరించబడిందో తెలుపగలవు. మొత్తం వ్యవసాయక జనాభానంతా తీసుకొని, అందులో వ్యవసాయకూలీల సంఖ్యనుకూడా ఈ లెక్కలలో కలిపిచూస్తే యీ విషయం భూమి కొద్దిమంది చేతులలో కేంద్రీకరించబడటం ఇంకా స్పష్టంగా కనపడుతుంది.

బెంగాలు కరువు కమీషన్ ఇచ్చిన లెక్కలు బెంగాల్‌ను గురించి ఈ క్రింది విధంగా తెలుపుతాయి.

| | హారి వారి యోజ మొత్తాన్న సాగులోని భూమి |
|---|---|
| 36.4% భూమి లేనివారు | 1.8% |
| 17.7% యకరానికి లోపువారు | 4.2% |
| 22.0% ఒక యకరంనుండి 3 యకరాలవరకు ఉన్నవారు | 16.9% |
| 9.6% మూడు యకరాలకుపైగా 5 యకరాలకు లోపువున్నవారు | 14.7% |
| 14.3% ఐదు యకరాలకుపైగా ఉన్నవారు | 62.8% |

ఈవిధంగా గ్రామాలలోని జనాభాలో నూటికి 54గురి చేతుల్లోఉన్న సాగుభూమి నూటికి 6 వంతులుమాత్రమే.

14.3% రైతులు 62.8% భూమిని తమ చేతులలో అట్టిపెట్టుకున్నారు.

మొదటి మూడురకాలవారిని కలిపి లెక్కలోకి తీసుకొంటే గ్రామ ప్రజానీకంలోని నూటికి 76గురు భూమిలో నూటికి 23 వంతులను కలిగిఉన్నారని, 62.8% భూమి 14% మంది చేతులలో కేంద్రీకరించబడి వున్నదనీ స్పష్టమవుతుంది.

# 9

ఈ లెక్కలు రైతాంగ ప్రజానీకం ఎంతటి దారుణ దరిద్రస్థితికి గురయిందో తెలపడమే గాక, పాత ఫ్యూడల్ విధానంలో కొద్ది స్కేలులో జరిగే వ్యవసాయం ఏ విధంగా కూలిపోయి దానిస్థానాన్ని మార్కెట్టుకోసం ముఖ్యంగా ఉత్పత్తి జరిగే నూతనవ్యవసాయం తీసుకొంటున్నదో నూతనవర్గాలు ముందుకెలా వస్తున్నారో — బోధపరుస్తాయి.

మొదటివిషయం ఏమంటే: అత్యధిక సంఖ్యాకులైన మెజారిటీ ప్రజలు అంగతక్కువ భూభాగాన్ని మాత్రమే కలిగిఉంటున్నారంటే వారు భూమి ఆధారంతో తమను పోషించుకోలేక పోతున్నారని స్పష్టపడుతుంది. కొంత భాగం వారు తమశ్రమశక్తిని యితరులకు అమ్ముకోవలసి వస్తున్నది. వ్యవసాయకూలీలతో

వారు కలసి యితరులకోసం పనిచేయడానికి లేబరు మార్కెట్టులోకి వెళ్లవలసివస్తోంది.

ఇక రెండో విషయం: వారు యితరులవద్ద కూలిచేస్తేనేగాని జరగడంలేదంటే—వారు తమ జీవితావసరవస్తువులను మార్కెట్టులో కొనుక్కోవలసి వస్తున్నది గాని తామంతతాముగా ఉత్పత్తి చేసుకోలేకపోతున్నారన్నమాట.

మూడో విషయం; కొద్దిపాటి మైనారిటీకే భూమిపై గుత్తాధిపత్యం ఉండడంటే యీ విశాలమైన భూఖండాలను వారు తమస్వంత వినియోగానికిగాక అందులోని ఉత్పత్తిని మార్కెట్టులో అమ్మడానికేనని స్పష్టపడుతోంది. మరోకవిషయమేమంటే కార్మికుల చేత కూలిచేయించుకోకుండా అంటే దోపిడీ చేయకుండా వారు తమ క్రిందవున్న పెద్దపెద్ద భూఖండాలను స్వయంగా సాగుజేయడం సాధ్యంగాదు. అంటే ఈ భూములలో ఉత్పత్తి కాబడినదానిలో అధికభాగం - ఎక్కువ భాగం - మార్కెట్టులోకి మారకపువస్తువుల్లాగా ప్రవేశించవలసి ఉంటుందన్న మాట.

ఈ విధంగా జమీందారీ ప్రాంతాలలో కూడా ఫ్యూడల్ భూస్వాముల కండ్లముందే, ప్రజలు మార్కెట్టుకోసం ఉత్పత్తి చేయడం, కూలీలను పెట్టుకోవడం ఉత్పత్తిని పెట్టుబడిదారీ పద్ధతులపై కొనసాగించడం జరుగుతుంది.

జమీందారీ ప్రాంతాలలోనూ రైత్వారీ ప్రాంతాలలోనూ కొద్దిమంది చేతులలో భూమి కేంద్రీకరణ జరగడం, డబ్బు రోజురోజుకూ కేంద్రీకృతమవడంపైనా కొద్దిమంది వ్యక్తులు చేతులలోకి పెట్టుబడులు కేంద్రీకృతమవడంపైనా, ఆధారపడి వుంటుంది. మార్కెట్టులో ఉత్పత్తి సాధనలను బహు కొద్దిమంది మాత్రమే కొనడానికి అవకాశం కలగడం మూలంగాకూడా భూమికేంద్రీకరణ ఆధారపడి ఉంటుంది. భూమి కేంద్రీకరణ జరగడం, అంటే భూమిఒక్కటే కేంద్రీకృతం కావడం గాక యితరఉత్పత్తి సాధనాలైన ఎడ్లూ, నాగళ్ళూ, ఎరువులూ వగైరాలు కూడా కేంద్రీకృతం కావడమన్నమాట. ఈ విషయాన్నే లెనిన్ యీ క్రిందివిధంగా వివరించాడు:

"సాగుజేసే భూమికీ, సాగుకోసం ఉపయోగించే * గుర్రాలకీ మధ్యసరియైన నిష్పత్తి (భూమినిబట్టి అవసరమైనన్ని గుర్రాలను) ధనికరైతులు మాత్రమే నిర్వహించ గలుగుతారు. అందువల్ల ధనిక రైతుల చేతుల్లో భూమి కేంద్రీకృతం కావడంతోపాటు పేదరైతులు గుర్రాలను కూడా కోల్పోతారు దీన్నిబట్టే పై జెప్పిన వైరుధ్యాన్ని (ఫ్యూడల్ భూస్వాముల కండ్లముందే పెట్టుబడిదారీ ఉత్పత్తి పద్ధతులేవిధంగా అభివృద్ధి చెందుతాయో —అనువాదకుడు) అర్థంచేసుకోవచ్చును. సరియైన నిష్పత్తి (భూమినిబట్టి అవసరమైనన్ని (గుర్రాలు—అనువాదకుడు) యథాస్థితిలో నిర్వహించబడడం. (రైతు ఆర్థిక విధానంలో ఇది ఎన్నడూ లేనే లేదు) మాత్రమే కాకుండా బూర్జువా రైతు మాత్రమే దీని ఉన్నతస్థాయిని అందుకుంటాడు. ఈ 'అసాధారణత్వం' సాధనాలు భగ్నమైపోయి చిన్న రైతుల యొక్క చిన్న చిన్న ఖండ్రికలుగా విభజించబడడంలో ప్రత్యక్ష సత్యంగా కనిపిస్తుంది. ఒకే గుర్రంగలిగిన పదిలక్షలమంది రైతులు తమ పదిలక్షల గుర్రాలతో ఎంతభూమిని సాగుజేస్తారో అందులో సగంగుర్రాలతోనే

* మన దేశంలో వ్యవసాయానికి ఎడ్లను ఉపయోగించినట్లే రష్యాలో గుర్రాలను ఉపయోగిస్తారు. (అనువాదకుడు)

లేక మూడువంతుల గుర్రాలతోటే ధనిక రైతులు అంతిభూమిని ఇంకా ఎక్కువ భాగుగా, ఇంకా ఎక్కువ జాగ్రత్తగా సాగుజేస్తారు."

(పై గ్రంథంలో, 165 వ పేజి)

ఈ రకమైన భూమి కేంద్రీకరణ పాత ఫ్యూడల్ రైతాంగం శిధిలమైపోవడాన్ని సూచిస్తుంది. సహజమైన ఆర్థిక విధానానికి సరిపడే కొద్దిపాటి స్కేలుమీద జరిగే ఉత్పత్తి విధానం కూలిపోవడానికి భూమి కేంద్రీకరణ ఒకగుర్తు. కొద్దిపాటి స్కేలుమీద జరిగే ఉత్పత్తిలో మా-కవస్తువులకు అవకాశం వుండదు. ఉన్నా యేకొద్దోవుంటుంది. అందువల్ల కొద్దిస్కేల్లోజరిగే ఉత్పత్తి విధానం పూర్తిగా వ్యక్తిగత జీవిత అవసరాలను తీర్చేదిగా ఉంటుంది. ఈ పరిణామగతిని అర్థం చేసుకోవడం మధ్యతరగతి రైతుస్థానం ఏదో తెలుసుకోవడానికి అత్యవసరం. ఈవిషయాన్నే లెనిన్ మాటలలో చెప్పాలంటే:

"రైతాంగంలోవున్న వివిధ ఆర్థిక పరస్పర వైరుధ్యాల్లోనే రైతాంగం శిధిలమైపోడానికి గల బీజాలు యిమిడివున్నాయి. ఈపరిణామాన్ని రైతులేగా 'రైతుతత్వం లేకుండా పోవడం' (అన్ పెజెంటైజ్) అని చక్కగా చిత్రించారు. ఈ పరిణామం పాతకాలంనాటి పితృస్వామిక యుగంనాటి రైతాంగాన్ని పూర్తిగా ధ్వంసం చేసి దాని స్థానే కొత్తరకపు గ్రామీణ ప్రజానీకం సృష్టించబడటాన్ని తెలియజేస్తుంది. ఈ పరిణామ స్వరూపాన్ని ఒక క్రమపద్ధతిలో అధ్యయనం చేసే ప్రయత్నం యింతవరకెన్నడూ జరుగలేదు... కొనికొక కారణం లేకపోలేదు. ఈ సమస్యపైన వ్రాసిన రచయితలలో అధిక భాగం రైతాంగం శిధిలమైపోవడాన్ని అస్తులలో అసమానత్వం ఏర్పడటంగా మాత్రమే పరిగణించారు. దీనినే సరోడ్నిక్ లు "తారతమ్యం" అని ఉల్లేఖించారు. అస్తులలో అసమానత్వం ఏర్పడటం యీ పరిణామానికంతటికీ ప్రారంభదశ అనడానికి ఎలాంటి సందేహమూలేదు. అయితే యీ పరిణామం అస్తుల "తారతమ్యం" తోనే ఆగిపోలేదు. పాతరైతాంగంలో 'తారతమ్యం' ఏర్పడడమే కాకుండా, వారు పూర్తిగా సర్వనాశనం చేయబడుతున్నారు. అసలు వారి అస్తిత్వమే అడుగంటిపోతోంది. నూతనంగా ఉత్పన్నమవుతూన్న వర్గాలచే వారు పూర్తిగా దోపిడి చేయబడుతున్నారు. మారకపు వస్తూత్పత్తి, పెట్టుబడిదారీ ఉత్పత్తి అధికారం చలాయించే సమాజానికి ఈ నూతనవర్గాలే పునాదిగా ఉపయోగిస్తాయి. ఈ నూతనవర్గాలే గ్రామ బూర్జువావర్గం (ముఖ్యంగా పెటిబూర్జవా) గ్రామీణ శ్రామికవర్గం. ఒకటి వ్యవసాయ రంగంలో పెట్టుబడిదారీ వస్తూత్పత్తిజేసే వర్గమూ, మరొకటి వ్యవసాయరంగంలో కూలి పనిచేసేవర్గమూ.

— (డెవలప్మెంటు ఆఫ్ కేపిటలిజం ఇన్ రష్యా, లెనిన్ - ఎల్. డబ్లు. ఎడిషన్ సంపుట 1 పేజీలు 227-8)

"రైతాంగం ముఖ్యంగా మధ్యతరగతి రైతాంగం శిథిలమైపోవడంవల్ల పూర్తిగా పరస్పర విరుద్ధమైన రెండు గ్రూపులు అభివృద్ధి చెందుతాయి. గ్రామీణ ప్రజానీకంలో రెండు కొత్తరకాలు ఏర్పడతాయి. మారకపు వస్తువులూ, డబ్బురూపంగల ఆర్థికవిధానం - ఇవి రెండూ కొత్తగా సృష్టించబడిన రెండు రకాలకూ సమాన లక్షణాలే. కొత్తరకంలో మొదటిది గ్రామీణ బూర్జువావర్గం - ధనిక రైతాంగం. రెండోది గ్రామీణశ్రామికవర్గం-కొద్దిగా పొలంకలిగివుండి కూలి చేసుకునే వర్గం." (అదే గ్రంథంలో 230-31 పేజీలు)

"రైతాంగం" లో సంస్కరణానంతరం దశకు చెందిన యీ రెండు కొత్త రకాలకు

మధ్య లింకుగా వుండేది మధ్యతరగతి రైతాంగం. ఈ రైతాంగంయొక్క ప్రత్యేకలక్షణ మేమంటే వీరిలో పెట్టుబడిదారీ వస్తూత్పత్తి విధానం చాల తక్కువగా అభివృద్ధి చెందడమే. అదునూ, పదునూ అన్నీ అనుకూలంగావుండి కలిసివచ్చిన సంవత్సరాల్లో మాత్రమే యీరకం రైతు తన ఉదరపోషణ చేసుకోగల శక్తిని కలిగి వుంటాడు. అందువల్లనే అతనిస్థితి ఎప్పుడూ నిలకడగా వుండదు. సర్వసాధారణంగా మధ్యతరగతి రైతు తన వ్యయానికి సరిపడ ఆదాయంలేక అప్పులు చేయవలసి వస్తుంది. ఈ రుణాలను వేరే కూలిచేసి, అంటే అదే సమయంలోనే యితరవృత్తులు చేస్తూ కొంత వరకూ, తన శ్రమశక్తిని యితరులకు అమ్మి తీరుస్తాడు. పంటలు దెబ్బతిన్నప్పుడల్లా మధ్యతరగతి రైతాంగం శ్రామికవర్గంలో కలసి పోవలసి వస్తుంది. సాంఘిక సంబంధాలలో యీ గ్రూపు పైవర్గానికి, క్రిందివర్గానికి మధ్య వూగిసలాడుతూ వుంటుంది. పై గ్రూపును అందుకోవాలనే ప్రయత్నంలో కొద్దిమంది మాత్రం జయంపొందుతారు. ఇక ఈ మధ్యతరగతిని క్రింది గ్రూపులోకి త్రోసేందుకు సామజిక పరిణామ శక్తులన్నీ వొత్తిడి చేస్తూ వుంటాయి. బూర్జువా రైతాంగం రైతాంగంలోని క్రింది గ్రూపునేగాక మధ్యగ్రూపును కూడా పిండివేస్తుందనే విషయాన్ని మనం యీవరకే చూశాం. కాబట్టి పెట్టుబడిదారీ విధానంయొక్క ప్రత్యేకలక్షణమైన యీ పరిణామం - (అన్ పెజెంటైజింగ్) సాగిపోతూనే ఉంటుంది. మధ్యలోవున్న తరగతులన్నీ నిర్జీవమైపోతాయి. అదే సమయంలో అన్నిటికంటె పైశ్రేణీ, అన్నిటికంటె క్రిందశ్రేణీ వృద్ధిచెందుతూ ఉంటాయి.

— (అదే గ్రంథంలో 235 వ పేజి)

## 10

పై విషయాన్నిబట్టి నూతన వర్గపోరాట గమనంలో మధ్యతరగతియొక్క స్థానమేదో తెలుస్తుంది. మధ్యతరగతిరైతు ఫ్యూడల్ భూస్వాముల దోపిడీక్రింద ఒకవైపునలుగుతూ ఉంటాడు. తన ఆర్థికస్థితి దెబ్బతినిపోయినప్పుడు మధ్యతరగతిరైతు నిస్సహాయస్థితిలో పడిపోయి భూస్వామ్యవిధానం ఉన్నచోట, ఆఫ్యూడల్ దోపిడీకి ఎరయైపోతాడు. కాబట్టి అతను ఫ్యూడల్ విధానానికి వ్యతిరేకి. బూర్జువా పెట్టుబడిదారులుకూడా మధ్యతరగతి రైతును దోపిడిచేస్తూనే ఉంటారు. కాబట్టి పెట్టుబడిదారీ రైతుంకూ, ఫ్యూడల్ భూస్వాములకూ వ్యతిరేకంగా జరిగే సమిష్టి పోరాటంలో అతన్ని మనం మన మిత్రవర్గంలోకి రాబట్టుకోవచ్చు.

కాని, అతనిస్థితి ఎప్పుడు మధ్యస్థంగా ఉండడంచేత, బూర్జువారైతాంగంతో సాంఘికంగా ఎక్కువ సంబంధం ఉండడంచేత అతనిలో ఊగిసలాటకూడా సహజంగా ఉంటుంది. అదేసమయంలో అతను - సాంఘికాభివృద్ధి అంతా పెట్టుబడిదారీ వస్తూత్పత్తి పంథాలో సాగుతూన్న సమయంలో, అట్టి ఉత్పత్తిలో అతిస్వల్ప సంబంధం గలిగిన ఆ మధ్యతరగతి రైతు - స్వయంపోషకత్వం గలిగిన ఒకచిన్న యజమానిగా తమ మధ్యస్థితిని నిలబెట్టుకోడాన్ని ప్రయత్నిస్తూ ఉంటాడు. పెద్ద యెత్తున విరివిగా వస్తూత్పత్తి జరుగుతూన్న సమయంలో తాను కొనసాగించే చిన్న ఉత్పత్తి విధానాన్ని కాపాడుకోడానికి ప్రయత్నిస్తాడు. కాబట్టి బూర్జువా రైతుకు

వ్యతిరేకంగా జరిగే పోరాటంలోనే కాకుండా ఫ్యూడల్ భూస్వామికి వ్యతిరేకంగా జరిగే పోరాటంలోకూడా మధ్యతరగతి రైతు ఎప్పుడూ ఊగిసలాడుతూనే ఉంటాడు. నిర్దిష్ట కార్యాచరణద్వారానే అతన్ని మన వైపు రాబట్టుకోగలుగుతాం. కాని అతన్నే ఫ్యూడల్ వ్యతిరేక పెట్టుబడిదారీ వ్యతిరేక పోరాటానికి మూలాధారం చేయరాదు.

మధ్యతరగతి రైతుకూ ఫ్యూడల్ బానిస పద్ధతికీ మధ్యగల సంబంధాన్ని ముఖ్యంగా * "లేబరురెంటు" పద్ధతిని గురించి లెనిన్ ఇలా నొక్కిచెప్పాడు.

"సాధారణ స్వయంపోషక ఉత్పత్తివిధానంను, మధ్యతరగతి రైతుస్థితి దెబ్బతినిపోయిన కొలదీ పెట్టుబడదారీ విధానం 'లేబరు రెంటు' పద్ధతిని తొలగిస్తూ ఉండడం సహజం. 'లేబరు రెంటు' పద్ధతికి ధనికరైతు ప్రాతిపదికగా ఉండడు. అతి నికృష్ట దారిద్ర్యాన్ని అనుభవిస్తోన్న నిరుపేదరైతే ఈ విధానానికి ప్రాతిపదిక. ఎందుచేతనంటే అతి నికృష్టదారిద్ర్యం వల్ల అతిస్వల్పఫలితంతోనే తన వ్యవసాయాన్నంతా నాశనం గావించుకుంటున్నా, భూస్వామి కొరకు పనిజేయవలసిన నికృష్ట స్థితిలోనే అతనెల్లప్పుడూ ఉంటాడు. మరికొన్ని కారణాల వలన — పొలం పాటా లేక పోవడం, ఒకవేళ ఉన్నా ఏ చారెడు చెక్క అవడంవల్ల 'లేబరు రెంటు' విధానానికి పల్లెటూళ్ళ శ్రామికవర్గంకూడా ప్రాతిపదికగా ఉండదు. ఈ పద్ధతికి 'మధ్యతరగతి' రైతును బంధించి వేసినంతగా పల్లెటూళ్ళ శ్రామిక వర్గాన్ని బంధించివేయదు. అందువల్ల ఎక్కడికైనా వెళ్ళి స్వేచ్ఛగా బానిస బ్రతుకు లేకుండా కూలీ, నాలి చేసుకొని ఇంకా నాలుగు డబ్బు లెక్కువ తెచ్చుకోవడం పల్లెటూళ్ళ శ్రామికులకు ఎక్కువ తేలిగా ఉంటుంది.

(పైగ్రంథమే పేజీ 259)

మధ్యతరగతిరైతు ఏవిధంగా చితికిపోతూ ఉన్నాడో, అతనిపరిస్థితి ఏవిధంగా నానాటికి తీసికట్టుగా ఉందో చూపడానికి ప్రత్యేక లెక్కలేవీ లేవు. కాని బెంగాల్లో మధ్యతరగతి రైతు కుటుంబాలు చెప్పుకోతగినంతగా చితికిపోవడం జరిగింది. ఫ్లౌడ్ కమీషన్ ప్రకటించిన లెక్కల ప్రకారం 1940 లో నూటికి 25 కుటుంబాలకు 5 ఎకరాలపైన పొలం ఉంది. 1945 లో బెంగాల్ ప్రభుత్వం ప్రకటించిన లెక్కల ప్రకారం (పై నుదహరించబడ్డాయి) నూటికి 14.3 కుటుంబాలకు మాత్రమే 5 ఎకరాల

* ధనరూపంలో గాకుండా ధాన్యంరూపంలోనే మక్తా రేటు చెల్లించే పద్ధతినిగానీ, లేక భూస్వామి పొలంలోనే కొన్ని నియమిత రోజులు స్వంత వ్యవసాయ పరికరాలతో వెట్టిచాకిరీ చేసేపద్ధతినిగానీ, 'లేబరురెంటు' విధానం అంటారు.

— (సంపాదకుడు - జనత)

పైగా ఉంది. మధ్యతరగతి రైతును విపరీతంగా దోపిడి చేయడంవల్లనే ఆకుటుంబాలింతగా దెబ్బ తినిపోయ్యాయి. ముఖ్యంగా 1940-45 మధ్య బెంగాల్లో ధరలు విపరీతంగా పెరిగిపోవడం వల్ల ధనికులకే ఎక్కువగా లాభించింది. 1943 లో వచ్చిన దారుణమైనకరువు బెంగాల్ రైతాంగాన్ని సర్వనాశనం చేసింది.

పెట్టుబడిదారీ సంబంధాలు పెంపొందడం వల్ల గ్రామసీమల్లో యీ విధంగా నూతన వర్గాలుత్పన్నమవుతున్నాయి. ఫ్యూడల్ భూస్వామ్య విధానానికి వ్యతిరేకంగా సాగించే వర్గం పోరాటంతోపాటు మరో నూతనవర్గ పోరాటాన్నికూడా ఎదుర్కోవలసి వస్తుంది. మరో దోపిడీవర్గం - ధనికరైతువర్గం - బయలు దేరుతూంది. అధికసంఖ్యాకులైన వ్యవసాయ కార్మికులూ, పేదరైతులూ ఫ్యూడల్ భూస్వాముల ప్రయోజనాలకు వ్యతిరేకమయినట్లే, ఈ కొత్తధనిక రైతువర్గ ప్రయోజనాలకుకూడా వ్యతిరేకులే. ఈ పరివర్తన గతిలోబడి ఒకవైపు నలిగిపోతూవున్నా - ఈ వర్గాల దోపిడీకి బలి అవుతూఉన్నా - మధ్యతరగతిరైతు ఇంకా ఊగిసలాడుతూనే ఉంటాడు. ఖచ్చితమైన, నిర్దిష్టమైన నాయకత్వంక్రిందనే అతను పోరాడ గలిగి ఉంటాడు.

## 11

గ్రామసీమల్లో నూతనంగా ఉదయించే వర్గాలనుగురించి తెలుసుకోవడంతోపాటు ఫ్యూడల్ సంబంధాలు ఎంతగట్టిగా అంటి పెట్టుకొని ఉంటాయోకూడా తెలుసుకో వలసి ఉంటుంది. ఫ్యూడల్ సంబంధాలు ఒక వైపు భిన్నాభిన్నమైపోతూఉన్నా అప్పుడే అవి పూర్తిగా నశించిపోవడం జరగదు. ఇంకా అవి సజీవంగా వుంటూ, అధికసంఖ్యాక ప్రజలను దోపిడీజేస్తూనే ఉంటున్నాయి. ఈ ఫ్యూడల్ బంధకాలనుంచి ధనికరైతులు మాత్రమే విముక్తి కాగలుగుతున్నారు. పెట్టుబడిదారీ సంబంధాలు అభివృద్ధి చెందుతూ ఉన్నాయి అంటే ఫ్యూడలిజం అప్పుడే గతించిందనీ - నిర్జీవమైపోయిందనీ - భావించరాదు. ఇంతటితో ఫ్యూడలిజం అంతమయిందని భావించి ఆ ప్రాతిపదికపై కార్యక్రమం కొనసాగించడమంటే, వ్యవసాయ కార్యక్రమాన్ని మొదట్లో వేసుకొనేప్పుడు రష్యా సోషల్ డెమోక్రాటిక్ పార్టీ చేసిన తప్పునే మనం చేసినవాళ్ళ మవుతాం. ఈతప్పునే లెనిన్ 'రష్యాదేశపు వ్యవసాయంలో పెట్టుబడిదారీ అభివృద్ధిని ఎక్కువఅంచనా వేయడంవల్ల' వచ్చిన దుష్ఫలితం అని తీవ్రంగా ఖండించాడు.

(సెలెక్టెడ్ వర్క్స్, 3 వ సంపుటి పేజి 253)

నూతన వర్గవైరుధ్యం, నూతన వర్గసంబంధాలు పాతసంబంధాల స్థానంలో గాకుండా, వాటిని అట్టేఉంచి వాటిపై ఇంకా అదనంగా రుద్దబడ్డాయి అనే విషయాన్ని మనం ముఖ్యంగా గుర్తించుకోవలసిఉంది. ఫ్యూడలిజం సృష్టించిన అనాగరిక దుర్భరపరిస్థితులకు గురియై బాధపడుతోన్న కష్టజీవులైన రైతుల పైనుండి ఫ్యూడల్ దోపిడీవిధానం మోపిన పాత బరువును దింపకుండానే నూతన పెట్టుబడిదారీ పద్ధతులు ఇంకా కొత్తబరువును వేశాయి. రైతులపరిస్థితి గోరుచుట్టుపై రోకటి పోటు చందమయింది.

ఈ విషయాన్ని గుర్తించకపోతే రైతులు పడే బాధలకు ప్రధానమైన మూలకారణాన్ని మనం గ్రహించజాలం. అంతేకాకుండా పెట్టుబడిదారీ విధానానికీ వ్యతిరేకంగా పోరాడేందుకు మాత్రమే వర్గశక్తుల సంయోగాన్ని ఏర్పరచపూనుకుంటాం. ఈ వర్గశక్తుల సంఘట

నలో మధ్యరైతును కలుపుకోకుండా తటస్థునిగా మాత్రమే ఉంచాలనే స్థితికి అది దారి తీస్తుంది.

పెట్టుబడిదారీ సంబంధాలు ఒకవైపు అభివృద్ధిచెందినా, ఫ్యూడల్ సంబంధాలుకూడా ఇంకా గట్టిగానే - బలీయంగానే - ఉన్నాయని ఏఏ విషయాలద్వారా ధ్రువపడుతోంది?

1. మనదేశంలో, ఎక్కువభూభాగంలో యూనియన్‌లో లీనమైన సంస్థానాల్లో - ఇంకా జాగీర్దారీ భూస్వామ్య విధానాలు అలాగే ఉన్నాయి. ఆ భూభాగంలో ఇంకా పెట్టుబడిదారీ వస్తూత్పత్తిగానీ, వర్గవైరుధ్యంగానీ, నూతనవర్గాలుద్భవించడంగానీ ఇతర ప్రాంతాల్లోలాగా అభివృద్ధి చెందలేదు. కాని మొత్తమీద ఆ నూతనవర్గాలు కొంతవరకు ఉత్పన్నం అవుతున్నాయనేమాటమాత్రం సత్యం. సంస్థానాలన్నీ యూనియన్‌లో చేరడంవల్ల సంస్థానాల్లోకూడా పెట్టుబడిదారీ వర్తకంకూడ త్వరితగతిని అభివృద్ధి చెందడానికి అవకాశం ఏర్పడింది. ఆ అభివృద్ధికూడా పైజెప్పిన విధంగానే (పెట్టుబడిదారీ పద్ధతిలోనే) జరుగుతుంది.

2. ఇండియన్ యూనియన్‌లో ఉన్న భూస్వామిక ప్రదేశాల్లో పెద్దపెద్ద భూఖండాలు, జమీందారుల స్వంతకమతం భూములుగా అట్టిపెట్టబడ్డాయి. వీటితోపాటు వాళ్ళ కౌలుభూములలోని వేలకొలది రైతులు ఫ్యూడల్ బానిసత్వంలో బంధించబడి ఉన్నారు. బటాయి, (పంటలో) పాలు, వగైరా అన్నిరకాల ఫ్యూడల్ లెవీలూ, విపరీతమైన కౌలురేట్లూ, భూస్వాముల భూములపై ఇంకా అమలులో ఉన్నాయి. అత్యధిక సంఖ్యాకులైన రైతు ప్రజాసామాన్యాన్ని బానిసత్వంలో బంధించిఉంచే భూస్వామ్యపద్ధతులూ, విపరీతమైన కౌలురేట్లూ రైతాంగాన్ని సర్వనాశం చేసివేస్తున్నాయి. అభివృద్ధిచెందుతూన్న పెట్టుబడిదారీ సంబంధాల ఫలితంగా కొద్దిమంది ధనిక రైతులు మాత్రం ఈ బానిసబంధాలనుంచి బైటపడగలుగుతారు. మిగతా రైతాంగం - మధ్యతరగతి రైతులు, పేదరైతులు, వ్యవసాయ కూలీలందరూ - పెట్టుబడిదారీ దోపిడితోపాటు ఫ్యూడల్ దోపిడికికూడ గురై నానాబాధలు పడతారు.

దేశంమొత్తంమీద పెట్టుబడిదారీ విధానం భారీపరిశ్రమలు అభివృద్ధి అయినకొలదీ వ్యవసాయంలోకూడా పెట్టుబడి ప్రవేశించడం పెట్టుబడిదారీ వస్తోత్పత్తి అభివృద్ధిచెందడం జరుగుతూంటుంది. ఈస్థితిలో పరిశీలించినా, ఫ్యూడల్ సంబంధాలు యింకా గట్టిగానే ఉన్నవని తెలుస్తుంది. పత్తి, నేత (బట్టలు) జనపనార, బొగ్గగనులు, ఇనుపగనులు, సిమెంటు పరిశ్రమలు, రెండుస్థలాల్లో ఇనుము ఉక్కు వగైరా భారీపరిశ్రమలు ఇండియాలో అభివృద్ధిచెందినప్పటికీ ఇంకా భారీయంత్ర పరిశ్రమలు పెద్దస్కేల్లో అభివృద్ధి చెందలేదు. యంత్రోత్పత్తి పరిశ్రమ అభివృద్ధి అయిందని చెప్పుకోడాని కెట్టిఆస్కారమూలేదు. కాబట్టి మనదేశం పారిశ్రామికంగా ఇంకా వెనకబడే ఉందని చెప్పకతప్పదు. అందువల్ల వ్యవసాయంలో పెట్టుబడిదారీ సంబంధాలు పూర్తిగా అభివృద్ధిచెందలేదు. ఫ్యూడల్ సంబంధాలను పూర్తిగా తుడిచివేయడం జరగలేదు. మనదేశంలో బాగా వేరూనిపోయిన ఫ్యూడలిజాన్ని తీవ్రమైన చర్యలద్వారానే సమూలంగా పెకలించి వేయడం సాధ్యమవుతుంది. వ్యవసాయానికి ఉపయోగకరమైనయంత్రాలను భారత పరిశ్రమలు ఉత్పత్తి చేయకపోవడం, తత్ఫలితంగా వ్యవసాయంలో యంత్రాలను ప్రవేశపెట్టలేకపోవడంవల్లకూడా మనదేశంలో ఇంకా ఫ్యూడలిజం చాలవరకుసజీవంగా ఉండగల్గుతోంది. ఆధునికయంత్రాల

ద్వారా కాకుండా పురాతన పనిముట్లపై ఆధారపడి ఫ్యూడల్ యాజమాన్యంక్రింద చిన్న వ్యవసాయోత్పత్తి మాత్రమే కొనసాగించబడుతోంది. ఒకరకంగా ఇది తప్పనిసరే అయింది. ఎందుచేతనంటే యంత్రాలద్వారా వ్యవసాయాన్ని కొనసాగించడమనేది చేతినిండా తగినంత డబ్బున్న ఒక నూతనవర్గం అభివృద్ధి చెంది ఉండడంపైనే ఆధారపడి ఉంటుంది. ఆలాంటి నూతనవర్గం ఉత్పన్నం కావడంలో కొంత ఆలస్యం జరుగుతూన్నా, మొత్తంమీద ఆవర్గం క్రమంగా ఇప్పుడు అభివృద్ధి చెందుతూ ఉంది.

మొత్తంమీద ఫ్యూడల్ బానిసత్వానికి సంబంధించిన కొన్ని దారుణపద్ధతులింకా అమల్లోనే ఉండడంవలన గ్రామసీమల్లోని అత్యధిక సంఖ్యాక భూస్వామ్య (జమిందారీ) వ్యతిరేక పోరాటంమీద ప్రజలు సమీకరింపబడడాన్నికూడ మనం చూస్తున్నాం. భూస్వామ్య (జమీందారీ) వ్యతిరేక పోరాటంతో పాటు అదే సమయంలో గ్రామ పెట్టుబడిదారీ దోపిడికి వ్యతిరేకంగా కూడా పోరాటం సాగించకుండా, గ్రామీణ అధిక సంఖ్యాక ప్రజలను సమీకరించడం సాధ్యం కాదు. ఇచ్చట గమనించాల్సిన విషయమేమంటే ప్రత్యక్షంగా నూటిగా పెట్టుబడిదారీ దోపిడీకి గురిఅయ్యేవాళ్ళుకూడా (వ్యవసాయకూలీలు వగైరా) ఫ్యూడల్ వర్గంచేసే దోపిడీపట్ల ఉపేక్షాభావం వహించరు; తమకేమీ పట్టనట్లు ఊరుకోరు. ఫ్యూడల్ వర్గ దోపిడికి వాళ్ళుకూడా ప్రత్యక్షంగానో, పరోక్షంగానో గురి అవుతూనే ఉంటారు. ఫ్యూడల్ వర్గదోపిడి వారినికూడా ఫ్యూడల్ బానిసత్వంయొక్క అనాగరిక దశలోనే అట్టేపెట్టి అభివృద్ధి చెందనివ్వదు. తక్కువ కూలి రేట్లతో వారు దోచుకోబడతారు.

ఉన్న కొద్దికాస్తా పోగొట్టుకున్న వ్యవసాయకూలీలు పాలుపద్ధతిపైనో, ధనరూపంగా లేక ధాన్యరూపంగా మక్తారేట్లు చెల్లించే కౌలుపద్ధతిపైనో తనకట్టి యితరహక్కులు లేని భూమిని సాగుజేస్తూ మళ్ళీ ఏదోవిధంగా ఫ్యూడల్ బానిసత్వానికే కట్టుబడి ఉండవలసి వస్తోంది. ఇందుకు కారణం మనదేశం పారిశ్రామికంగా వెనకబడి ఉండడంచేత పట్టణాల్లో మరోవృత్తి ఏదీ (వ్యవసాయకూలీకి) లభించకపోవడమే. భూమిపై గుత్తాధికారం కలిగిన భూస్వాముల దోపిడికి గురిఅయ్యే పేదరైతుల, మధ్యతరగతి రైతుల విషయంలో పైవిషయం యింకా ఎక్కువగాకూడ అన్వయిస్తుంది. ఒకవైపు మొత్తందేశంలో శ్రామికవర్గసంఖ్య పెంపొందుతున్నా, వివిధరకాలైన శ్రామిక, అర్ధశ్రామికశక్తులుగూడ ఉత్పన్నమౌతున్నాయి. వీరిలో (ఈశక్తుల్లో) కొందరు ఇప్పుడు కూలిపనివారు (లేజిలేబరర్) గానూ, మరికొందరు భూస్వాములక్రింద కౌలుదార్లగానూ బ్రతుకుతున్నారు. అందుచేత ఈ పైజెప్పిన విషయాలనుబట్టి భూస్వామి (జమీందారీ) వ్యతిరేకపోరాటం గ్రామ పేదలందరి సమిష్టిపోరాటంగానూ ముఖ్యమైన పోరాటంగానూ వుంటూంది.

మొత్తంమీద ఈ ఫ్యూడల్ చట్రంలోనే పెట్టుబడిదారీ సంబంధాలు అభివృద్ధి చెందాయనీ, అతిశీఘ్రంగా అభివృద్ధి చెందుతున్నాయనీ, మున్ముందు ఇంకా అత్యంత శీఘ్రంగా అభివృద్ధి చెందుతాయనీ దీని ప్రధానసారాంశం.

ఈ అభివృద్ధిని కొనసాగనివ్వకుండా ఇండియా మొత్తంమీద ఫ్యూడల్ సంబంధాలు అడ్డుపడుతూన్నాయనే విషయంగాని, దేశంలో విభిన్నప్రాంతాల్లో వ్యాపారవస్తువుల వుత్పత్తి పెట్టుబడిదారీ సంబంధాల అభివృద్ధి హెచ్చుతగ్గులతో కూడుకుని వున్నదనే విషయంగాని పై సత్యాన్ని త్రోసిపుచ్చలేవు. వ్యవసాయంలో పెట్టుబడి ప్రవేశించడంగానీ, పెట్టుబడిదారీ సంబంధాలు వృద్ధిగావడంగానీ, ఒకస్థాయిలో ఎన్నడూ జరగవు. వివిధ

ప్రాంతాల్లో వివిధరకాలుగా హెచ్చుతగ్గులతోకూడి అసమానంగా జరుగుతూ ఉంటుంది. ఈ అసమానత్వం ఉండడం సహజమే.

"వ్యవసాయంలో పెట్టుబడి ప్రవేశించడమనేది ఒక విచిత్రమైన పరిణామం అని గుర్తించుకోవాలి. మొత్తం రష్యాకు సంబంధించిన లెక్కలనే మనం దృష్టిలో పెట్టుకొని చూస్తే ఈ విషయాన్ని ఎప్పుడూ మనం సరిగా అర్థంచేసుకోలేము.

"వ్యవసాయంలో పెట్టుబడిదారీ సంబంధాలు హఠాత్తుగా వృద్ధిఅయ్యేవికావు ఒకే స్థాయిలో పెంపొందవు. అన్నిరకాల ఆర్థిక విధానాల్లోనూ ఒకేరకంగా వృద్ధిపొందవు. బహుక్లిష్టమైన ఆర్థికవిధానం ఒకచోట ఒక శాఖనూ మరోచోట మరోశాఖనూ పెంపొందించుకుంటూపోతూ ఉంటుంది. అభివృద్ధిలేని శాఖలు అసలు అంతర్ధానంకావు. వృద్ధి పొందుతూ ఉండే శాఖలకు, అంటే వ్యాపార సరుకుల నుత్పత్తిజేసే శాఖలకు అనుగుణ్యంగా కొనసాగింప బడతాయి. ఈ పరిణామం అంతా పెట్టుబడిదారీ మార్కెట్ అవసరాలను బట్టే జరుగుతూ ఉంటుంది."

(అగ్రేరియన్ క్వెశ్చన్ ఇన్ రష్యా, లెనిన్, సెలెక్టెడ్ వర్క్స్, యల్. డబ్ల్యు. ప్రచురణ. సంపుటి 1 పేజి 202)

దీని సారాంశమేమంటే పెట్టుబడిదారీ సంబంధాలు వృద్ధిచెందుతూఉన్నా, ఇంకా ఫ్యూడల్ విధానం నిర్జీవమైపోలేదు. ఫ్యూడల్ సంబంధాలకు వ్యతిరేకంగా సాగించే పోరాటాన్ని పల్లెప్రాంతాల్లో నూతనంగా అభివృద్ధి చెందుతూన్న పెట్టుబడిదారుల దోపిడికి వ్యతిరేకంగా సాగించే పోరాటంతో జోడించవలసి ఉంటుంది. పైజెప్పిన రెండువర్గాల్లో ఏదోఒక వర్గాన్నివదలి ఒక వర్గంతోనే పోరాటం సాగించ పూనుకోవడమంటే వర్గ సామరస్యానికి దారితీయడమే అవుతుంది. వ్యవసాయ విప్లవపోరాటాన్ని విచ్ఛిన్నం చేయడమే అవుతుంది. భూమికోసం సాగించే పోరాటంతో పై రెండువర్గాలకూ వ్యతిరేకంగా సాగించే పోరాటం నేరుగా సమ్మిళితమైపోయింది. భూస్వామ్య (జమీందారీ) విధానం ఉన్న ప్రదేశంలోగానీ, లేక రైత్వారీ ప్రదేశంలోగానీ నేడు భూమికోసం సాగించే పోరాటం భూమిపై గుత్తాధికారం కలిగిఉన్న భూస్వాములు, ధనికరైతులు యిద్దరికీకూడ వ్యతిరేకంగా సాగించవలసి రావడమే ఇందుకు కారణం. పాత, కొత్త గుత్తాధికారులకు భూమిపైఉన్న గుత్తాధికారాన్ని దెబ్బగొట్టకుండా భూమికోసం పరితపించిపోయే ప్రజల దాహాన్ని తీర్చలేము. భూస్వాములకూ, ధనిక రైతులకూ - ఈ ఉభయులకూ - వ్యతిరేకంగానే వ్యవసాయ విప్లవనినాదమైన "దున్నే వారికే భూమి" అనే నినాదం ఇవ్వబడుతూ ఉంది.

# 12

వ్యావసాయిక సమస్యపై బూర్జువావర్గం ఎట్టిపాలసీ నవలంబిస్తూవుంది? కాంగ్రెసు మంత్రివర్గాలు తయారుజేసే భూచట్టాల వెనక వున్న అంతరార్థ మేమిటి?

ఈ విషయాన్ని అర్థంచేసుకోడానికి ముందు బూర్జువావర్గం ఫ్యూడల్ విధానాన్ని బలపరచ తున్నదని గానీ, కాపాడగోరుతున్నదనిగానీ, తన ప్రయోజనాలను సాధించుకొని కాపాడుకొనేకొరకుగూడ, ఫ్యూడలిజాన్ని ఎదిరించదనీ అనుకునే వెర్రిభ్రమలను మాని వేయాలి. ఫ్యూడలిజంతో బూర్జువావర్గం రాజీపడుతుందని గానీ, ఫ్యూడలిజాన్ని బలపరుస్తుం

దని గానీ మనం చెప్పేమాటలకు మార్క్సిస్టు భాషలో ఒకేఒకే అర్థంవుంది అదేమిటంటే, సంపూర్ణమైన విప్లవ కార్యక్రమము లేక ఆచరణతో పోల్చినప్పుడు, బూర్జువావర్గ కార్యక్రమం రాజీధోరణిలో వుంది అని మాత్రమే. తన ప్రయోజనాలను సాధించుకోడానికి ఫ్యూడలిజాన్ని తన కనుకూలంగా సంస్కరించుకోడానికి బూర్జువావర్గం కృషిచేయదనీ, ఒత్తిడి పెట్టదనీ అనుకోడం పొరపాటు. పెట్టుబడిదారీ విధానం పతనమై పోతూన్న యీ దశలో అది ఫ్యూడల్ విధానాన్ని విప్లవ పద్ధతిపై రద్దుచేయలేదనీ, తన ప్రయోజనాలకనుగుణంగా వుండేంతవరకు మాత్రమే దాన్ని సంస్కరించడానికి ప్రయత్నిస్తుందనే మనం చెప్పేదానికిఅర్థం. ఆవిధంగా సంస్కరించడం వలన బూర్జువావర్గానికి మాత్రమే విముక్తి కల్గుతుంది. బూర్జువా సంబంధాలను పెంపొందించుకోడానికి మాత్రం తగినంత అవకాశం కలుగుతుంది. బూర్జువా చట్రంలోనే భూస్వాములనుకూడా ఇముడ్చుకొని వారిని పెట్టుబడిదారీ భూస్వాములుగా తయారు చేస్తుంది. అంతేకాని ప్రజాసామాన్యాన్ని నిజంగా విముక్తిచేయడం మాత్రం జరగదు. ప్రజలే స్వయంగా చొరవతీసుకోడం బూర్జువావర్గానికీ బొత్తుగా ఇష్టముండదు. ప్రతివర్గమూ తన వర్గప్రయోజనాలను కాపాడుకో జూస్తుంది. మరో వర్గం యొక్క ప్రయోజనాలను కాపాడడంకోసం తన స్వప్రయోజనాలనే బలియిచ్చే అంత వుదారంగా ఏవర్గమూ వుండదు. వలసదేశపు స్వభావాన్ని మెకానికల్‌గా అర్థంచేసుకోవడంవల్ల పార్టీ సభ్యుల్లో యీ క్రిందివిధమైన తప్పు భావాలు ఏర్పడ్డాయి. మనదేశం వలస స్వభావాన్ని కలిగి వున్నందున, పరిశ్రమలు అభివృద్ధి కానందున బూర్జువావర్గాన్నీ, ఫ్యూడల్ శక్తులనూ, జతపర్చి, వాటి మధ్య వున్న స్పర్థలులేవని చెప్పడం జరుగుతోంది. వాటిమధ్య వర్గకలయిక ఏర్పడిందంటే (రాజకీయ) వాటి రెంటియొక్క ఆర్థిక ప్రయోజనాలు కూడా సంపూర్ణగా ఏకీభవిస్తున్నాయని అర్థం తీయబడుతోంది.

"సోషల్ డెమాక్రసీ యొక్క వ్యవసాయ కార్యక్రమం" అనే వ్యాసంలో లెనిన్ ఈక్రింది విధంగా చెప్పాడు :

"బానిసత్వావశేషాలను తొలగించడానికి రెండు పంథాలున్నాయి. సంస్కరణద్వారా ఫ్యూడల్ ఎస్టేట్లను పెద్ద పెద్ద భూస్వామి ఖండాలుగా మార్చివేయడం ఒకపంథా. విప్లవంద్వారా అసలు భూస్వామ్యవిధానాన్నే (జమీందారీ విధానాన్ని) రద్దుచేసివేయడం రెండోపంథా. పెద్ద పెద్ద భూస్వాములను నిలిపిఉంచడంద్వారా కూడా పెట్టుబడిదారీ అభివృద్ధికొనసాగుతూనే ఉంటుంది. క్రమక్రమంగా ఫ్యూడల్ వ్యవసాయ పద్ధతులకు బదులు పెట్టుబడిదారీ వ్యవసాయ పద్ధతులు అనుసరించబడుతూ భూస్వామిక వ్యవసాయ విధానమే పెట్టుబడిదారీ వ్యవసాయంగాపరిణామంపొందవచ్చును. సంఘవ్యవస్థలో ఒక 'వ్రణం'గా వున్న భూస్వామిక విధానాన్నే విప్లవ పంథాను రద్దుజేయడంద్వారా చిన్న రైతు వ్యవసాయోత్పత్తివిధానాన్ని అమల్లోకితెచ్చి పెట్టుబడిదారీ అభివృద్ధినికొనసాగించవచ్చును.

......బూర్జువా అభివృద్ధికి జరగడానికి ఈ రెండు పంథాలూ సాధ్యమే. ఈ రెండు పంథాలనూ ఒకటి ప్రష్యన్‌పంథాగా, మరొకటి అమెరికన్‌పంథాగా పేర్కొనవచ్చును. మొదటిపంథా నవలంబించడమంటే ఫ్యూడల్ భూస్వామ్యమే క్రమక్రమంగా బూర్జువా భూస్వామ్యంగా-'జంకర్' భూస్వామ్యంగా-మారడమన్నమాట. దీనిఫలితంగా రైతాంగం దశాబ్దాల పర్యంతం అతి దారుణమైన దోపిడీకీ, దారిద్ర్యానికీ, బానిసత్వానికీ గురికావ

లని వస్తుంది. కాని కొద్దిమంది పెద్ద రైతులకుమాత్రం ఇది లాభదాయకంగానే వుంటుంది. ఇక రెండవ పంథానవలంబించడమంటే భూస్వామ్య విధానమే లేకుండా పోతుంది; విప్లవంద్వారా భూస్వామ్య విధానం భగ్నంచేయబడుతుంది. దీనిఫలితంగా ఫ్యూడల్ భూఖండాలను స్వాధీనపరుచుకొని వాటిని చిన్న చిన్న ఖండ్రికలుగా రైతులకు పునర్విభజించడం జరుగుతుంది. మొదటిపంథా ప్రత్యేకపరిణామ మేమంటే ఫ్యూడల్ విధానం మార్చబడి, దానిస్థానే 'జంకరు' భూస్వాములు తమ భూఖండాలపైన కొనసాగించే పెట్టుబడిదారీ, వడ్డీవ్యాపార దోపిడీలు అమల్లోకి వస్తాయి. రెండోపంథావల్ల (భూస్వామిక విధానం అంతరించి) పితృస్వామిక యుగంనాటి రైతును బూర్జువాయుగపు రైతుగా తయారు చేయడం ప్రధానంగా జరుగుతుంది."

(లెనిన్ : సెలెక్టెడ్ వర్క్స్, యమ్. యల్. సంపుటి 3, పేజి 180—181)

అదే గ్రంథంలో లెనిన్ ఇంకా ఇలా వ్రాశాడు:

"మార్క్స్ వ్రాసిన 'కేపిటల్' 3వ సంపుటిలో చెప్పబడినట్లు పెట్టుబడిదారీ ఉత్పత్తి శైశవావస్థలో ఉన్నప్పుడు అమల్లో ఉన్న పాతకాలపు భూస్వామ్యపద్ధతి, బూర్జువా అభివృద్ధికీ, అవసరాలకు తగినట్లుండదు. ఫ్యూడల్, చిన్న రైతుల 'కమ్యూన్', ముఠాపద్ధతి, (క్లాన్) వగైరాల్లోని ఆర్థికవిధానాలకు సంబంధించిన భూస్వామ్యపద్ధతులనుండి పెట్టుబడిదారీ విధానం తన అవసరాల కనుగుణ్యమైన విధానాన్ని సృష్టించుకుంటుంది. అదే అధ్యాయంలో మార్క్స్ పెట్టుబడిదారీ విధానం పాత భూస్వామ్య పద్ధతులనుండి తన కనుకూలమైన భూస్వామ్యపద్ధతిని ఏర్పరచుకొనే వివిధ మార్గాలను గూర్చి ఒకదానితో ఒకటి పోల్చి చెప్పాడు. జర్మనీలో మధ్యయుగానికి సంబంధించిన భూస్వామ్యపరిణామము సంస్కరణ పంథాలో జరిగింది. అంటే గతానుగతికంగా సాంప్రదాయ సిద్ధంగా క్రమ క్రమంగా ఫ్యూడల్ సంస్థానాలు జంకర్ సంస్థానాలుగా మారాయి......కాని అమెరికాలో బానిస యజమానుల కాటపట్టయిన దక్షిణరాష్ట్రాల విషయంలో – ఈ మార్పు చాలా తీవ్ర పంథాలో జరిగింది.

(పై గ్రంథం. 216 వ పేజి)

పై విషయాన్ని దృష్టిలో వుంచుకొని చూస్తే, తమ వర్గప్రయోజనాలు, మొత్తం తమ వర్గవ్యవస్థ మంచుకు పోయేందుకు సరిపడ మార్పులనుమాత్రమే ఫ్యూడల్ వ్యవస్థలో పెట్టుబడి దారులు చేయ ప్రయత్నిస్తారు. ఫ్యూడల్ సంస్థానాధీశుల విషయంలో బూర్జువావర్గం ఖచ్చితంగా యెట్టివైఖరి నవలంబించ గోరుతుంది? ఫ్యూడల్ వర్గంతో బూర్జువావర్గం రాజీ పడుతోంది అనడంలోగానీ, మొత్తం ఫ్యూడల్ వర్గాన్ని నిర్మూలించడానికి ప్రయత్నించదనడంలో గానీ ఎట్టి సందేహం లేదు. అయితే ఆ రాజీయొక్క ప్రత్యేక స్వరూపం ఎలా వుంటుంది? ఫ్యూడల్ భూస్వాములపై ఎలాంటి ఒత్తిడి తెస్తుంది? తన అవసరాల కనుగుణంగా ఫ్యూడల్ విధానాన్ని మార్చుకోడానికి ఎట్టి ప్రయత్నాలు చేస్తుంది? సంస్థానాల్లో ఎన్నికలపద్ధతిని సాధించడం, సైన్యాన్ని కేంద్రప్రభుత్వ అధీనంలో వుంచడం, ప్రజల్లో తనకున్న పలుకుబడిని వుపయోగించుకొని తన ప్రయోజనాలను పెంపొందించుకోవడం, రిపబ్లిక్‌కు అనుకూలంగా సంస్థానాధిపతులను మార్చుకొని రిపబ్లిక్‌లో తన ఆధిక్యతను సురక్షితంగా వుంచుకోడం,—ఇదీ బూర్జువావర్గం అవలంబించుతూన్న విధానం. ఫ్యూడల్ - బూర్జువా మైత్రిఫలితంగా సంస్థానాల వ్యవహారాల్లో బూర్జువావర్గం మాటే చలామణిగా

అయ్యేటట్లు చేసుకుంది. అయితే యిందువల్ల ప్రజలకుమాత్రం ఒరిగిందేమీలేదు. ఫ్యూడల్ స్వరూపం రద్దుగాకపోగా ప్రజలకు రెండు రకాల దోపిడీమాత్రం ప్రాప్తించింది.

## 13

భూస్వాముల (జమీందార్ల)పట్ల బూర్జువావర్గం ఎట్టివైఖరి నవలంబిస్తుంది? వ్యావసాయిక సంబంధాలలో ఏర్పడ్డ సంక్షోభాన్ని నేడు బూర్జువావర్గం ఎలా పరిగణిస్తోంది? అధికారంలో ఉన్న బూర్జువావర్గం ఈ సంక్షోభాన్ని మొట్టమొదట ఆహార కొరతగానూ అందువల్ల ఏర్పడ్డ సంక్షోభంగాను మాత్రమే భావిస్తోంది. విదేశాలనుంచి ఆహారపదార్థాలను దిగుమతి చేసుకోడానికి తన అమూల్యమైన విదేశీ ధనాన్ని (ఎక్స్ఛేంజ్) పూర్తిగా ఖర్చుబెట్టి వేస్తోంది. ఇందువల్ల తన కవసరమైన పరిశ్రమల యంత్రసామగ్రి వగైరా ఉత్పత్తి పరికరాలను విదేశాలనుంచి దిగుమతి చేసుకోవడం బూర్జువావర్గానికి కష్టతరమై పోతూవుంది. (2) ఆహారకొరత, అధికధరలు వగైరాలు ప్రమాదపరిస్థితికి దారితీస్తున్నాయి- ఆకలితో అలమటించిపోయే అసంఖ్యాక ప్రజానీకాన్ని ఎదుర్కోవలసి రావడంవల్ల అసలు బూర్జువా ప్రభుత్వమే ప్రమాదస్థితికి గురికావాలసి వస్తోంది. (3) చుక్కలకంటే ధరలూ దోపిడీ కౌలురేట్లూ, భూస్వాముల దోపిడీ, వ్యావసాయికోత్పత్తిని విచ్ఛిన్నంచేసి వేస్తున్నాయి. వీటిఫలితంగా వ్యవసాయోత్పత్తిలో నైపుణ్యంపడిపోయి, నానాటికి తీసికట్టుగా తయారు అవుతూంది. ప్రజలను రోజురోజుకూ నిరుపేదలుగా చేయడంచేత భావి పారిశ్రామిక వస్తువులకు మార్కెట్టు చాలా పరిమితమైపోతుంది. (4) ధరలు విపరీతంగా పెరిగిపోయిన ఫలితంగా పారిశ్రామిక కార్మికుల కూలీరేట్లు హెచ్చి ఉత్పత్తి ఖర్చులు అధికమౌతున్నాయి. కార్మికుల జీతాలు కోతగోయడం కష్టతరమైపోతోంది. (5) నిరుపేదలై పోతున్న పేదరైతాంగం గావించే వ్యవసాయోత్పత్తి నానాటికి పడిపోతోంది. అందువల్ల పెట్టుబడి బాగా కూడబెట్టిన ధనిక రైతులవైపు బూర్జువావర్గం ఆశాదృక్కుల ప్రసరింపచేస్తుంది. ధనిక రైతులద్వారా అధికోత్పత్తి సాగించాలని ఆశిస్తోంది. ఇందుకు ధనిక రైతుకు కావలసిన యంత్రపరికరాలనుకూడా సప్లయి చేయచూస్తోంది. (6) వ్యవసాయంలో పెట్టుబడి త్వరితంగా చొచ్చుకుపోడానికీ, వ్యవసాయాన్ని తన హస్తగతం చేసుకోడానికీ భూస్వాములకు (జమిందార్లకు) నేడున్న అధికారాలే ఆటంకంగా ఉన్నాయని బూర్జువావర్గం గుర్తిస్తోంది.

బూర్జువావర్గం తన అవసరాల కనుగుణంగా ఫ్యూడలిజాన్ని ఏవిధంగా మార్చుకుంటూ ఉందో ఈ క్రిందివిషయాలనుబట్టి తేలుతూ ఉంది. బూర్జువా మంత్రివర్గాలు చేసే భూస్వామ్య చట్టాలే బూర్జువావర్గంయొక్క లక్ష్యాన్ని విస్పష్టం చేస్తున్నాయి. పెట్టుబడిదారీ పద్ధతిలో వ్యాపార సరకుల నుత్పత్తి చేసేందుకు ధనికరైతుకు పూర్తి అవకాశాన్ని ఇవ్వడానికీ, వ్యవసాయంలో పెట్టుబడి చొచ్చుకుపోకుండా ఆటంకం కలిగిస్తున్న భూస్వాముల ఆస్తిహక్కుల్ని పరిమితం చేయడానికీ, వ్యవసాయంలో భూస్వాముల జోక్యాన్ని అరికట్టడానికీ ఆచట్టాలు ఉద్దేశించబడ్డాయి. నష్టపరిహారం అనే పేరుతో కోట్లకోలది రూపాయలను చెల్లించి జమీందారీలు కొనివేయబడుతున్నాయి. అయితే ఈ జమీందారుల భూములకు ఇంకా సరియైనధర పూర్తిగా ముట్టజెప్పడంలేదని బూర్జువావర్గం వాదించవచ్చును. కాని కోట్ల

కొలది రూపాయలను నష్టపరిహారమనే పేరుతో చెల్లించడాన్ని మాత్రం కాదనలేరు. రైతాంగాన్ని అణగారుస్తున్న జమిందారీ వగైరా ఫ్యూడల్ భూస్వాములకు చెల్లించే శిస్తు (ఫ్యూడల్ రెంటు) రద్దుచేయబడలేదు. అది 'జాతీయం' చేయబడ్డది. అంటే పెట్టుబడిదారీ పద్ధతిపై పారిశ్రామిక, వ్యవసాయికాభివృద్ధిని కొనసాగించేందుకు, తన వర్గప్రయోజనాలను సాధించుకోడానికి అత్యధికమైన జమిందారీ శిస్తువసూళ్ళను బూర్జువా ప్రభుత్వం తన స్వార్థలాభంకోసం ఇంకా అట్టిపెట్టుకోవాలని ప్రయత్నిస్తోంది. కష్టజీవులైన రైతులకు జమీందారుకు చెల్లిస్తున్న యీ శిస్తుల నుండి విముక్తి లభించకపోగా పైపెచ్చు నష్టపరిహారభారాన్నికూడా మోయవలసివస్తోంది. ఈపద్ధతినుంచి బూర్జువావర్గమూ, ధనికరైతులు లాభం పొందుతారు. కాని యావత్ ప్రజానీకం నష్టపడవలసి వస్తోంది.

ఈ జమీందారీ చట్టాలను ఇంతటితో ఆపుచేసినా, లేక ప్యాసుచేసినా, బూర్జువావర్గం మాత్రం తన మార్గాన్ని నిష్కంటకం చేసుకోడానికి ప్రయత్నిస్తుంది. ఏదో ఒక పద్ధతి ద్వారా - "టెనెన్సీయాక్టు"ను సవరించడంద్వారాగానీ, జమీందారులకు వ్యతిరేకంగా కోర్టులద్వారా లేక చట్టరీత్యా ఒత్తిడి తేవడంద్వారాగానీ, ప్రభుత్వం నిర్ణయించిన ఫలానా ఫలానా కౌలుదార్లు సరసమైన ధరలు చెల్లించి భూములు కొనుక్కొనేందుకు చట్టంలోనే ఏదో ఒక అవకాశాన్ని కల్పించడంద్వారాగానీ, లేక నిర్ణీతధరకు జమీందారులు భూమిని అమ్మితీరాలని ఒక కొత్త నిబంధనచేర్చడంద్వారాగానీ, ఇలాంటి మరోపద్ధతిద్వారాగానీ-బూర్జువావర్గం తన వ్యవసాయిక కార్యక్రమాన్ని ఆచరణలో బెట్టుటకు అవసరమైన చర్యలు తీసుకుంటుంది. ఇలాంటిచర్యలు అమలుజరగడమంటే రైతాంగాన్ని ఇంకా విరివిగా దోచుకోడమే - అగ్నిలో ఆజ్యం పోయడమే - అగ్గిపుల్లగీసి మందుగనిలో పెట్టడమే - అవుతుంది.

జారు ప్రభుత్వంలో మంత్రిగా వున్న "స్టాలెపిన్" అవలంబించిన కార్యక్రమానికీ, ఈ బూర్జువావర్గ కార్యక్రమానికీ ఎంత చక్కటి పోలిక ఉందో చూడండి:

"ఫ్యూడల్ భూస్వాములకు చెందిన పెద్ద పెద్ద భూఖండాలను క్రమంగా జంకర్ - బూర్జువా ఎస్టేట్సుగా మార్చడంద్వారానూ, తత్ఫలితంగా రైతు జనసామాన్యాన్ని పొలం లేని రైతులుగా మార్చివేయడంవల్లనూ, ప్రజా సామాన్యాన్ని కటికదారిద్ర్యానికి గురిచేసి ఆదేస్థితిలో వారిని అట్టిపెట్టడంవల్లనూ, కొద్దిమంది ధనిక బూర్జువారైతులను సృష్టించి అభివృద్ధిచేయడంవలననూ (పెట్టుబడిదారీ విధానంలో రైతాంగంనుంచి కొద్దిమందిమాత్రం తప్పకుండా ధనిక బూర్జువారైతులుగా తయారవుతారు.) - యీ పంథావలననుగూడ- బానిసత్వాన్ని (సెర్ఫడం) రద్దుజేయు వచ్చును. రష్యాలోని 'బ్లాక్ హండ్రెడ్స్' అనే అభివృద్ధి నిరోధక ఫ్యూడల్ వర్గాలు, ఆవర్గానికి ప్రతినిధి అయిన స్టాలెపిన్ మంత్రి ఈ పంథానే అనుసరించారు. ఎప్పుడో తుప్పుబట్టిపోయిన మధ్యయుగపు భూస్వామిక పద్ధతులను బలవంతంగానైన బద్దలుగొట్టకుండా రష్యా అభివృద్ధిమార్గాన్ని నిష్కంటకంచేయడం అసాధ్యమని వారు గుర్తించారు. భూస్వాముల నిలబెట్టడంకోసం అభివృద్ధినిరోధక పద్ధతులద్వారా ధైర్యోపేతంగా మధ్యయుగపునాటి భూస్వామ్య సంబంధాలను బద్దలుగొట్టారు. ఇందువల్ల అర్థఫ్యూడల్ విధానాన్ని అట్టిపెట్టికునేందుకు ఇటీవలదాకా భూస్వాముల్లో, నిరంకుశవర్గాల్లో తమపట్లఉన్న సానుభూతిని వారు కోల్పోయారు. గ్రామకమ్యూన్లను బలప్రయోగంతో అణచివేసేందుకు వారు 'చట్టబద్ధ' పద్ధతులన్నిటినీ త్రోసిపుచ్చారు. పాతకాలపు భూస్వామ్యవిధానాన్ని బద్దలు గొట్ట

డానికీ, వేలకొలది సామాన్యరైతులను సర్వనాశనం చేసివేయడానికీ, రైతు ప్రజాసామాన్యాన్ని తమ ఇష్టం వచ్చినట్లు స్వేచ్ఛగా దోపిడిచేయడానికీ ధనికరైతులకు (కులక్కులకు) సర్వస్వాతంత్ర్యం ఇచ్చివేశారు. ఇనుపపెట్టెల్లో డబ్బు నిలవజేసుకున్న ధనికరైతులకు స్వేచ్ఛగా కొల్లగొట్టడానికీ, దోపిడి చేయడానికీ మధ్యయుగపు గ్రామాలు అర్పించబడ్డాయి. తమ వర్గాధికారాన్ని నిలబెట్టుకోవాలంటే వాళ్ళ కింతకన్నా గత్యంతరం లేదు. అంతకంటె వారు మరో విధంగా ప్రవర్తిస్తారని మనం ఆశించజాలం. పెట్టుబడిదారీ అభివృద్ధికి అనుగుణంగా తాము మారవలసిన ఆవశ్యకతను వాళ్ళు గుర్తించారు. పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా పోరాడడం తమకుకూడా మంచిదికాదని ఆ భూస్వాములు గ్రహించారు. రైతు జనసామాన్యానికి వ్యతిరేకంగా తమ అధికారాన్ని స్థిరంగా నిలబెట్టుకోడానికి "రజువయేవ్"లూ "కొలుపయేవ్"లూ వగైరాల (కులక్కులు) కంటె తమకు ఎక్కువ సన్నిహిత మిత్రులెవరూ లేరని వారు తెలుసుకున్నారు. 'కొలుపయేవ్' లాంటి కులక్కులు ఇంకా ఎక్కువగా ధనవంతులు కావాలి, అనే నినాదం ఇవ్వడంతప్ప వారికి మరో గత్యంతరంలేదు. 'ఈ నూతనపరిస్థితుల్లో మా అధికారాని కెట్టి ప్రమాదం వాటిల్లకుండా మాకు మీరు తోడ్పడినట్లయితే మీరు పెట్టుబడిపెట్టే ప్రతి ఒక 'రుబులు'కూ వంద 'రుబుల్సు' లాభం వచ్చే అవకాశాలను మేము మీకు కల్పిస్తాము' ఇదే ఆనాడు ధనికరైతులకూ భూస్వాములకూ వాళ్ళుఇచ్చిన సలహా. ఇలాంటి పంథాపై అభివృద్ధి జగగడమంటే, ఈపంథాపై సఫలీకృతంగా ముందుకు సాగిపోవడమంటే, అసంఖ్యాక రైతాంగాన్నీ, శ్రామిక వర్గాన్నీ నిరంకుశంగా ఒక ప్లానుప్రకారం పూర్తిగా అణచివేయడమే అవుతుంది.

—(అగ్రేరియన్ ప్రోగ్రాం ఆఫ్ సోషల్ డెమోక్రసీ, లెనిన్ సెలెక్టెడ్ వర్క్సు, యమ్. ఎల్. ప్రచురణ, 3 వ సంపుటి 279 వ పేజి)

భూస్వామ్య మంత్రివర్గం ఈ విధంగా భూస్వామ్య విధానాన్ని పెట్టుబడిదారీ అభివృద్ధికి అనుగుణంగా మారుస్తుంది.

ఈ పైజెప్పిన విషయాన్ని దృష్టిలో ఉంచుకొని నేటి జమీందారీ (భూస్వామ్య) చట్టాల్ని పరిశీలించి మనం వాటిగుట్టును బట్టబయలు చేయవలసి ఉంటుంది. ఈ చట్టాలవల్ల వచ్చే మార్పేమీ ఉండదని ఊరికే సూత్రాలు వల్లిస్తూ ఆ చట్టాలఎడల వట్టి వ్యతిరేక దృక్పథం అవలంబించి నంతమాత్రాన ఎట్టిప్రయోజనం లేకపోగా, ప్రజలపై బూర్జువావర్గం కొత్తగా సాగించబోయే తీవ్రమైన దాడిని మరుగుపరచడానికే తోడ్పడుతుంది. కాబట్టి ఈచట్టాలవల్ల కలిగే అనర్థాన్ని ఎప్పటికప్పుడు తెలియజేస్తూ ప్రజల్లో తీవ్రమైన ప్రచారం సాగించవలసి ఉంటుంది. ఈ చట్టాలవల్ల భూస్వామ్య విధానం రద్దుచేయబడదని ఊరికే చెప్పినంత మాత్రాన సరిపోదు. ప్రజలను దోపిడిచేయడంలో కొత్తగా ప్రోత్సహింపబడుతూన్న నూతన పెట్టుబడిదారీవర్గంయొక్క నిజస్వరూపాన్నికూడా పూర్తిగా బట్టబయలు చేయవలసి ఉంటుంది.

# 14

పైన చెప్పిన విషయాన్నిబట్టి మన రైతాంగ నినాదాలనుకూడా కొంతవరకు సవరించవలసి ఉంటుంది — ముఖ్యమైన మన రైతాంగ నినాదాల్లో 'భూమిని జాతీయం చేయాలి' అనే మరో ప్రధాన నినాదంకూడా చేర్చవలసి ఉంటుంది.

వలసదేశాల కమ్యూనిస్టుపార్టీల కార్యక్రమంలో 'భూమిని జాతీయంచేయడం' అనే నినాదాన్నికూడా అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీ చేర్చింది. కాని మన కార్యక్రమంలో ఆ నినాదాన్ని చేర్చకపోవడం యాదృచ్ఛికంగా జరిగిన ఒక సంఘటన కాదు. ఇంతకుపూర్వం పేర్కొనబడిన, ధనిక, మధ్యతరగతి రైతుల పట్ల మన మవలంబించిన అవకాశవాద ధోరణియే ఇందుకు కారణం. మధ్యతరగతి రైతుపై ప్రధానంగా ఆధారపడి ధనికరైతుకే మాత్రం కష్టం కలిగించని ఉద్యమం 'భూమిని జాతీయంచేయాలి' అనే నినాదాన్ని ముందుకు గొంపోవడానికి ఎప్పుడూ జంకుతూనే ఉంటుందనడంలో ఎట్టి ఆశ్చర్యంలేదు. మన అనుచరవర్గంలో ఆస్తిపరులుగా ఉన్నవారికి ఎక్కడకష్టంపెస్తుందో అని భయపడడం జరిగింది. కాబట్టి ప్రధాన నినాదాల్లో జమీందారీ విధానం రద్దుచేయాలి—' 'దున్నేవారికే భూమిహక్కు' వుండాలి అనే వాటిని మాత్రమే మనం తీసుకోవడం జరిగింది. ఇప్పుడు మనం జమీందారీ విధానం రద్దుగావాలి' అనే నినాదానికితోడుగా దున్నేవారికే భూమిహక్కు' అనేదాన్నికూడా కలిపామంటే జమిందారీ విధానాన్ని రద్దుచేసినంత మాత్రానే ఆ కష్టజీవులకు లాభించదనీ, దాని లాభాలను — ఫలితాలను — నూతన దోపిడివర్గం (ధనికరైతులు) మాత్రమే అనుభవిస్తుందని గుర్తించడమన్నమాట.

'భూమిని జాతీయంచేయాలి' అనే నినాదాన్ని ఇవ్వడం, భూమిని జాతీయం చేయవలసిన అవసరాన్ని గుర్తించడం అంటే బూర్జువా ప్రజాతంత్ర విప్లవాన్ని ఏకదీక్షతో ముందుకు తీసికు పోవడమన్నమాట. భూమిని జాతీయంచేయడాన్ని, వ్యవసాయాన్ని సంఘపరంజేసి పెద్దయెత్తున సోషలిస్టుపద్ధతులపై నిర్వహించడమేనని అపార్థం జేసుకొని సమస్యను గందరగోళం చేయరాదు. జాతీయం చేయడం అనే కార్యక్రమంలో భూమి మాత్రమే జాతీయం చేయబడుతుంది. సోషలిస్టు పద్ధతులపై వ్యవసాయాన్ని కొనసాగించేందుకు భౌతికపువాది (పరిస్థితి) సిద్ధంగా లేనంతవరకూ, వ్యక్తిగత చిన్నవస్తూత్పత్తి పెట్టుబడిదారీ పంథాలోనే వ్యవసాయంలో ఇంకా కొనసాగుతూ ఉంటుంది. ఫ్యూడల్ ఎస్టేట్లను బద్దలుగొట్టడం ద్వారా మస్తారేటు (రెంటు)ను జాతీయం జేయడం ద్వారా, భూమిని జాతీయంచేయడంద్వారా ఫ్యూడల్ అడ్డంకులన్నీ తొలగించబడి వ్యవసాయంలో పెట్టుబడిదారీ విధానం అభివృద్ధిచెందుతుందని లెనిన్ తన ప్రారంభ రచనల్లో మరీ మరీ గట్టిగా నొక్కిచెప్పాడు.

నేడు ప్రజాస్వామిక ప్రజాతంత్ర విప్లవం అతి త్వరితంగా సోషలిస్టు విప్లవంలోకి మారుతూంది. భూమిని జాతీయం చేయడంద్వారా ప్రజాస్వామిక ప్రజాతంత్ర ప్రభుత్వానికి ఒక మంచి ఆయుధం లభిస్తుంది. దీనితో ఫ్యూడల్ ఆస్తిని సంపూర్ణంగా రద్దుచేయగలం. అంతే గాకుండా పల్లెప్రాంతాలలోని పెట్టుబడిదారీ శక్తులకు వ్యతిరేకంగా సాగించేపోరాటాన్ని యింకా ముందుకు తీసుకొనిపోడానికి కూడా ప్రభుత్వం చేతుల్లో ఒక విప్లవ ఆయుధంగా ఉపయోగపడుతుంది. ఈ పెట్టుబడిదారీ శక్తులు, పెట్టుబడిదారీ వస్తూత్పత్తి సాగుతున్నంతవరకు పల్లెప్రాంతాల్లో ఎప్పుడూ తల

ఎత్తుతూనే వుంటాయి. ఈ శక్తులను - పెట్టుబడిదారులను - అరికట్టకపోతే వీరు వెంటనే భూమినంతా మరల తమ గుత్తాధికారం క్రిందకు తీసుకుంటారు - వ్యక్తిగత ఆస్తి అంటే పెట్టుబడిదారీ ఆస్తిని నెలకొల్పుతారు. కాబట్టి భూమిని జాతీయంచేయడం అనేది ప్రజాస్వామిక ప్రజాతంత్ర విప్లవాన్ని ఇంకా ముందుకు - తదనంతర దశకు - శ్రామికవర్గ సోషలిస్టు విప్లవదశకు - కొనిపోవుటకు ఒక ఆయుధంగా వుపయోగిస్తుంది. ఈ ఆయుధాన్ని పల్లెప్రాంతాలలోని పెట్టుబడిదారీ శక్తులను అణచివేయడానికి, - సోషలిస్టు అంతిమవిజయంద్వారా చివరకు - ఆ శక్తులు నిశ్శేషంగా తుడిచిపెట్ట బడేవరకూ - ఉపయోగించ వలసే వుంటుంది. 'భూమిని జాతీయం చేయడం' అనేది పరివర్తనదశకు చెందిన నినాదం. దీనిద్వారా ప్రజాస్వామిక ప్రజాతంత్ర విప్లవదశకూ, తదనంతర సోషలిస్టు విప్లవదశకూ సంబంధం ఏర్పడుతుంది. పెట్టుబడిదారీ శక్తులపై దెబ్బకొట్టడానికి శ్రామిక వర్గానికి యిది తగిన సమర్థత నిస్తుంది.

పల్లెప్రజల్లో వ్యాపించిన భూదాహాన్ని, (ల్యాండ్ హంగర్) దున్నే వారికే భూమి అనే నినాదాన్ని - వాంఛితాన్ని - భూమిపై గుత్తాధికారం గల భూస్వాములకూ, ధనిక రైతులకూ వ్యతిరేకంగా మరలించ వలసి ఉంటుంది. ఈ రెండు వర్గాలగుత్తాధికారానికీ - ఫ్యూడల్ వర్గంయొక్క, బూర్జువావర్గంయొక్క వ్యక్తిగత ఆస్తికి - వ్యతిరేకంగా 'భూమిని జాతీయం చేయడం' అనే నినాదాన్ని ఉపయోగించవలసి ఉంటుంది. కాబట్టి రెండు విప్లవదశలయొక్క కర్తవ్యాలూ ఒకదానితో మరొకటి కలసిపోతున్నాయి. భూమిని జాతీయం చేసినంతమాత్రానే పెట్టుబడిదారీ సంబంధాలూ, వ్యక్తిగత వస్తూత్పత్తి, వ్యాపారవస్తూత్పత్తీ రద్దుచేయబడవు; చేయబడజాలవు. అయితే ప్రజాప్రభుత్వం వాటిని తన స్వాధీనంలోకి తెచ్చుకోడానికి, చివరకు వాటిని పూర్తిగా తుడిచిపెట్టివేయడానికీ ఇది-భూమిని జాతీయం చేయడం - తోడ్పడుతుంది, భూస్వామ్య (జమీందారీ) ప్రదేశాలకూ, రైత్వారీప్రదేశాలకూ, రెంటికీ ఇది సమానంగా ఉపయోగించే నినాదం; కాని మనం ఈనినాదాన్ని ఇంతకాలంనుంచీ చేపట్టలేదు. 'భూస్వామి' అనేశబ్దంయొక్క అర్థాన్ని వడ్డివ్యాపారంచేసే 'భూస్వామి'వరకూ వ్యాపింపజేసి - సమన్వయించి - ఇన్నాళ్లనుంచీ ఏదో విధంగా ఆత్మసంతృప్తి పొందుతున్నాం; నిజానికి రైత్వారీ ప్రదేశాల్లో విప్లవమార్పును గొనివచ్చేందు కుపకరించే నినాదమేదీ ఇన్నాళ్ళనుండి మనం యివ్వలేదు.

ఇది ప్రజలందరిని సమీకరించే నినాదమేనా? పల్లెప్రాంతాల ప్రజానీకంలో ఇది ఒక నూతన స్ఫూర్తిని రేకెత్తించే నినాదమేనా? అవును. ఇది ప్రజల్లో ఒక నూతన స్ఫూర్తిని రేకెత్తిస్తుంది; ఒక నూతన చైతన్యాన్ని కలిగిస్తుంది. ఎందువల్ల? పల్లెప్రాంతాల ప్రజానీకంలో మనం ప్రధానంగా శ్రామిక, అర్థశ్రామికశక్తులపై - వ్యవసాయకార్మికులూ, పేదరైతులపై - ఆధారపడవలసి వస్తుంది. వ్యక్తిగత ఆస్తిపద్ధతి ఫలితంగా వ్యవసాయ కార్మికులూ, పేదరైతులూ రోజురోజుకూ తమకున్న కొంచెంకాస్తీ కోల్పోతున్నారు. మధ్యతరగతి రైతు విషయంకూడా ఇంతే జరుగుతూఉంది. అయినప్పటికీ చిన్న ఆస్తిపరునకు సహజంగా ఉండే కొన్ని భ్రమలను పట్టుకొని అతనింకా అదేవిధంగా ఊగిసలాడుతున్నాడు. తనకున్న కొద్దికొంచెమే ఆధారంగా చేసుకొని మంచి ప్రపంచంకోసం కలలు గంటున్నాడు. ఆకాశంలో మేడలు కడుతున్నాడు.

భూమిని జాతీయంచేయడం సరియైన పద్ధతిపై జరగకపోతే, దానియొక్క ఫ్యూడల్ వ్యతిరేక, ధనికరైతు వ్యతిరేక, వడ్డీవ్యాపారి వ్యతిరేక స్వభావాన్ని సరిగా ప్రచారం చేయక పోతే, ఆ ప్రచారంకూడా ప్రజల ప్రత్యక్షానుభవాన్నే ఆధారంగా తీసుకొని జరపబడక పోతే భూమిని జాతీయంచేసే కార్యక్రమానికి అన్నివర్గాలూ, ముఖ్యంగా మధ్యతరగతి రైతు వర్గం భయపడి పోతుంది.

ప్రస్తుతం వున్న ఆస్తిసంబంధాల ఫలితంగా తమకున్న కాస్త చారెడు ముక్కా ఎగిరిపోవడం ప్రజలు కండ్లారా చూస్తున్నారు. మనం భూస్వామివర్గాన్ని మొత్తంగా విమర్శించాం. కాని ప్రజలు సరియైననిర్ణయాలు తీసుకోడానికి ఆ విమర్శ ఏమీ ఉపయోగించ లేదు. వ్యక్తిగత ఆస్తి-అదిఫ్యూడల్ ఆస్తిగానీ, బూర్జువా ఆస్తిగానీ, భూస్వామి ఆస్తిగానీ, లేక చిన్నరైతు ఆస్తిగానీ, అది ఏదైనా సరే - రైతుకున్న ఆస్తిని కాస్తా హరించి వేస్తుందనీ, వ్యక్తిగత ఆస్తి అంటే దోపిడి వర్గాల ఆస్తి మాత్రమే అనీ ప్రజల జీవితానుభవమే రుజువుచేస్తోంది. ఫ్యూడల్ ఆస్తి రద్దు చేయబడాలని మాత్రమే మనం యింతవరకూ ప్రచారం చేయడం, విమర్శించడం జరిగింది; అందువల్ల ఫ్యూడల్ బూర్జువావర్గాలు, రైతుల చేతులలో భూమిని కాజేయకుండా వుండాలంటే, భూమిని జాతీయంచేయడం ఒక్కటే సురక్షితమైన పద్ధతి అని వారు గ్రహించేందుకు మన ప్రచారం, విమర్శ తోడ్పడలేక పోయింది.

భూమిని జాతీయం చేయడంవల్లనే ఫ్యూడల్ ఆస్తిని పూర్తిగా రద్దుచేయగలం. భూమిని జాతీయంచేయడం వల్లనే వాస్తవంగా దున్నే వారికి భూమిలభిస్తుంది. భూస్వాములకూ ధనికరైతులకూ భూమిపైవున్న గుత్తాధికారం అంతం అవుతుంది. భూమిపై క్రయవిక్రయాలను నిషేధించడం వల్ల ధనంయొక్క ప్రాబల్యం తొలగిపోతుంది. భూమిని అటూ ఇటూ చేతులు మారుస్తూ - మారు బేరాలు చేస్తూ - డబ్బు కూడబెట్టే మోతుబరుల ఆటకట్టుతుంది భూమిని స్వయంగా సాగుజేసేరైతును తొలగించి దానిని ధనికరైతులపహరించడం - ఆక్రమించడం- సాధ్యపడదు. భూమిని జాతీయం చేయడంవల్లనే ధనప్రాబల్యానికి లొంగిపోకుండా, భూమివడ్డీ వ్యాపారి చేతుల్లోకి పోకుండా రైతుకుహామీ - సరియైన రక్షణ - ఏర్పడుతుంది. కాబట్టి భూమిని జాతీయం చేయడం అనే నినాదం వ్యవసాయకార్మికులనూ పేదరైతులనూ మాత్రమే కాకుండా మధ్యతరగతి రైతులనుకూడా తనవైపు ఆకర్షిస్తుంది. భూమిని జాతీయం చేయడంవల్ల మధ్యతరగతిరైతు తనకున్న ఆస్తిని ఏమాత్రం నష్టపడడు; పైగా భాగ్యవంతులు తన ఆస్తిపైచేసే దాడినుంచి తనకు రక్షణఏర్పడుతుందని గ్రహిస్తాడు. తన స్వానుభవంద్వారానే మనం చెప్పేదంతా యథార్థమని తెలుసుకుంటాడు. ప్రారంభంలో అతను చాలా ఎక్కువగా ఊగిసలాడుతూ ఉండేమాట వాస్తవమే. ధనిక రైతులు చెప్పే మాయమాటలకు రెచ్చిపోయి మొదట మనలను ద్వేషించవచ్చును. భూమిని జాతీయం చేయడంవల్ల సహజంగా ఆస్తిపరుల్లో వుండే అనుమానాలన్నీ అతనిలోకూడా ఉంటాయి. కాని మనం చెప్పిన విషయాల్లో ఉన్న వాస్తవికతను స్వయంగా అతను కండ్లారా చూచినకొలదీ, దేశమంతటా మధ్యతరగతి రైతు లేవిధంగా నానాటికి చితికిపోతున్నారో ఉదాహరణలతో, లెక్కలతో సవిస్తారంగా మనం తెలియజేసి నచ్చజెప్పి అతన్ని ఒప్పించవచ్చును. భూస్వామ్య విధానాన్ని రద్దుచేయాలనడంతో పాటు 'భూమిని జాతీయంచేయాలి' సాగుజేసుకోడానికి దున్నేవారికే భూమినివ్వాలి,' అనేదికూడా మన నినాదాలుగా ఉండాలి.

# 15

వ్యవసాయ కార్మికుని జీవనభృతికి సంబంధించిన మరో ముఖ్యమైన డిమాండును మన కార్యక్రమంలో తప్పకుండా చేర్చవలసి వుంది. వ్యవసాయ కార్మికుల సంఘటితపరచడానికి, సమీకరించడానికి, ఇది ఒక మహత్తరమైన డిమాండు. దీనితోపాటు పనిగంటల నిర్ణయమూ, పారిశ్రామిక కార్మికులకుండే ఇతర హక్కులనుకూడా వ్యవసాయ కార్మికులకు కలిగించడం, సోషల్ ఇన్సూరెన్సు, వగైరాల గూర్చి సౌకర్యం కలుగజేయడం – యివన్నీ వ్యవసాయ కార్మికులను ప్రత్యేక సంఘాలలో సంఘటితపరచడానికి ఒక విశాలమైన వేదికగా వుపయోగపడతాయి. 'భూములన్నీ జాతీయం చెయ్యాలి' 'భూస్వామ్య విధానాన్ని రద్దు చేయాలి' వగైరా కూలీ, రైతు సమిష్టినినాదాలు పైకోర్కెలతోపాటు తప్పకవుండనేవుంటాయి. ప్రస్తుతం మన వ్యవసాయ కార్యక్రమంలో అదనంగా చేర్చవలసిన డిమాండ్లు యివే.

వ్యవసాయ కార్మికులయొక్క – లేక పల్లె ప్రాంతాల్లో వుండే మొత్తం కార్మికవర్గం యొక్క – సంఘనిర్మాణాన్ని గురించి కొన్ని ప్రశ్నలు బయలుదేరాయి. వ్యవసాయ కార్మికులకు ఒక ప్రత్యేకసంఘం ఏర్పరచడంవల్ల, ముఖ్యంగా వ్యవసాయ కార్మికుల జీవనభృతికోసం పోరాటం సాగించడంవల్ల పేద, మధ్యతరగతి రైతులతో వైరుధ్యం వస్తుందేమో అనే భయాన్ని – సందేహాన్ని – కొందరు కామ్రేడ్సు వెల్లడించారు. ఈ సందేహానికి సంగ్రహంగా సమాధానం యిది: ఇంతవరకూ యిచ్చిన వివరణనుబట్టి ఈ విషయంలో మన దృక్పథం ఏమిటో స్పష్టంగా బోధపడుతుంది. అనేక ప్రాంతాల్లో గ్రామీణ శ్రామికవర్గమే వ్యావసాయికుల్లో యెక్కువమందిగా – ఒకే గ్రూపుగా – వున్నారు. భూమిపై ఎట్టి హక్కులేని వ్యవసాయ కార్మికులు విప్లవాన్ని కొనసాగించడంలో – ప్రజాస్వామిక ప్రజాతంత్ర విప్లవంతోపాటు సోషలిస్టు విప్లవంలో కూడా శ్రామికవర్గానికి అత్యంత సన్నిహిత మిత్రులుగా వుంటారు. పల్లెప్రాంతాల్లో గ్రామీణ శ్రామికవర్గం నాయకత్వం వహించకుండా చొరవ తీసుకోకుండా, తనకు గట్టి మిత్రులైన పేదరైతులనూ వూగిసలాడే మిత్రులైన మధ్యతరగతి రైతులనూ ముందుండి నడిపించకుండా వ్యవసాయ విప్లవంలోనూ, ప్రజాస్వామిక ప్రజాతంత్ర విప్లవంలోనూ శ్రామికవర్గ నాయకత్వం నెలకొనదు. శ్రామికవర్గం నాయకత్వం వహించడంద్వారానే శ్రామికవర్గాధికారం ఏర్పడుతుంది. ప్రజాస్వామిక ప్రజాతంత్ర విప్లవమూ, సోషలిస్టు విప్లవమూ, రెండూకూడ, జయప్రదం కావాలంటే పేద రైతులతో దృఢమైన మైత్రి నెలకొల్పి పల్లె ప్రాంతాల కార్మికులు నాయకత్వం వహించేటట్లుగా, – చొరవ తీసుకొనేటట్లుగా – శ్రామికవర్గం చూడవలసి వుంటుంది. ఒక ప్రత్యేకవర్గంగా గ్రామీణ శ్రామికులు సంఘటితం కాకుండా, తమ ప్రత్యేక సంఘం ద్వారా దోపిడిదారులకు వ్యతిరేకంగా దైనందిన పోరాటాలు సాగించకుండా, పైకర్తవ్యాన్ని నిర్వహించుటకు వారు పూనుకోలేరు. వారి ప్రత్యేకవృత్తి (కులసంఘంగాదు) సంఘం లేక సంఘాలద్వారా గావించిన పోరాటాలు వారిలో వర్గచైతన్యాన్ని కలిగిస్తాయి. రాజకీయ చైతన్యాన్ని పెంపొందిస్తాయి. వ్యవసాయ విప్లవంలో అగ్రగామిదళంగా వారు నిర్వహించవలసిన పాత్రను కొనసాగించగలిగేటట్లు వారిని తయారుచేస్తాయి. కాబట్టి దైనందిన పోరాటాలకోసం వారిని ప్రత్యేక సంఘాల్లో సంఘటిత పరచడం అత్యవసర కర్తవ్యం.

పార్టీకి అత్యంతసన్నిహితులు వీరే కాబట్టి ఈవర్గంనుంచి పార్టీసభ్యులను చేర్చుకోడానికి పార్టీ ప్రత్యేకశ్రద్ధ తీసుకొని కృషిచేయాలి. గ్రామీణశ్రామికుల్లో పార్టీ ప్రత్యేకరాజకీయ కృషిచేయడం, వారిని పార్టీలో చేర్చుకోడం, పల్లెప్రాంతంలో శ్రామికవర్గపార్టీకి వారినే ప్రాతిపదికగా చేయడం - ప్రతికమ్యూనిస్టు పార్టీ సభ్యునియొక్క కర్తవ్యం. ఇవి లెనినిజంలో 'ఓనమా'లు. పార్టీలోకి ఆకర్షించబడడంద్వారా, శ్రామికవర్గంచే ప్రోత్సహింపబడడంద్వారా వ్యవసాయ విప్లవంలోనూ, పల్లెప్రాంతంలో జరిగే ప్రజాస్వామిక ప్రజాతంత్రపోరాటాల్లోనూ, పల్లెకార్మికులు ప్రధానపాత్ర వహిస్తారు.

పల్లెకార్మికుల ప్రత్యేకసంఘం పల్లెప్రజలకు చెందిన తదితరవర్గాలతో రైతుసంఘంలో సంఘటితులైన పేదరైతులతో, మధ్యతరగతి రైతులతో సమిష్టిపోరాటాల ద్వారా దృఢపడిన సన్నిహిత సంబంధమూ, అన్యోన్య సహాయమూ, నిర్మాణరీత్యా సహకారమూ కలిగి ఉంటుంది.

వ్యవసాయ కార్మికసంఘాన్ని సముచిత ప్రాతినిధ్యంతో రైతుసంఘానికి అనుబంధసంఘంగా చేర్చవచ్చును. లేక ఉభయసంఘాలు తమతమ ప్రధాన సమావేశాలకు తమ రెండోసంఘంయొక్క కార్యనిర్వాహకవర్గాన్నికూడా ఆహ్వానించడం ఇంకా మంచిపద్ధతి. ఇలాంటి పద్ధతులద్వారా ఈరెండు సంఘాలూ తప్పకుండా పరస్పర సహాయం చేసుకోవలసి ఉంటుంది. ఉభయసంఘాలూ కలిసి 'దినోత్సవాలు' జరపాలి; ఉభయ సంఘాలూ కలిసి సమిష్టిగా పోరాటాలు సాగించవలసి ఉంటుందని వేరే చెప్పనవసరంలేదు. వీటి అన్నింటితో పాటు వృత్తి నాధారంగా చేసుకొని నిర్మించబడే గ్రామీణ కార్మిక సంఘాలను లేక ఆసంఘాల సమాఖ్యను ఆల్ ఇండియా ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసుతో అనుబంధించడం కూడా అత్యవసరం. ఆవిధంగా అనుబంధ సంఘంగా చేర్చడంవల్ల గ్రామాల్లో ఉండే ఆ సంఘసభ్యులకు పట్టణాల్లో - పరిశ్రమల్లో - ఉండే శ్రామికవర్గంతో ప్రత్యక్ష సంబంధం ఏర్పడుతుంది.

గ్రామీణ కార్మికోద్యమంపట్ల రైతాంగంలో కొన్ని గ్రూపులు ప్రాతికూల్యత వహిస్తాయి అని కొందరు కామ్రేడ్సు వెల్లడించిన సందేహాలను అనాలోచితంగా త్రోసిపుచ్చివేయడానికి వీల్లేదు. మనదేశ ప్రత్యేకలక్షణాలనుబట్టి ప్రారంభంలో అలాంటి ప్రతికూలత ఏర్పడడం సంభవమే. కార్మిక కర్షకులయొక్క శత్రువులు గ్రామీణ ప్రజాసామాన్యంలో విచ్ఛిన్నతను కొనిరావడానికి ఆ ప్రత్యేక లక్షణాలను ఉపయోగించుకుంటారు.

1. మన దేశంలోని కొన్ని ప్రాంతాల్లో గ్రామీణ కార్మికులు - ముఖ్యంగా వ్యవసాయ కార్మికులు - ఎక్కువమంది 'అస్పృశ్యులు' అనీ, బీద, మధ్యతరగతి వర్గాలకు చెందిన రైతులు స్పృశ్యులు (అంటదగినవారు) అనీ మనం మరచిపోరాదు. యు పి, బీహార్, మహారాష్ట్ర, ఆంధ్ర, తమిళనాడు, కేరళ రాష్ట్రాల్లో ఇదే పరిస్థితి. మనం ఇన్ని సంవత్సరాలనుంచీ జరుపుతూన్న పోరాటాలు

మధ్యతరగతి రైతుమీదనే ప్రధానంగా ఆధారపడి ఉన్నాయి. మన పలుకుబడి ఉన్న ప్రదేశాల్లోకూడా కులానికీ కులానికీ మధ్య నున్న అడ్డుగోడలను ఇంకా పూర్తిగా కూల్చి వేయడం జరగలేదు. మధ్యతరగతిరైతూ, పేదరైతూ గ్రామీణ కార్మికులచేత, కనీసం ఊడ్పేపనివారూ, వడ్రంగులూ, కమ్మరులూ, వగైరా వృత్తిపనివారిచేతనైనా అప్పుడప్పుడు కొంత పని చేయించుకుంటూ ఉంటారు. అందువల్ల గ్రామీణ కార్మికుల కూలీరేట్లు వగైరా కోర్కెలంటేనూ, ప్రత్యేకకూలీ ఉద్యమం అంటేనూ వారిలో వ్యతిరేకత రావచ్చు. ఇదే సంభవిస్తే మనం ప్రధానంగా ఎవరికి వ్యతిరేకంగా ఉద్యమం లేవదీస్తున్నామో ఆ ధనిక రైతుకొట్టే చేతిలో పడుతుంది. గ్రామసీమల్లో ఉండే ధనికరైతులు దీన్ని అవకాశంగా తీసుకొని కులభేదాలను, తగాదాలను పురికొల్పుతారు. వ్యవసాయకార్మికులకు వ్యతిరేకంగా పేదరైతాంగాన్ని రెచ్చగొడతారు. పేదరైతు - వ్యవసాయకూలీ ఐక్యతను విచ్ఛిన్నం చేస్తారు. కాబట్టి ఈ ప్రమాదాన్ని తక్కువ అంచనా వేయరాదు. అవర్ణులు (అస్పృశ్యులు) తమమాట వినకుండా పోతున్నారని అప్పుడప్పుడు అనేకప్రాంతాల్లో సవర్ణరైతు లంటూ ఉండడం ఒక వైపు వింటూనే ఉన్నాం.

కాబట్టి ఈ విషయంలో మొదటినుంచీ తగు జాగ్రత్త వహించవలసి ఉంటుంది. మనం జరిపే దైనందిన పోరాటాలు ఏవిధంగా భూస్వామి, ధనికరైతు వర్గ వ్యతిరేక స్వభావాన్ని కలిగి ఉన్నాయో పేద, మధ్యతరగతి రైతులు తెలుసుకొనేట్లు చేస్తూ ధనికరైతుల విషప్రచారానికి విరుగుడు వేస్తూ ఉండాలి. పేద, మధ్యతరగతి రైతులతోసహా తమ అందరినీ అణచివేసే, పీడించే భూస్వామి - ధనిక రైతువర్గాలకు వ్యతిరేకంగా సాగించే పోరాటం తమ అందరి పోరాటమే అని వారు గుర్తించేటట్లు చేయాలి. కొత్తగా మనఉద్యమం ప్రవేశించిన ప్రదేశాల్లో మనం సాగించే సమ్మె పోరాటాలూ, ప్రదర్శనలూ, ఎక్కువ జీతంకోసం సాగించే పోరాటాలూ సాధ్యమైనంతవరకు భూస్వామి, ధనిక రైతువర్గాలకు మాత్రమే వ్యతిరేకంగా ఉండేటట్లు చూడాలి. అందువల్ల ఆ పోరాటాలయొక్క భూస్వామి - ధనిక రైతువర్గ వ్యతిరేక స్వభావం స్పష్టంగా ద్యోతకమవుతుంది. దీనితోపాటు మనం జాగ్రత్త వహించవలసిన మరో ముఖ్యమైన విషయం; జీవనభృతి వగైరా హక్కులను సాధించడం భూస్వామి - ధనిక రైతువర్గాలకు వ్యతిరేకంగా సాగించే పోరాటంలో ఒకభాగమే అని పేద, మధ్యతరగతి రైతులకు చక్కగా నచ్చచెప్పాలి. 'కార్మికునికి సరిపడ జీతమూ, రైతునకు

సుఖప్రదమైన జీవితమూ' ఇదే మన నినాదం. కార్మికునికి జీతం పెంచడంవల్ల తాను నష్టపడతానని రైతు అపోహపడుతున్నాడు. కాబట్టి ముందు ఇలాంటి అపోహలను తొలగించడానికి కృషి చెయ్యాలి. కూలీకి జీతం పెంచడంవల్ల నష్టపడేది పేద రైతు గాదనీ, భూస్వాములూ, ధనిక రైతులే ఆభారాన్ని మోయవలసి వస్తుందనీ – ఆ నష్టాన్ని భరించవలసి వస్తుందనీ, ఓపికగా రైతులకు నచ్చజెప్పి, ప్రచారం చేసి, రైతు కూలీ ఐక్యత విచ్ఛిన్నం గాకుండా చూడాలి. మధ్యతరగతి రైతు విషయంలో గూడా ఇదే పద్ధతి ననుసరించాలి. ఈ హెచ్చరికను గమనించకుండా త్రోసిపుచ్చినట్లయితే కూలీల పోరాటానికి ద్రోహం చేసిన వాళ్ళమవుతాం.

ఈ విషయాలన్నింటితోపాటు రైతులమధ్య గతంలో మనం చేసిన కృషినికూడా దృష్టిలో ఉంచుకోవలసి ఉంటుంది. మధ్యతరగతి రైతాంగమే ఇంతకాలంనుంచీ మనకు ప్రధానమైన ఆధారంగాఉంది. పదేండ్లపాటు కష్టపడిచేసిన ఈ పని అంతా వృధాగా వమ్ముచేయడం మన తలంపు కాదు. మధ్యతరగతి రైతును మనలోనే ఉంచుకోడానికి మనశక్తినంతా ధారపోసి ప్రయత్నం చేయాలి. అతనికి వచ్చే సందేహాలన్నిటికీ ఓపికగా సమాధానాలిచ్చి నచ్చజెప్పాలి. తాత్కాలికంగానయినా అతను తప్పుదారినబడకుండా ఉండేందుకు మనం సర్వవిధాలా కృషిచేయాలి. అతను కేవలం ఈ విషయంలో తటస్థవైఖరి నవలంబించే స్థితికి దిగజారకుండా చూడాలి. ఒక వైపు ఈ కృషినంతా సాగిస్తూనే నిస్సంకోచంగా మనం పోరాటాన్ని ముందుకు కొనిపోవాలి. అప్పటికీ మధ్యతరగతి రైతు ఇంకా ఊగిసలాడుతూనేఉంటే పోరాటంద్వారా అతనిఊగిసలాటను స్తంభింపజేయాలి. మధ్యతరగతి రైతును మనవైపు రాబట్టుకోడానికి మనం చేయవలసినదంతా చేస్తాం. అతనికి వచ్చే సందేహాలను నివారించడానికీ, అతనికి నచ్చజెప్పడానికీ, అతనితో నిత్య సంబంధం పెట్టుకోడానికీ ఉన్న అవకాశాలన్నీ ఉపయోగిస్తాం. పోరాటాన్ని ఎప్పుడు సాగించాలి? ఎలా సాగించాలి? మొదలైన ఎత్తుగడల్లో తగినంత జాగ్రత్త వహిస్తాం. కాని అతనికోసమని పోరాటతీవ్రతను తగ్గించజాలం. అతనికున్న సందేహా

లన్నీ తొలగిపోయేవరకూ పోరాటం ప్రారంభించకుండా మనం చేతులు ముడుచుకొని కూర్చోం. 'అతని కర్మ మనమేం జేస్తాం' అనుకోకుండా ముందుగా తగినంత ప్రచారం చేస్తే, అతనితో మన కున్న సంబంధాలను వదులుకోకుండా పోరాటకాలంలో వాటిని నిలుపుకోగలిగితే, వ్యవసాయ కార్మికులు తమ సర్వస్వం ధారవోసి వీరోచితంగా సాగించే పోరాటాన్ని మధ్యతరగతి రైతు స్వయంగా - తన కండ్లారా - చూచినకొలదీ, క్రమ క్రమంగా అతని కున్న సందేహాలన్నీ తొలగిపోతాయి. ఎలాగైనా మధ్య తరగతి రైతులో ఊగిసలాట చాలా ఎక్కువగా ఉంటుందనే విషయాన్ని మాత్రం మనం మరచిపోరాదు.

# 16

ఇక నిర్మాణసమస్యకు సంబంధించిన మరో విషయాన్ని గురించి చూద్దాం. పోరాట సాధనాలుగా రైతుకమిటీల పాత్రనుగురించీ, భూమికోసం సాగించే పోరాటంలో వాటి పాత్రనుగురించి - మనం తెలుసుకోవలసిఉంది. భూమిని జాతీయం చేసి, రైతుకమిటీలద్వారా భూమిని సాగునిమిత్తం పునర్విభజించడమే మన పూర్తినినాదం. ఈ కమిటీలలో, మధ్య తరగతి రైతుప్రతినిధు లున్నప్పటికీ, ప్రధానంగా పేదరైతులు, వ్యవసాయకూలీలే అధిక సంఖ్యాకులుగా తప్పనిసరిగా ఉండేటట్లు మనం తగుజాగ్రత్త తీసుకోవాలి. దైనందిన పోరాటాలలో - భూములనుంచి రైతులను వెళ్లగొట్టడానికి వ్యతిరేకంగాగానీ, కూలీరేటు కోసంగానీ, భూములను తిరిగి స్వాధీనపరుచు కోవడంకోసంగానీ సాగించే పోరాటాలలో - ఈకమిటీలను ఆచరణలోకి తేవలసిఉంటుంది. ఈకమిటీలు మామూలు రైతుసంఘకమిటీలు కావు; పోరాటకాలంలో ఎన్నుకోబడే పోరాటకమిటీలు; సమరోత్సాహ పూరితమైన నూతన శక్తులను యీ కమిటీలు పోరాట రంగంలోకి తెస్తాయి. పోరాటాన్ని నడపడానికి ఈకమిటీలు విశాలమైన సంఘటిత ప్రజాస్వామిక కమిటీలుగా ఉండాలి. ఇవే నిజమైన అధికార కమిటీలుగా పనిచేయాలి. ప్రజల గౌరవాభిమానాలను పొందిఉండాలి. పోరాటాల్లో కాకలుతీరిన కార్యాచరణశీలురే ఈకమిటీలలో సభ్యులుగా ఉండేటట్లు చూడాలి. నాయకత్వంలో లొంగుబాటుగానీ ఊగిసలాటగానీ కన్పిస్తే ఈకమిటీల ముందు బట్టబయలు చేయాలి. పోరాటకాలంలో ఎన్నుకోబడిన కమిటీలు కాబట్టి ఇవి ప్రజాఐక్యతకు ప్రతిబింబాలుగా ఉంటాయి. అందువల్ల వీటినే నిజమైన అధికార కమిటీలుగా చేయాలి. అలాచేయడం సాధ్యమవుతుందికూడా. ఈకమిటీలు చెప్పే మాటే శాసనంగా - ఉద్యమానికి పిలుపుగా - ఉంటుంది. ఈ కమిటీలనుగురించి మన కామ్రేడ్స్ ప్రచారం చేయాలి. ఈకమిటీలను నిజమైన ప్రజాస్వామికసాధనాలు (అర్గన్సు)గా ప్రజలు వీటిని చూచి గర్వపడేటట్లుగా నిర్మించాలి - నడిపించాలి. క్రిందివర్కర్ల నాయకత్వాన్ని నిర్మించేందుకు ఈకమిటీలు సాధనాలుగా పనిచేస్తాయి. వీటిని అలా తయారుచేసి పూర్తిగా ఉపయోగించుకోవాలి. పాక్షికపోరాటాలను కొన

సాగించడంద్వారానే ఇలాంటి కమిటీలను గురించిన భావన మొదట ఏర్పడుతుంది. ప్రజాసామాన్యం మొత్తంగా పోరాటం సాగించినప్పుడల్లా సహజంగా ఇలాంటి కమిటీలు ఏర్పడి పోరాటానికి ఒక నిర్మాణ స్వరూపాన్ని కలిగిస్తాయి. పోరాటం విస్తృతమైనకొలదీ, తీవ్రతరమైనకొలదీ, భూమి - పునర్విభజన పోరాటంగా ముందుకు వచ్చిన కొలదీ, ఈ కమిటీలు విప్లవకమిటీలుగా అభివృద్ధిఅయి, పోరాట ఉన్నతస్థాయిలో రైతుకూలీ సోవియట్ల స్థాపనకు ప్రాతిపదికగా పరిణమిస్తాయి. ఈ కమిటీలను పోరాట కమిటీలుగానూ, పోరాటానికి నిర్మాణరూపాలుగానూ చైతన్య పూర్వకంగా అభివృద్ధి చేయకపోతే కార్మికవర్గ నాయకత్వం తయారుగాదు.

# 17

వ్యవసాయసమస్యనుగూర్చి పైన గావించిన పరిశీలననుబట్టి వ్యవసాయవిప్లవంకొరకు జరిగే పోరాటంలోనే గాకుండా మన తక్షణ కర్తవ్యమైన ప్రజాస్వామిక ప్రజాతంత్ర విప్లవ పోరాటంలోకూడా ఏయే వర్గశక్తులు కార్మిక వర్గంతో కలిసివస్తాయో, ఏవి కలిసిరావో తెలుసుకోగలుగుతాం. మనప్రజల్లో ఎక్కువ మంది అత్యధికంగా గ్రామసీమలకు చెందిన వారే. కాబట్టి గ్రామాల్లో మన వర్గసంబంధాలు ప్రజాస్వామిక ప్రజాతంత్ర విప్లవంలో ఎలా ఉంటాయో తెలుసుకోడం చాలా ముఖ్యమైన విషయం.

ప్రజాస్వామిక ప్రజాతంత్రం కోసం సాగించే విప్లవపోరాటంలో శ్రామికవర్గం యొక్క శత్రువు లెవరు? మిత్రు లెవరు? ఈ విప్లవపోరాటం ఎవరెవరికి వ్యతిరేకంగా సాగించవలసి ఉంటుంది? ఎవరిని కూలద్రోయవలసి ఉంటుంది? ఇంతకుపూర్వమున్న దశకూ, నేటిదశకూ భేద మేమిటి?

1. పెట్టుబడిదారీ వర్గంయొక్క రాజకీయాధికారాన్ని తొలగించడానికి ప్రజాస్వామిక ప్రజాతంత్రవిప్లవం కొనసాగించవలసి ఉంటుంది. పరిస్థితుల్లో వచ్చిన ప్రధానమైన మార్పు ఇదే. సామ్రాజ్యవాదుల అధికారాన్ని కూలద్రోయడం, బూర్జువావర్గంయొక్క పోరాటంలో అస్థిరత్వాన్ని స్తంభింపజేయడం ఇదివరకు మన ఆశయంగా ఉండేది. కాని, నేడు రాజీవాదుల పాత్రను తటస్థం చేయడంగాదు మన ఆశయం; రాజకీయ పోరాటంలో బూర్జువా వర్గాధికారాన్ని సూటిగా ఓడించడమే మన ఆశయం. బూర్జువావర్గం ఇదివరకు సామ్రాజ్యవాదులపట్ల వ్యతిరేకవైఖరి నవలంబించేది. కాని ఇప్పుడు భారత విప్లవ విచ్ఛిన్నతకు అగ్రగామిగా ఉండి పనిచేస్తోంది.

పోతే ఇక సంస్థానాధిపతుల, ఫ్యూడల్ భూస్వాముల స్థాన మేది? వ్యవసాయవిప్లవం ఫ్యూడలిజాన్ని తప్పకుండా తుడిచిపెట్టివేయాలి. పెట్టుబడిదారీ రాజకీయాధికారాన్ని తొలగించేందుకు పోరాటాన్ని సాగించడంతో పాటు ఫ్యూడల్ విధానాన్ని రద్దుచేయుటకు ప్రజాస్వామిక ప్రజాతంత్ర విప్లవపోరాటాన్ని సాగించాలి.

గ్రామాల్లో పెట్టుబడిదారీ శక్తులకు వ్యతిరేకంగా పోరాటం సాగించి భూమిపై వారి గుత్తాధికారాన్ని తొలగించవలసి ఉంటుంది. అందువల్ల వ్యవసాయ విప్లవపోరాటంలో, ఫ్యూడల్ దోపిడీకి వ్యతిరేకంగానూ, బూర్జువా దోపిడీకి వ్యతిరేకంగానూ పోరాటాన్ని సాగించే పోరాటశక్తులు రెండూ పాల్గొంటాయి.

ఇకపోతే సామ్రాజ్యవాదం విషయ మేమిటి? దేశంయొక్క నిజమైన స్వేచ్ఛా

స్వాతంత్ర్యాలకోసం సాగించే పోరాటం ఇక జాతీయ ప్రభుత్వంకోసం సాగించే పోరాటం కాదు: ప్రపంచ సామ్రాజ్యవాద పరిధినుంచీ, ప్రపంచ పెట్టుబడిదారీ ఆర్థికవిధానంనుంచీ దేశాన్ని విముక్తిచేసి ప్రజాస్వామిక సోషలిస్టు విధానంలో చేర్చడంకోసం సాగించే పోరాటమే నిజమైన స్వాతంత్ర్య పోరాటం. ప్రజాస్వామిక ప్రజాతంత్ర స్థాపనకూ సామ్రాజ్యవాద పరిధిలోనే ఉండటానికీ ఎక్కడా పోలిక లేదు. ఒకదాని కొకటి పూర్తిగా విరుద్ధం.

అందువల్ల ప్రజాస్వామిక ప్రజాతంత్ర విప్లవమూ, సోషలిస్టు విప్లవమూ ఒకదానితో ఒకటి ఎలా కలసిపోతున్నాయో మనం చూస్తున్నాం. ఫ్యూడల్ విధానాన్ని అంతం చేయవలసిన కర్తవ్యం బూర్జువావర్గ రాజకీయాధికారాన్ని అంతం చేయవలసిన కర్తవ్యంతో మిళితమయింది. ఈ పని కార్మికవర్గ నాయకత్వంక్రిందనే నిర్వహించగలం.

ఆదేవిధంగా జాతీయ స్వాతంత్ర్య మనేది పెట్టుబడిదారీపరిధినుంచి బైటబడి సోషలిస్టు విధానంలోకి పోవడం అనే దానితో ముడిబడి ఉంది. ఈ విధంగా ఈ రెండూ కలసిపోవడానికి కారణం ప్రపంచ సోషలిస్టు విప్లవం పురోగమిస్తున్న సందర్భంలో నేటి ప్రజాస్వామిక విప్లవాలు జరుగుతూ ఉండడమే. రెండు శిబిరాలయొక్క స్వరూపం నేడు ఇంకా స్పష్టంగా గోచరిస్తూంది.

ఒకవైపున సామ్రాజ్యవాద శిబిరమూ పెట్టుబడిదారీ విధానమూ, మరోవైపున సోషలిజమూ ప్రజాస్వామికమూ ఉన్నాయి. సామ్రాజ్యవాద దురాక్రమణనుంచి విముక్తి పొందడంకోసం సాగించే పోరాటం మొత్తం ప్రపంచంమీద పెట్టుబడిదారీవిధానాన్ని అంతంచేయడంకోసం సాగించే పోరాటంతో సూటిగా కలిసిపోతూ ఉంది.

ఈ ప్రజాస్వామిక ప్రజాతంత్ర విప్లవాన్ని నడిపించే ప్రధానవర్గా లెవ్వి?

మొదటిది శ్రామికవర్గం. బూర్జువావర్గ రాజకీయాధికారాన్ని ఓడించడంలో శ్రామికవర్గ మొక్కటే నాయకత్వం వహించగలుగుతుంది.

ఇక రెండవది పల్లెప్రాంతాల్లో ఉండే శ్రామికులు, అర్ధ శ్రామిక జనసామాన్యం – పేదరైతులు. ఈ ఉభయశక్తులూ ఫ్యూడల్ బూర్జువా రెండురకాల దోపిడికీ వ్యతిరేకంగా పోరాడుతున్నాయి. ఈ ఉభయుల్లోనూ మొదటివర్గం – వ్యవసాయకార్మిక వర్గం – శ్రామికవర్గంతో అత్యంత సన్నిహిత సంబంధంకలిగి ఉంటుంది. గ్రామ పెట్టుబడిదారీశక్తులచే ఈవర్గం ప్రత్యక్షంగా దోపిడి చేయబడుతుంది. గ్రామాల్లో ఉండే తదితర వర్గాలన్నిటికంటెకూడా ఎక్కువగా ఈవర్గం ద్వారా పెట్టుబడిదారీ వస్తూత్పత్తిలోని వైరుధ్యం ప్రకటితమౌతోంది. సోషలిజం వచ్చినప్పుడే వీరికి మోక్షం. అందాకా సుఖజీవనమంటూ లేదు. వ్యవసాయ కార్మికులూ పేదరైతులూ కలిసి గ్రామీణ జనాభాలో అత్యధిక సంఖ్యాకులుగా ఉంటున్నారు.

తర్వాత ఊగిసలాడే మిత్రులు వస్తారు. మధ్యతరగతి రైతుల్లో ఊగిసలాట చాలా ఎక్కువగా ఉంటుంది. ప్రజాస్వామిక ప్రజాతంత్ర సంఘటనద్వారా ఏ ధనికరైతులతోనయితే పోరాడవలసి ఉంటుందో ఆ ధనిక రైతులతోనే మధ్యతరగతి రైతుకు సాంఘిక సంబంధాలు ఎక్కువగా ఉండడం ఇందుకు ప్రధమకారణం. ఏ బూర్జువా ప్రభుత్వంతో పోరాడమని పిలుపు ఇస్తున్నామో ఆబూర్జువా

ప్రభుత్వంపైనే అతనికి భ్రమలుండడం కూడా కారణం. కాబట్టి అతనిలో ఊగిసలాట ఎక్కువగానే ఉంటుంది. అందులోనూ ముఖ్యంగా కాంగ్రెసు ప్రభుత్వంతోనే పోరాడవలసివచ్చినప్పుడు ఆ ఊగిసలాట మరీ తీవ్రతరం అవుతుంది. సామ్రాజ్యవ్యతిరేక పోరాటకాలంలో సామ్రాజ్యవాద వ్యతిరేక పాత్రను నిర్వహిస్తూన్న బూర్జువావర్గాన్ని అనుసరించే సమయంలో, ఉండే ఊగిసలాటకూ, ఇప్పటి ఊగిసలాటకూ ఎంతో తేడా ఉంది. సామ్రాజ్యవాదంపట్ల, ఫ్యూడలిజంపట్ల అతనికుండే అసహ్యతవల్ల అప్పుడతను ఊగిసలాడడంగానీ, లేక ఊగిసలాటనుంచి బైటబడగలగడంగానీ జరిగింది. కాని ఇప్పుడు బూర్జువాప్రభుత్వంతో ధనికరైతులతో పోరాడమన్నప్పుడు ఇంత కాలంనుంచి తాను ఆశిస్తోన్న ఆశయాలనూ, ఆదర్శాలనూ వదిలేసి పోరాడవలసి వచ్చినట్లు భావిస్తాడు. అందువల్ల అతని ఊగిసలాట అత్యంతతీవ్రరూపంలో ఉంటుంది.

అయినప్పటికీ, మనం అతన్ని మనవైపు రాబట్టుకోవచ్చు. ఫ్యూడల్ దోపిడికీ, పెట్టుబడిదారీదోపిడికి గురి అవుతూ ఉంటాడు. కాబట్టి మన సంఘటనలో మధ్యతరగతి రైతుకు కూడా ఒక ప్రధానస్థానం ఉంది కఠోరమైన జీవితానుభవమే అతన్ని పోరాటశక్తులతో మైత్రి నెరపేటట్లు చేస్తుంది. మధ్యతరగతి రైతుతో మైత్రి సాగించటంకోసం జరిపే పోరాటం ఒక ప్రధానమైన పోరాటమే. తదితర పోరాటవర్గాలు తమ నిర్దిష్ట కార్యాచరణ ద్వారా అతనిలో ఉత్సాహాన్ని - విశ్వాసాన్ని - కలిగించినప్పుడే ఆ పోరాటం జయప్రదమవుతుంది. అతనికోసం పట్టుదలతో తీవ్రంగా ప్రయత్నించకుండా ఏమాత్రం నిర్లక్ష్యం చేసినా అతన్ని మనవైపు రాబట్టుకోడం అసాధ్యమై పోతుంది.

తర్వాత ఇక పట్టణాల్లో ఉండే పెటీబూర్జువావర్గాన్ని తీసుకుందాం. మేధావులూ, పై గ్రూపులకు చెందినవారూ, క్రింది గ్రూపులకు చెందిన కొందరూ ప్రధానరంగంనుంచి చీలిపోతారు. వారిలో కొందరు శ్రామికవర్గానికి పూర్తిగా ఎదురుతిరుగుతారుకూడా. సైన్యంలో తదితర ప్రభుత్వశాఖల్లో అగ్రస్థానాలనూ మేనేజరు పదవులలాంటి విశిష్టస్థానాలనూ, వ్యాపార పరిశ్రమల్లో ఫ్యాక్టరీల్లో అధికార స్థానాలనూ వీరే ఆక్రమిస్తారు. తమ విశిష్టస్థానాలకు ఎట్టి ముప్పు వాటిల్లకుండా సురక్షితంగా కాపాడుకునేందుకు ప్రస్తుత బూర్జువా ప్రభుత్వంవైపు అర్రుజాస్తూ ఉంటారు.

ఇక మిగతా ఉద్యోగులూ, ఉపాధ్యాయులూ, విద్యార్థులూ, గుమాస్తాలూ, క్రింది తరగతి ఉద్యోగులూ మొదలైనవారు ఊగిసలాడుతూ ఉంటారు. కాని వీరిలో ఒకభాగం మాత్రం క్రమక్రమంగా నిర్దిష్టపంథా నవలంబించి సోషలిస్టుభావాలు గలవారుగా మారుతారు. పెటీబూర్జువా వర్గానికిచెందిన వీరిని మనం రాబట్టుకోడం చాలా ముఖ్యమైన విషయం.

పోతే ఇక ధనికరైతు - బూర్జువారైతు - యొక్క స్థానమేది? అతనిలో ఊగిసలాట ఉంటుందా? అతన్ని తటస్థంగా ఉంచడానికి సాధ్యమవుతుందా? ఏమాత్రం సాధ్యంగాదు. పల్లెప్రాంతంలోని మన ప్రధానశత్రువుల్లో అతనొకడు. పల్లెప్రాంతంలోని ఫ్యూడల్ - బూర్జువా అభివృద్ధినిరోధక ముఠాకు అతను

నాయకత్వం వహిస్తాడు. ఇందుకు మొదటి కారణం అతను పెట్టుబడిదారై ఉండడం; ఈ ప్రభుత్వాన్ని తన ప్రభుత్వంగానే భావిస్తాడు. ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాగించే ప్రతి ఉద్యమమూ తనకుకూడా వ్యతిరేకమే అని అతనికి తెలుసు. కాబట్టి అతను చివరదాకా తెగించి పోరాడతాడు. మరో కారణం అతను దోపిడిదారై ఉండడం; వ్యవసాయ విప్లవం భూమిపై అతనికున్న గుత్తాధికారాన్ని వ్యతిరేకిస్తుంది. కూలీశ్రమను దోచుకోడాన్ని సాగనివ్వదు. కాబట్టి అతను ప్రజాస్వామిక సంఘటనకు వ్యతిరేకి అవుతాడు. ప్రభుత్వాన్ని, అభివృద్ధినిరోధకత్వాన్ని, ప్రస్తుత విధానాన్ని నిలబెట్టడానికి అతడు మహామూర్ఖంగా ఎదిరిస్తాడు.

ఏ ఏ వర్గాలు కలిసివస్తాయో, ఏ ఏ వర్గాలు కలిసిరావో ఇప్పుడు స్పష్టంగా తెలుసుకోవచ్చు;

**బూర్జువావర్గంయొక్క రాజకీయాధికారాన్ని, ఫ్యూడల్ విధానాన్ని కూలద్రోయడంకోసం, సామ్రాజ్యవాదపరిధినుంచి దేశాన్ని బైటకు లాగడంకోసం, కార్మిక కర్షకుల ప్రజాస్వామిక నియంతృత్వంకోసం, ధనికరైతులతో పోరాడుతూ భూస్వాములకు వ్యతిరేకంగా, గ్రామీణ శ్రామికవర్గంపై, పేదరైతాంగంపై స్థిరంగా ఆధారపడి మధ్యతరగతి రైతుతో మైత్రి నెరపుతూ శ్రామికవర్గం పురోగమిస్తుంది.**

పై పరిశీలనద్వారా తేలిన వర్గశక్తుల సంబంధాలివి. గ్రామీణశ్రామికవర్గంపై, పేదరైతులపై శ్రామికవర్గం స్థిరంగా ఆధారపడడం అంటే అర్థ మిదే.

సోషలిస్టు విప్లవంతో ప్రజాస్వామికవిప్లవం సమ్మిళితమై పోవడాన్నే పై వర్గ సంబంధాలు స్పష్టం చేస్తున్నాయి.

గ్రామీణశ్రామిక వర్గానికి, పేదరైతాంగానికీ నాయకత్వం వహించి నడిపించడం ద్వారా ఏర్పడే వర్గశక్తుల సంఘటనలో అతి ప్రధానశక్తిగా, అధికశక్తిగా వుండే శ్రామిక వర్గమే సోషలిస్టు విప్లవానికి మూలాధారంగా ఉంటుంది. ప్రధానవర్గశక్తి అయిన శ్రామిక వర్గం తదనంతర విప్లవదశ (సోషలిస్టుదశ)కు పురోగమించడానికి అనువైన ప్రధాన వర్గ శక్తులు యీ విధంగా జనిస్తున్నాయి, ముందుకు పోతున్నాయి.

ప్రజాస్వామిక సంఘటన ఫ్యూడలిజాన్ని కూలద్రోయడంతో తన ప్రజాస్వామిక విప్లవ కర్తవ్యాన్ని నిర్వహించినట్లవుతుంది. బూర్జువా వర్గ రాజకీయాధికారాన్ని శ్రామికవర్గం ప్రత్యక్షంగా కూలద్రోయడంవల్ల ప్రజాస్వామిక విప్లవం శ్రామికవర్గ, సోషలిస్టు స్వభావాన్ని కలిగి ఉంటుంది.

పెట్టుబడిదారీ పరిధినుంచి పూర్తిగా బైటబడడానికి మన కర్తవ్య నిర్వహణద్వారా, పోరాటంయొక్క సోషలిస్టు స్వభావం ఇంకా పెంపొందుతుంది. పై వర్గశక్తుల సంయోగం ఫలితంగా యేర్పడే కార్మికకర్షకుల ప్రజాస్వామిక నియంతృత్వం ప్రజాస్వామిక విప్లవ పరిసమాప్తిని చేరుకొని వర్గసంఘర్షణను యింకా తీవ్రపర్చుతుంది. కార్మిక వర్గనాయకత్వాన్ని కష్టజీవులైన రైతులతో శ్రామికవర్గానికుండే సన్నిహిత సంబంధాన్ని యింకా దృఢపర్చుతుంది.

ఈ విధంగా తదనంతర దశకు పురోగమించడానికి అవసరమైన పరిస్థితులన్నీ ఏర్పడి ఉంటాయి. (భూమినీ, పరిశ్రమలనూ) జాతీయం చేయడం వగైరాల నటుంచి అసలు ప్రధానాయుధం శ్రామికులూ వ్యవసాయ

కార్మికులూ, పేదరైతులమధ్య ఏర్పడిన ఐక్యత ఇదివరకే బలంగా ఉంది. కాబట్టి తదనంతర దశకు సాగిపోకుండా ప్రజాస్వామిక సంఘటన అంతటితోనే ఆగదు. సోషలిజాన్ని సాధించకుండా నేడు ప్రజల సమస్యల్లో ఏఒక్కటీ పరిష్కారం కాదు. కాబట్టి పైసంఘటన ముందుకు పురోగమించి తీరుతుంది. బూర్జువావర్గ రాజకీయాధికారాన్ని అంతంజేయడంతో మన శత్రువు చేతిలో ఉన్న రాజ్యాంగ యంత్ర ఆయుధాన్ని కోల్పోతాడు. ఆ ఆయుధం కష్టజీవులచేతుల్లోకి వస్తుంది. కార్మికకర్షకుల ప్రజాస్వామిక నియంతృత్వం — లేక ప్రజాస్వామిక ప్రజాతంత్ర ప్రభుత్వం — ఎంత త్వరగా రెండోదశలోకి ప్రవేశిస్తుందనే విషయం వ్యవసాయ కార్మికులూ పేద రైతులతో కలిసి శ్రామికవర్గం ఎంత స్థిరసంకల్పంతో బూర్జువా వర్గానికి వ్యతిరేకంగా పోరాడుతూ పురోగమిస్తుందీ అనే విషయంపైనా, బూర్జువా ప్రతిఘటనను అధిగమించేందుకు శ్రామికవర్గ నాయకత్వం ఎంత దృఢంగా నెలకొల్పబడిందనే విషయంపైనా, శాంతియుత పోరాటమనే భ్రమలనుంచి శ్రామికవర్గమూ ఆవర్గపార్టీఅయిన కమ్యూనిస్టుపార్టీ ఎంతవరకు బైటబడిందీ అనే విషయాంపైనా ఆధారపడి ఉంటుంది. అప్పుడే ప్రజాస్వామిక ప్రజాతంత్రం మొదటి దశనుంచి రెండోదశకు — సోషలిస్టు దశకు — సాగిపోతుంది. ఆవిధంగా రెండుదశలూ పరస్పరం సమ్మిళితమైపోతాయి.

(1949 జనవరి 'కమ్యూనిస్టు'లో ఆపత్రిక సంపాదకవర్గం అధికార పూర్వకంగా చేసిన ప్రకటన.)

"విప్లవకారుడుగానూ, సోషలిజాన్ని అంగీకరించిన వాడుగానూ, కమ్యూనిస్టుగానూ ఉన్నంతమాత్రాన ప్రయోజనం లేదు. ప్రతినిర్ణీత సమయంలో అప్పటి ప్రధాన సమస్య అగు లింకును కనుగొని మొత్తం గొలుసునంతా పరిష్కరించుకుంటూ తిరిగి మరుక్షణంలో ఏర్పడే పరిస్థితుల్లోని కొత్త లింకును కనుగొనుటకు తయారవాలి."

— లెనిన్

('లెనినిజం' పేజి 76)

# భారతదేశంలో కాంగ్రెసు ప్రభుత్వం

— ఏ. డైకోవ్

భారతదేశం విభజించబడి ఇండియన్ యూనియన్ ఏర్పడినతర్వాత మొదటి సారిగా జాతీయకాంగ్రెసు ఏభై అయిదవ మహాసభ గత డిసెంబరు ఆఖరులో జరిగింది. 1947 ఆగష్టున అధికారయుతంగా కాంగ్రెసు ప్రభుత్వంలోకి వచ్చింది. కాని వాస్తవానికి కాంగ్రెసు అగ్రనాయకులు 1946 ఆగష్టు నుంచీ బ్రిటిషువారి రాష్ట్రపరిపాలన లోపాలు పంచుకుంటూనే ఉన్నారు.

కాంగ్రెసు, ప్రభుత్వాన్ని హస్తగతం చేసుకోకముందు, రాజులు భూస్వాములు తప్ప సకల భారతీయ ప్రజల, వర్గాల హక్కులకు ప్రాతినిధ్యం వహిస్తున్నానని చాటుకుంది. కాంగ్రెసు నాయకులు భారతదేశ సంపూర్ణ స్వాతంత్ర్యానికి పోరాడుతున్నామనీ, భూస్వామ్య జీవచ్ఛవాన్ను తుడిచివేస్తామనీ చెప్పుకునేవాళ్లు వారు చిన్న చిన్న సంస్థానాలను రద్దుచేసి, ప్రజాస్వామిక పంధాపై ప్రజాధిపత్యాలను నెలకొల్పుతామనీ, భూస్వాములవద్దనుండి భూమిలాక్కొని పేదరైతులకు పంచిపెడతామనీ, ముఖ్య పరిశ్రమలను జాతీయం చేస్తామనీ, బ్రిటిషు ఆర్థికపునాదులను విధ్వంసం చేస్తామనీ, దరిద్రంనుండి కరువు కాటకాలనుండి భారతప్రజానీకాన్ని ఉద్ధరిస్తామనీ వాగ్దానంచేశారు.

ఈ కార్యక్రమంవల్ల కాంగ్రెసుకు భారత ప్రజానీకంనుండి సంపూర్ణసహకారం లభించింది. ఇండియన్ యూనియన్ రాజ్యాంగ పరిషత్తులో కాంగ్రెసుకు పూర్తిగా మెజారిటీ వచ్చేటట్లు చేసింది. కాని అధికారంలోకి వచ్చినప్పటినుండి దాని చర్యలు అవలోకిస్తే తాను స్వయంగా ప్రకటించిన కార్యక్రమాన్ని యేమాత్రం అమలుజరిపే ఉద్దేశం లేనట్లు తెలుస్తుంది.

1946 డిసెంబరులో కాంగ్రెసు నాయకులు సంస్థానాలనుంచి రాజ్యాంగ పరిషత్తుకు నూటికి యాభైమందిమాత్రం సంస్థాన శాసనసభలు ఎన్నుకున్న ప్రతినిధులనూ, తక్కిన్న యాభైమందీ సంస్థానాధిపతులు నియమించిన వారినీ తీసికోడానికి సమ్మతించారు; ఇండియన్ యూనియన్ అంతటా రిపబ్లిక్ రూపంలోవుండే ప్రభుత్వానికీ సంస్థానాల్లోవుండే సంస్థానాధీశుల పరిపాలనకు ఆట్టేతేడా వుండదని నెహూ్రు రాజ్యాంగపరిషత్తులో ప్రకటించాడు. ఎప్పుడైతే 1947 జూన్‌లో కాంగ్రెసు రెండు

డొమినియనులతో గూడిన దేశవిభజనకు సమ్మతించిందో, అప్పుడే దేశాన్ని రాష్ట్రాలుగా సంస్థానాలుగా విభజించడాన్ని తీవ్రంగా వ్యతిరేకించే కార్యక్రమానికి నీళ్ళు వదిలింది. చిన్నచిన్న సంస్థానాలను కొన్నింటిని కలిపి ఒకే పెద్ద సంస్థానంగా తయారు చేయడం లాంటి సంస్కరణలవల్ల సంస్థానాధిపతులు బలహీనపడకపోగా ఇంకా ఎక్కువగా బలపడడం జరిగింది. సంస్థానాలలో నానాటికి అభివృద్ధి చెందుతోన్న ప్రజాస్వామిక ఉద్యమాలను ప్రోత్సహించడానికిబదులు జాతీయ ప్రభుత్వం వాటికివ్యతిరేకంగా తయారైంది.

1948 సెప్టెంబరులో ఇండియన్ యూనియన్ సైన్యాలు నిజాం స్థానాన్ని ఆక్రమించి నప్పటినుంచీ అవి నిజాం నిరంకుశపాలనకూ, భూస్వాముల దోపిడీకీ వ్యతిరేకంగా విప్లవోద్యమాన్ని నడిపే తెలంగాణ రైతాంగాన్ని అణచివేయ పూనుకున్నాయి.

యూనియన్ సైన్యాలు నిజాం సంస్థానాన్ని ఆక్రమించింది నైజాం క్రూర పరిపాలననుండీ, అతని కావలి కుక్కలైన రజాకార్లనుండీ, సంస్థాన ప్రజలను విముక్తిచేయడానికి కాదని ఇందువల్ల విస్పష్టంగా తెలుస్తుంది. తెలంగాణాలో జరిగే రైతువిప్లవం సంస్థానంలోని ఇతర ప్రాంతాలకూ, దాని సరిహద్దుల్లోఉన్న ఇండియన్ యూనియన్ రాష్ట్రాలకూ పాకకుండా అరికట్టడానికి మాత్రమే కాంగ్రెసు నాయకులు ఈచర్యకు పూనుకున్నారు. నిజాం సంస్థానాన్ని యూనియన్ సైన్యాలు ఆక్రమించిన తర్వాతకూడ నైజాం నవాబు పరిపాలనే కొనసాగుతూఉంది.

ఒక్క మాటలో చెప్పాలంటే బ్రిటిషు సామ్రాజ్యవాదులు అనుసరించిన విధానాన్నే అక్షరాలా సంస్థానాల విషయంలో కాంగ్రెసు అనుసరిస్తోంది. న్యాయశాఖా మంత్రియైన డాక్టరు అంబేద్కర్ 1948 నవంబరులో బహిరంగంగా రాజ్యాంగపరిషత్తులో బ్రిటిషు పాలకుల పాలసీనే తాము అనుసరిస్తున్నామని స్పష్టంగా చెప్పాడు. రాష్ట్రాలకూ, సంస్థానాలకూ సమాన అధికారాన్ని వ్యతిరేకిస్తూ ప్రభుత్వం నియమించిన ప్రత్యేకకమిటీలు ఇండియన్ యూనియన్, సంస్థానాల సంబంధాల విషయమై సంధిషరతులను తయారు చేస్తున్నాయనీ దానికి నరేంద్రసమితీ, సంస్థానాధీశ్వరులూ కట్టుబడివుండాలనీ, రాజ్యాంగ పరిషత్తు కూడా ఈషరతుల నామోదించాలనీ అతడు చెప్పాడు. భారతదేశ పెట్టుబడిదార్లు దినదిన ప్రవర్ధమాన మవుతున్న ప్రజావుద్యమాలకు వ్యతిరేకంగా అత్యంత అభివృద్ధి నిరోధకులైన సంస్థానాధీశులతో పూర్తిగా చేతులుకలుపుతున్నారనీ, సంస్థానాధిపతుల అధికారాన్ని రద్దుజేసే ఉద్దేశం కాంగ్రెసు ప్రభుత్వానికేమాత్రం లేదనీ, ఇందువల్ల స్పష్టమవుతోంది.

కాంగ్రెసు నాయకులు ఇంతకుముందు ప్రకటించిన జాతీయ కార్యక్రమాన్ని ఈవిధంగా గంగలో కలిపారు. 1920లో తలెత్తిన కాంగ్రెసు, మధ్యయుగాలనాటి నిరంకుశ ప్రభుత్వంగా బ్రిటిషు ప్రభుత్వాన్ని సరిగా నిర్వచించి ఆ ప్రభుత్వ లో మార్పు రావాలని ఆందోళన చేసింది. వివిధ జాతులు నివసిస్తోన్న ప్రాదేశైక్యతగల

భూభాగాలను స్వతంత్ర రాష్ట్రాలుగా విభజించాలని ఇదివరకు కాంగ్రెసు ఆందోళన చేసింది. కాని ఇప్పుడు కాంగ్రెసు నాయకులే రాష్ట్రాలను పునర్నిర్మించడానికి ఇది సమయం కాదు అంటున్నారు. గతంలో కాంగ్రెసు ప్రకటించిన కార్యక్రమాన్ని అమలుజరపాలని కోరేవారందర్నీ స్వరాష్ట్ర దురభిమానులుగా పరిగణిస్తున్నారు. భాషాప్రయుక్త రాష్ట్రాలను గురించి ఒక మాటయినా చిత్తు రాజ్యాంగంలో లేదు. అది రాష్ట్రాల చేతుల్లో యెట్టి అధికారం లేకుండాచేసి సర్వాధికారాలనూ అధ్యక్షుని చేతుల్లోనూ, ఇండియన్ యూనియన్ కేంద్రప్రభుత్వం చేతుల్లోనూ పెట్టాలని చూస్తోంది. ఆ చిత్తు రాజ్యాంగంలో జాతుల సమానత్వాన్ని గురించిన ప్రసక్తే లేదు. హిందీని ప్రభుత్వభాషగా ప్రకటించినా ఆచరణలో ప్రభుత్వాధికారులంతా ఇంగ్లీషునే సర్వసామాన్యంగా వుపయోగిస్తున్నారు.

కాంగ్రెసు నాయకులు తాము ఎంతగానో భారతప్రజలకు ప్రాతినిధ్యం వహిస్తున్నామని చెప్పుకున్నా వాస్తవంలో వారు బడా పెట్టుబడిదార్లకు మాత్రమే - ముఖ్యంగా గుజరాతీ,




— 'శంకర్ వీక్లీ' నుండి

మార్వాడీ పెట్టుబడిదార్లకు మాత్రమే - ప్రాతినిధ్యం వహిస్తున్నారు. ఈ పెట్టుబడిదార్లు బ్రిటిషు సామ్రాజ్యవాదులతో ఒడంబడిక చేసుకొని, వాల్‌స్ట్రీటు కోటీశ్వరుల అడుగులకు మడుగులొత్తుతూ, స్వదేశంలోని తదితర రాష్ట్రాల్లోవున్న చిన్న చిన్న పెట్టుబడిదారులతో కలవడానికి నిరాకరిస్తున్నారు. ప్రత్యేకరాష్ట్రాలు ఏర్పడటంతో తప్పనిసరిగా సంస్థానాలు అంతరిస్తాయి. బడా పెట్టుబడిదార్లు జలహీనంగావున్న రాష్ట్రాలలో ప్రజాస్వామిక శక్తులు కేంద్రంలోకంటె ప్రముఖ పాత్ర వహిస్తాయి. కాబట్టి ఇది భారతదేశ బడా పెట్టుబడిదార్లకు లాభదాయకంగా వుండదు. అందుకనే కాంగ్రెసునాయకులు యిదివరలో ప్రకటించిన కార్యక్రమానికి తిలోదకా లివ్వడం జరిగింది.

ప్రస్తుతం భారతదేశం పారిశ్రామికంగా అతిక్షీణదశలో వుంది. అన్ని శాఖలలోనూ ఉత్పత్తి పడిపోతోంది. ఉక్కు వుత్పత్తి యుద్ధానంతరం 1,200,000 టన్నులకు తగ్గిపోయింది. ఇంకా తగ్గిపోతూ నేవుంది. 1948లో వేసిన కొన్ని అంచనాల ప్రకారం 850,000 టన్నుల వుక్కు మాత్రమే ఉత్పత్తి అయింది. ఇనుముయొక్క ఉత్పత్తికూడ అదేవిధంగా క్షీణిస్తోంది: ప్రత్తి, జనపనార ఉత్పత్తికూడ యుద్ధకాలంలోకంటె తక్కువగానే వుంది. ఇండియన్ యూనియన్ ప్రభుత్వం ఎంతగానో ఆశలు పెట్టుకొన్న బ్రిటిష్ అమెరికను పెట్టుబడిదార్లు భారతదేశాన్ని పారిశ్రామికంగా అభివృద్ధి చేయకపోగా పైగా వారి వస్తువులకు మార్కెట్టుగా మాత్రమే భారతదేశాన్ని వుపయోగించుకో చూస్తున్నారు. అమెరికానుండి, ఇంగ్లాండునుండి ఓడల ద్వారా వ్యాపారవస్తువులు ఇండియాకు దిగుమతి అవుతున్నాయి. భారతదేశం ఆర్థికంగా సామ్రాజ్యవాద దేశాలపై ఆధారపడి వున్నంతకాలం భారతదేశం పారిశ్రామిక అభివృద్ధి సామ్రాజ్యవాదుల ప్రయోజనాలకు అవసరమైనంతవరకుమాత్రమే జరుగుతుంది.

భారతదేశ ఆర్థికస్వాతంత్ర్యానికి భారీ పరిశ్రమలు జాతీయం చేసినప్పుడే అనుకూల పరిస్థితులు ఏర్పడతాయి. కాంగ్రెసు నాయకులు దీన్ని పూర్తిగా అర్థంచేసుకున్నారు. కాబట్టే అధికారానికి రాకపూర్వం వారు గట్టిగా ఇదే విషయాన్ని చెప్పుతూ ఉండేవారు. కాని కాంగ్రెసు నాయకులు టాటా, బిర్లా, డాల్మియా వగైరా భారత పారిశ్రామిక చక్రవర్తులపై ఆధారపడివున్నారు. వారికి నష్టంకలిగించకుండా కీలకపరిశ్రమలు జాతీయం చేయడానికి వీలులేదు. అందుకనే ప్రభుత్వం ముఖ్య పరిశ్రమలను జాతీయం చేయడం పదిసంవత్సరాలకు వాయిదావేసింది. ఇది బ్రిటిషు కంపెనీలకు చెందిన పరిశ్రమలకుకూడ వర్తిస్తుంది.

భారతదేశ పెట్టుబడివర్గం బ్రిటిషు పెట్టుబడిదార్లతో పూర్తిగా కలిసిపోవడంచేత బ్రిటిషు పరిశ్రమలనుకూడా జాతీయం చేయడమంటూ లేనేలేదు. యుద్ధప్రారంభంనుండి భారత పెట్టుబడిదారులూ, బ్రిటిషు పెట్టుబడిదారులూ కలిసి సమిష్టిగా అనేక ఆంగ్లో-ఇండియన్ కంపెనీలు స్థాపించారు. అంతేకాదు. ఈమధ్య అమెరికాపెట్టుబడికూడా అనేకభారతపరిశ్రమల్లో ప్రవేశిస్తూవుంది.

వ్యవసాయ సంస్కరణల విషయంలోకూడా కాంగ్రెసు నాయకులు అలాంటి పంథానే అవలంబించారు. అనేక రాష్ట్రాల్లో వ్యవసాయ సంస్కరణలపై బిల్లులు తయారవుతూ ఉన్న మాటవాస్తవమే. కాని ఈ చట్టాలు జమీందార్ల కొన్ని హక్కులను మాత్రమే తగ్గిస్తాయి. ఇందుకు బదులుగా నష్టపరిహారం అనే పేరుతో కొన్నికోట్ల ధనాన్ని జమీందారులకు ముట్టచెపుతున్నారు. ఈ

చట్టాలు అమలులోకి వచ్చినప్పటికి భూస్వామ్య విధానం జమీందారీవిధానం పల్లె ప్రాంతాలపై యథాతథంగా అధికారం చలాయిస్తూనే వుంటాయి. అర్థాకలితో పేద రైతాంగమంతా ఎప్పటిలాగే అలమటిస్తూ వుంటుంది. ఈ అత్యల్ప సంస్కరణలను గూడా అరకట్టడానికి భారత దేశ జమీందారులు తీవ్రంగా ప్రయత్నిస్తున్నారు. కాని భారత ప్రభుత్వంమాత్రం జమీందారులతో పోరాడడానికి ఏమాత్రం ఇచ్ఛగించడంలేదు.

అయితే భూస్వామ్యవిధానాన్నీ, వడ్డీ వ్యాపారాన్నీ ఇంకా అనేక ఫ్యూడల్ లక్షణాలనూ రూపుమాపకుండా పతనదశలోవున్న భారత వ్యవసాయాన్ని అభివృద్ధి చేయడానికి వీలులేదు. ఇప్పటి లెక్కలప్రకారం 1949 లో 30 లక్షల టన్నుల ధాన్యం కొరతవుంటుంది. దక్షిణభారతదేశం కరువులకాటపట్టైపోయింది.

తొమ్మిది. నెలలక్రితం తీసివేసిన రేషనింగును మళ్లీ ప్రభుత్వం పెట్టబోతోంది. 1949 ఫిబ్రవరిలో 7 కోట్ల ప్రజలపై ఈ రేషనింగు అమలుజరుపబడుతోంది. రొట్టె రేషను రోజుకి 113 గ్రాములనుండి 170 గ్రాముల దాకా వుంటుంది. పారిశ్రామికంగా, వ్యవసాయకంగా దేశం వెనుకబడిన దాని ఫలితంగా ప్రభుత్వ ఆదాయం పడిపోవడానికి కారణభూతమైంది. 1939-40 లో మనిషి 1 కి ఆదాయం 67 రూపాయలు ఉండేది. 1947-48లో 62రూపాయలకు పడిపోయింది.

ఇంతవరకు ఏ ఒక చిన్న వ్యవసాయ సంస్కరణకూడా ఏ రాష్ట్రంలోనూ అమలులోకి రాలేదు. ఉదాహరణకు రైతువుద్యమాలు బలంగావున్న దక్షిణభారత దేశంలోని కాంగ్రెసు రాష్ట్రాలైన ఆంధ్ర, కేరళ రాష్ట్రాల్లో కాంగ్రెసు బహిరంగంగా సంస్థానాధీశులకూ భూస్వాములకూ అండగా నిలబడుతోంది. గత కాలంలో బ్రిటిషు పరిపాలనలో కార్మిక కర్షకోద్యమాలు ఎంత దారుణంగా పశుబలంతో అణచివేయబడేవో అంతదారుణంగా తిరువాన్కూరు, కొచిన్ సంస్థాన కాంగ్రెసు ప్రభుత్వాలు నేడు కార్మిక కర్షకోద్యమాలను అణచివేస్తున్నాయి.

భారతదేశమంతటా కార్మిక కర్షకోద్యమాలపై తీవ్రమైన దౌర్జన్య హింసాకాండ అమలుజరుగుతోంది. అనేక రాష్ట్రాలలో కమ్యూనిస్టుపార్టీని నిషేధించారు. దేశమంతటా పార్టీ ప్రచురణలు (దేశీయభాషలలో) ఆచరణలో నిషేధించబడ్డాయి. అనేక ప్రాంతాలలో భారత కమ్యూనిస్టుపార్టీ పత్రికఅయిన పీపుల్సు ఏజ్ ని రాకుండా నిషేధించారు. ఇండియన్ నేషనల్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ అను పేరుతో పోటీ కార్మికసంస్థను స్థాపించి కార్మికోద్యమాన్ని కాంగ్రెసు విచ్ఛిన్నం చేస్తోంది. భారత ఉపప్రధాని, హోంశాఖా మంత్రియైన సర్దార్ పటేల్ ఈ పోటీకార్మిక సంస్థను సృష్టించి పోషించే సంరక్షకుడు. ఈ కార్మికసంఘం ఎంత విద్రోహచర్యలకు తలపడ్డా భారతదేశంలో సమ్మె ఉద్యమం ఏమాత్రం తగ్గలేదు. జీవితవ్యయం విపరీతంగా పెరగడం వలననూ, వేలాదివేల కార్మికులు నిరుద్యోగులు కావడంవలననూ, 1918 లో మొదటి మూడు మాసాలలో 18,40,780 మంది కార్మికులు 1811 సమ్మెలలో పాల్గొన్నారు. వేలాదివేల కార్మికులు జైళ్ళల్లో కుక్కబడ్డారు. ఇదే విధంగా ప్రజాస్వామిక రైతుసంఘాలు యువజన సంఘాలు కూడా తీవ్ర నిర్బంధానికి గురిఅయ్యాయి.

ఇది భారతదేశంలోని వాస్తవపరిస్థితి. కాంగ్రెసు పత్రికలుకూడా పరిస్థితి ప్రోత్సాహకరంగా లేదని ఒప్పుకోవలసి వస్తోంది. గత సంవత్సరాన్ని సింహావలోకనం చేస్తూ అమృత బజార్ పత్రిక (బెంగాల్) 'ఫలించని స్వప్నాలు, తీరనికోర్కెలు, నిష్ఫలమైన ప్రయ

త్నాలతో నిండిన విషాదపూరిత సంవత్సరం' అని చిత్రించింది.

నూతన సంవత్సర సందర్భంలో సోషలిస్టుల పత్రిక ఫ్రీ ప్రెస్ జర్నల్ ప్రథమ 'స్వాతంత్ర్య' సంవత్సరమంతా వృథాగా రక్తం కన్నీళ్ళు ప్రవహించాయనీ, అనైక్యప్రయత్నాలతోను, ఫలితంలేని కృషితోను జరిగిపోయిందని విలపించింది.

నామమాత్రంగా భారతదేశం అధినివేశ దేశంగా ప్రకటించబడింది. కాని కీలక ఆర్థిక స్థావరాలన్నీ బ్రిటిషు సామ్రాజ్యవాదుల చేతుల్లోనే వున్నాయి. ఇక ఆంగ్లో - ఇండియన్ జాయింటు కంపెనీల విషయం చూస్తే, అవి పూర్తిగా బ్రిటిషు పెట్టుబడిమీదనే ఆధారపడివున్నాయి. రెండో ప్రపంచ యుద్ధ కాలంలో ఇండియాలో కొంత బలహీనపడిన తమ స్థితిని తిరిగి బలపర్చుకోడానికి బ్రిటిషు పెట్టుబడిదార్లు తీవ్రంగా ప్రయత్నిస్తున్నారని ఇటీవలి వారిచర్యలద్వారా స్పష్టంగా తెలుస్తుంది. ఇదేకాలంలో భారతదేశ పరిశ్రమల లోకి, ముఖ్యంగా వ్యాపారంలోకి వచ్చిపడుతోన్న అమెరికా పెట్టుబడితో అమెరికా పెట్టుబడిదార్లు తమ బలాధిక్యతను పెంపొందించుకుంటున్నారు.

భారతదేశం ఆర్థికంగా బ్రిటిషు అమెరికా సామ్రాజ్యవాదులపై ఆధారపడటంతో ఆ సామ్రాజ్యవాదులు భారతప్రభుత్వంపై రాజకీయంగా ఒత్తిడి తేవడానికి, భారత అంతరంగిక వ్యవహారాలలో జోక్యం కలిగించుకోవడానికి పూనుకున్నారు. అమెరికా విదేశాంగమంత్రి హెన్‌డర్‌సన్ 1948 డిసెంబరు 22 వ తేదీన ఢిల్లీలో పత్రికా రచయితల సభలో మాట్లాడుతూ, భారతదేశ భావిరాజ్యాంగ, ఆర్థిక ప్రణాళికపై తమ (అమెరికా) 'సహాయం' ఆధారపడి వుంటుందని చెప్పాడు.

విదేశాంగ విధానంలో, భారతదేశం నానాటికీ ఆంగ్లో - అమెరికన్ కూటమిలో చేరుతూ ఉంది. గత అక్టోబరులో జరిగిన బ్రిటిషు డొమినియనుల ప్రధానమంత్రుల సమావేశంలో ఇండియాప్రతినిధివర్గం 'భారతదేశం బ్రిటిషుసామ్రాజ్యంలో వుండేటట్టు రాజ్యాంగ పరిషత్తుచే సమ్మతింప జేస్తా'మని చెప్పిందని, అని బ్రిటిషు ఇండియా పత్రికలు ప్రకటించాయి. ఇందుకు తగిన 'న్యాయ' సూత్రాన్ని కనిపెట్టడంకోసం బ్రిటిషు లేబరు పార్టీవారూ, ఇండియా కాంగ్రెసువారూ ప్రబలంగా కృషిచేస్తున్నారు. అయితే ఆ 'సూత్రం' ఎంత చాకచక్యంగా వున్నా, బ్రిటిషు సామ్రాజ్యానికీ ఇండియన్ డొమినియనుకూ ఏ కొత్తపేరు పెట్టినా, భారతదేశం మాత్రం రాజకీయంగా ఇంగ్లాండు పై ఆధారపడి వుంటుందనే విషయం నిర్వివాదాంశం. బ్రిటిషు సామ్రాజ్య మహాసభే దీన్ని ధ్రువపరిచింది. ప్రపంచశాంతి, ప్రాచ్య పాశ్చాత్య దేశాల ఐక్యత మొదలగు పెద్దపెద్దమాటలతో నిండిన అధికార ప్రకటనలోకూడ పశ్చిమ యూరపు (ఇంకోమాటలో పాశ్చాత్యమతా) రాజ్యాలమధ్య జరిగే సహకారాన్నిగురించి బ్రిటిషు సామ్రాజ్యంలోని కతిమ్మా దేశాల (యూరపుకుచెందని దేశాల)కు కూడా తెలియజేయడం జరుగుతుందని ఉల్లేఖించబడింది. ఈ విషయంపై బ్రిటిషు పత్రికల విమర్శనలు కూడా విస్పష్టంగా వున్నాయి. ఉదాహరణకు డెయిలీ మిర్రర్ ఏమి వ్రాసిందో చూడండి:

"ఇండియా పాకిస్థానులు తమ ఆర్థిక, దేశ రక్షణ బాధ్యతలు బ్రిటిషు సామ్రాజ్యవాదుల పైనా, అమెరికాపైనా, పశ్చిమ యూరపు పైనా ఉంచాం! అని అవి ఇందుమూలంగా స్పష్టంచేశాయి."

అక్టోబరు 17 వ తేదీన కన్సర్వేటివ్ పత్రిక అయిన 'లండన్ అబ్జర్వరు' 'నెహ్రూ, లియాకత్ అలీఖాన్‌లు మలయా స్వాతంత్ర్య జాతీ

యోద్యమాన్ని అణచడానికి బ్రిటిషు అధికారులకు గొప్పసహాయం చేశారని వ్రాసింది.

కాంగ్రెసు అవలంబించే విదేశాంగ విధానంతో సమానంగానే స్వదేశాంగ నీతికూడా అంతే అభివృద్ధినిరోధకంగా వుంది. రోజు రోజుకూ కాంగ్రెసు నాయకత్వం ఆంగ్లో-అమెరికన్ యుద్ధోన్మాదుల కుట్రలోకి దేశాన్ని నడుపుతోంది.

1849 డిసెంబరు 16 వ తేదీన జరిగిన 55 వ మహాసభలో ఇలాంటి పాలసీయే ప్రదర్శించబడింది. కాంగ్రెసునాయకత్వం అవలంబిస్తోన్న అభివృద్ధినిరోధక పంథాను బలపరచడంకోసమే ఈసమావేశం ఉద్దేశించబడింది.

కాంగ్రెసు చరిత్రలో మొట్టమొదటిసారిగా జయపూరు సంస్థానంలో జయపూరుకు సమీపంలో కాంగ్రెసు మహాసభ జరిగింది. జయపూరు మహారాజుగారు ప్రతినిధులకు ప్రధాన అభివందనాలు అర్పించారు. కాంగ్రెస్ అధ్యక్షుడైన పట్టాభి సీతారామయ్యగారి సేవకు మహారాజుగారు తన దర్బారు బృందాన్ని అప్పజెప్పారు. అధ్యక్షుణ్ణి వెండి రథంమీద తెల్లని ఎద్దులు కట్టి వూరేగించారు.

మహాసభ కార్యక్రమం ప్రారంభించేముందు కాంగ్రెసు కార్యవర్గమైన వర్కింగుకమిటీ తయారుచేసిన చిత్తు తీర్మానాలను పరిశీలించడానికి ఆలిండియా కాంగ్రెసు కమిటి సమావేశమయింది. కార్యవర్గంలో సైతం కాంగ్రెసు కార్యక్రమ విధానాన్ని కొందరు తీవ్రంగా విమర్శించారు. చోయిత్రాం గిద్వానీ (ఒక సభ్యుడు) జాతీయ కాంగ్రెసు తన తీర్మానాలననుసరించి నడవడంలేదనీ, ప్రజల దుర్భర పరిస్థితికి కారణం ప్రభుత్వమే అనీ, ప్రజల బాధలు, క్లేశాలు మితిమీరి పోతున్నాయేకాని తగ్గటం లేదనీ, విమర్శించాడు. కాంగ్రెసు నాయకులు అధికారాలకోసం, వ్యక్తిగత సంపాదనలకోసం అర్రులు జాస్తున్నారని ఆయన ఖచ్చితంగా ఉద్ఘాటించాడు.

అధ్యక్షులైన పట్టాభి సీతారామయ్యగారు గిద్వానీకి అడ్డంతగిలి ఆయనను మాట్లాడనీయలేదు. ఈ విధంగా విమర్శకుల నోటికి తాళం వేసినా, పాపం, కాంగ్రెసు నాయకులాశించిన ఫలితాలు కలుగలేదు. కాంగ్రెసు అనుసరించే పాలసీపట్ల, కాంగ్రెసు పాలకముఠాపట్ల, సభ్యుల్లో ఉన్న తీవ్రమైన అసంతృప్తి ప్రతినిధుల ఉపన్యాసాలన్నిటిలోనూ, సుస్పష్టంగా వెల్లడి అయింది.

ఇండియా బ్రిటిషు సామ్రాజ్యంలోనే వుండాలనే తీర్మానం అతి తీవ్రమైన విమర్శలకు గురి అయింది. చాలమంది సభ్యులు ఇండియా బ్రిటిషుసామ్రాజ్యంనుండి తొలగాలని గట్టిగా డిమాండ్ చేశారు. రఘుంరఘురియా, మహావీర్‌సింగ్‌లు ఇండియా ఏముఠాతోనూ ముడిబెట్టుకోకుండా తటస్థ విధానాన్ని అవలంబించాలని పట్టుబట్టారు. ఆలిండియా

కాంగ్రెసు కమిటీ సభ్యుడైన హార్యాని ఇండియన్ యూనియన్‌ను సోషలిస్టు రిపబ్లిక్కుగా మార్చాలని కోరాడు. ఇంకో సభ్యుడైన, నాథూలాల్ కాంగ్రెసు నాయకుల విదేశాంగ విధానాన్ని తీవ్రంగా విమర్శిస్తూ, సోవియట్ యూనియన్‌తో చిత్తశుద్ధి గలిగిన స్నేహ సంబంధాలను పెట్టుకోవలసిందిగా కోరాడు. ఈ పంథా ననుసరించడమే భారత ప్రజలకూ, దేశానికీ శ్రేయోదాయకమని ఆయన గట్టిగా నొక్కి చెప్పాడు.

కాంగ్రెసునాయకుల పాలసీపై కాంగ్రెసు ప్రజాసామాన్యంలో ఉన్న తీవ్ర అసంతృప్తి ఆవేశమంది ఆలిండియా కాంగ్రెసు కమిటీ సభ్యుల విమర్శనల్లో ప్రతిబింబించింది. కాని ప్రతినిధులవాణి నాయకుల చెవిలో మాత్రం దూరలేదు. వారు ప్రతిపాదించిన సవరణలన్నీ త్రోసివేయబడ్డాయి.

మహాసభలోకూడ ఎలాంటి విమర్శనలు చేయడానికి వీలుకలుగనీయలేదు. వర్కింగు కమిటీచే పెట్టబడిన తీర్మానాలన్నీ - బ్రిటిషు సామ్రాజ్యంతో 'ప్రత్యేక' సంబంధాలు కలిగి వుండాలనే తీర్మానంతోసహా - ప్యాసయ్యాయి. బ్రిటిషుసామ్రాజ్యంతో ప్రత్యేక సంబంధాలు కలిగివుండటమంటే బ్రిటిషు సామ్రాజ్యంలో ఒకభాగంగా వుండ నిశ్చయించుకోవడమే.

కాంగ్రెసు చేసిన ఆర్థిక ప్రణాళికకు సంబంధించిన తీర్మానంలో వ్యవసాయ సంస్కరణలను గూర్చి ఒక్కమాటయినా లేదు. ప్రభుత్వంయొక్క, ప్రైవేటు వ్యక్తులయొక్క పెట్టుబడితో జాయింటు పరిశ్రమలు నెలకొల్పబడడమే ప్రభుత్వ కార్యక్రమమనీ, ఈ విధంగా కొత్తగా ఏర్పడే పరిశ్రమల్లో ఎక్కువభాగం ప్రయివేటు వ్యక్తులకే చెంది వుంటుందనీ, కీలకపరిశ్రమలపై క్రమేపి కంట్రోలు ఏర్పరచి పరిశ్రమలు చివరకు జాతీయం చేయడమే కాంగ్రెసుపాలసీ అయినా యజమానులకు చట్టరీత్యా ఉండే ఆస్తులను, పరిశ్రమలను స్వాధీనపరచుకోడం కాంగ్రెసు ఉద్దేశం కాదని మరోతీర్మానంలో పేర్కొనబడింది.

చివరసమావేశంలో ప్యాసయిన పదకొండు తీర్మానాలపై ఎవరికీ మాట్లాడే అవకాశం కలిగించలేదు.

భారత జాతీయకాంగ్రెసు అభివృద్ధి నిరోధకముఠా అయిన భారత పెట్టుబడిదార్లయొక్క భూస్వాములయొక్క, సంస్థానాధీశులయొక్క పార్టీగా మారిందని జయపూరు మహాసభ స్పష్టంచేసింది. అయినప్పటికి ఇంకా ప్రజల స్వాతంత్ర్య సౌఖ్యాలకోసం కాంగ్రెసు పోరాడగలదనే విశ్వాసమున్న ప్రజాస్వామిక మనస్తత్వంగల్గిన సభ్యులు కాంగ్రెసులో ఇంకా చాలామంది ఉన్నారు. కాని వీరి భ్రమలు త్వరగానే తొలగిపోతున్నాయి. కాంగ్రెసు నాయకులవలంబించే స్వదేశాంగ విధానమూ, విదేశాంగ విధానమూ చూస్తే నిజమైన భారతస్వాతంత్ర్యంకోసం పోరాడే కోరిక కాంగ్రెసు నాయకత్వానికి లేదని తేలిపోతుంది. కాంగ్రెసు నాయకత్వం బ్రిటిషు అమెరికా సామ్రాజ్యవాదులతోనూ, స్వదేశీ అభివృద్ధి నిరోధకవర్గంతోనూ రాజీబేరాలు చేసుకొని తన ప్రజలతోనే పోరాటానికి తలపడుతూ ఉంది.

నిజమైన భారత స్వాతంత్ర్యంకోసం, భారత రాజ్యాంగవిధానాన్ని ప్రజాస్వామికం చేయడంకోసం, కష్టజీవులైన ప్రజాసామాన్యంయొక్క ప్రయోజనాలకోసం, అసలు పోరాటం కాంగ్రెసుబైట, కాంగ్రెసుకు వ్యతి

(మిగతా 17 వ పేజీలో)

74

# గ్రంథసమీక్ష





## రక్తాక్షరాలు

మూలం: జ్యూలియస్ ఫ్యూజిక్

అనువాదం: అనిశెట్టి

వెల: రూపాయి

ప్రతులకు:

అభ్యుదయ,

గవర్నరుపేట, విజయవాడ.




ఈ గ్రంథ ఒక నవల కాదు, నాటిక కాదు, 'సినిమా' కూడా కాదు. ఎవరో ఎవరిని గురించో ఊహించి కల్పించి వ్రాసిందికూడా కాదు. ఫాసిస్టు రాక్షసుల చేతుల్లో బందీగా చిక్కి, అనేక చిత్రహింసలకుగురై, ఉరికంబం ఎక్కబోతూన్న ఒక జెక్ దేశభక్తుడు, ఒక ఉత్తమ సాహితీపరుడు, ఒక కమ్యూనిస్టు నాయకుడు తాను ప్రత్యక్షంగా తన శరీరంలోనూ, మనస్సులోనూ, అణువణువునా అనుభవించిన బాధలనూ అవమానాలనూ, ఇంకా జీవితం మీద, మానవత్వంమీద తనలో అచంచలంగా వున్న ప్రేమనూ విశ్వాసాన్నీ, భవిష్యత్తు మీది ఆశనూ ఇందులో స్వయంగా చిత్రించాడు. స్నేహితులుగా కన్పించే వాళ్ళుచేసిన వంచనలు ఆతని ప్రాణాన్ని బలిగొన్నాయి. కాని శత్రుశిబిరంలోని అజ్ఞాతమిత్రుల సహాకారం ఆతని విషాదగాథను జగత్తు కందజేసింది. నాజీఉరికంబం రేడియో ట్రాన్స్‌మిటర్ కాదు. నాజీ కారాగారానికి కాపలా కాసే జెక్ గార్డు స్నేహహస్తం ఆతని హృదయాన్ని విశ్వహృదయంలో మేళవింపజేసింది.

తన అరెస్టు, పెచెక్ భవనంలో విచారణ, హింసలూ, శరీర మంతటా ఏ జైలుసెల్లులోనో, లేక, 'కగిలేజైలు' లాంటి ఏ పోలీసు లారీలోనో, స్ట్రెచర్ మీదనో పోలీస్ స్టేషన్లోని బెంచీ మీదనో కన్నువిప్పలేని పరిస్థితిలో మనస్సులోని అంతరాంతరాల్లో ఎలాఎలా అనిపించిందో - ఫ్యూజిక్ తన అవస్థ చెప్పుకుంటుంటే మనకళ్ళు చెమ్మగిల్లక మానవు; కాని ఫ్యూజిక్ చెబుతాడు—

"జీవితాన్ని ప్రేమించినవాణ్ణి, దాని సౌందర్యాన్ని సుస్థిరం చెయ్యడంకోసం ఎంత మహత్తర పోరాటానికైనా సిద్ధపడిన వాణ్ణి. మానవులారా! మిమ్మల్ని ప్రేమించాను. మీరు నాపై ప్రేమాదరాలు ప్రదర్శించినప్పుడు సంతోషంతో ఉప్పొంగిపోయాను. మీరు నన్ను అపార్థంచేసుకుంటే బాధపడ్డాను. మీరే! మీలో ఎవరికైనా నేను అపచారం చేసివుంటే, క్షమించండి! నేనెవరికైనా మేలు చెయ్యగలిగితే, మరిచిపోండి! ఎవరైనా నాపేరు స్మరిస్తే శోకంరాకుండా వుండాలని నా ప్రార్థన. ఇది మీఅందరికీ నా అంతిమ వాఙ్మూలం! అమ్మా, నాన్నా, అక్కా, చెల్లీ, అందరికీ - ప్రేయసీ, అగస్టీనా! నీకుకూడా - కామ్రేడ్స్, మీ అందరికీ! మీ కన్నీళ్ళ శోకపుధూళిని కడిగెయ్యగలననుకుంటే ఒకక్షణం దుఃఖించండి. కాని సంతాపం కూడదు. నాజీవితాన్ని ఆనందంకోసం వినియోగించాను. ఆనందంకోసమే మరణిస్తున్నాను. అటువంటప్పుడు నా సమాధిపై శోకదేవతను ప్రతిష్ఠిస్తే నేను సహించలేను."

మానవజాతిమీద ఇంతటి ప్రేమతో విశ్వాసంతో తన ఆశయసాధనకోసం, మానవజాతి భవిష్యత్తుకోసం, ఆనందంకోసం ఫ్యూజిక్ మృత్యుముఖంలోకి నడిచాడు. నేడో రేపో తాను బలి కాబోతున్నాడు.

"నా జీవితనాటకం సమాప్తి కాబోతున్నది. నాటకాంతాన్ని మాత్రం నేను చిత్రించలేను. ఈనాటక మెలా అంతమవుతుందో తెలియదు. ఇప్పుడు ఇక ఇది నాటకంకాదు, జీవితం! ప్రత్యక్ష జీవితానికి ప్రేక్షకులంటూ వుండరు. మీరంతా ఇందులో పాల్గొనేవాళ్ళే. చరమాంకం ప్రారంభమవుతున్నది! నిరంతరం మిమ్మల్ని ప్రేమిస్తున్నా! స్నేహితులారా! తస్మాత్ జాగ్రత!"

ఇవే అతని తుది మాటలు.

ఫ్యూజిక్ 1903 ఫిబ్రవరి 23 న జన్మించాడు. ప్రేగ్ విశ్వవిద్యాలయంలో చదువుతున్న రోజుల్లోనే సాహిత్యకృషి ప్రారంభించాడు. 1929 లో 'ప్రజపా సాహిత్యం' అనే పత్రికను నిర్వహించాడు. తర్వాత, జెకోస్లావేకియా కమ్యూనిస్టుపార్టీ పత్రిక 'రూడీ ప్రవో' సంపాదకుడుగా పనిచేశాడు. సోవియట్ రష్యాలో పర్యటనచేసి అక్కడి జీవితాన్నిగురించి తన ప్రజానీకానికి పరిచయం చేస్తూ అనేక రచనలు చేశాడు. జెక్ కమ్యూనిస్టుపార్టీ నిర్మాణంలో అమోఘమైన సేవచేసాడు, జెక్ ప్రజల ప్రేమాదరాలను చూరగొన్న ఈ దేశభక్తుడు చిట్టచివరకు నాజీ కిరాతకుల చేతుల్లో ప్రాణాలు విడిచాడు. కాని, తన నిశితమైన పరిశీలనతో, జీవితం మీద అనంతమైన ప్రేమతో' ఈ ఉత్తమ సాహిత్యగ్రంథాన్ని మనకు అందజేసాడు. ఇందులోని ప్రత్యక్షరమూ అతని హృదయావేదననూ, దృఢసంకల్పాన్నీ స్పష్టంచేస్తూ, మనల్ని కర్తవ్యోన్ముఖుల్ని చేస్తుంది. ఇది ఇప్పటికే ప్రపంచంలోని ముఖ్యమైన అన్ని భాషల్లోకి అనువదించబడింది.

విశ్వసాహిత్యంలో ఉత్తమశ్రేణికి చెందిన ఇలాంటి గ్రంథాన్ని ఆంధ్రప్రజలకు అందజేసిన అభ్యుదయ కార్యాలయం వారు అభివందనీయులు.

ఈ గ్రంథాన్ని స్వాతంత్ర్యకాముకులైన ప్రతిఒక్కరూ పఠించితీరాలని మా అభిప్రాయం.

# సోషలిజం
## ఊహాజనితం, శాస్త్రీయం

రచన: ఫెడ్‌రిక్ ఎంగిల్స్

అనువాదం: దుర్గారావు

ప్రచురణ: త్రిలింగ పబ్లిషింగ్ కంపెనీ, విజయవాడ.

ప్రాప్తిస్థానం: లీలాబుక్ డిపో, గవర్నరుపేట, విజయవాడ.

మార్క్స్ సహచరుడైన ఫెడ్‌రిక్ ఎంగిల్స్ రచించిన "డూరింగ్ సిద్ధాంతఖండనం, అనే గ్రంథంలో చివరి మూడు అధ్యాయాలనూ చేర్చి ఈ గ్రంథం ప్రకటించబడింది. మార్క్సిస్టు మూలగ్రంథాల్లో ఇది చాలా అగ్రశ్రేణికి చెందిన సిద్ధాంతగ్రంథం. సోషలిజం ఊహాజనితం కాదనీ, శాస్త్రీయం అనీ ఈ గ్రంథంలో రచయిత సప్రమాణంగా నిరూపించాడు. ఎంగిల్స్ చెప్పినట్టు ఆ కాలంలో "మరే ఇతర సోషలిస్టు గ్రంథమూ, ఆఖరుకు 'కమ్యూనిస్టు ప్రణాళిక' గానీ, మార్క్స్ 'కేపిటల్' గానీ ఇన్నిసార్లు తర్జుమా చేయబడలేదు." ఇలాంటి ఉత్తమ గ్రంథాన్ని తెలుగు సోదరులకందజేసిన 'త్రిలింగ' వారు అభినందనీయులు. గ్రంథంయొక్క నామకరణంలోనే ఊహాజనితం, శాస్త్రీయం, అనేదానికిబదులు 'ఊహాజనితమా? శాస్త్రీయమా?" అనే పొరపాటు (లోపలి పేజీల్లో సరిగానే వుంది.) దొర్లింది. పునర్ముద్రణలో దీన్ని సవరించుకుంటారని ఆశిస్తున్నాం.

# అభ్యుదయ కథలు
(మొదటి సంపుటి)

వెల: ముప్పావలా

ప్రతులకు:
అభ్యుదయ కార్యాలయం
బెజవాడ

ఇందులో శ్రీ కొడవటిగంటి, అనిశెట్టి, చాగంటి, అడివి బాపిరాజు, అసరాల సూర్యారావు, రాచకొండ నరసింహారెడ్డి, పొట్లపల్లి రామారావు, తుమ్మల వెంకటరామయ్య, తెన్నేటి సూరిగార్ల ఉత్తమ కథలున్నాయి. ప్రతిఒక్క కథా నేటి ప్రజా జీవితాన్ని ప్రతిబింబిస్తూ, భవిష్యత్తువంక నడుస్తున్న మన ప్రజల పురోగమన మార్గాన్ని వ్యక్తపరుస్తున్నది.

కొత్తభావాలను ప్రతిఘటిస్తూ, పాతపడిన కొద్దీ అనుసరిస్తూ, మళ్ళీ కొత్తవాటిని వెక్కిరిస్తూ వుండే ఒక మధ్యతరగతి మనిషి ఒక అభ్యుదయవాది 'శీల పరిశీలన' ప్రారంభించటాన్ని శ్రీ కుటుంబరావుగారి కథ అతి సహజంగా చిత్రిస్తున్నది. 'ఉన్నవారూ - లేనివారూ, అన్న కథలో శ్రీ అనిశెట్టి సుబ్బారావుగారు యీ వర్గసమాజంలోని కుళ్ళును ఎత్తిచూపారు. బాపిరాజుగారి 'నేలతల్లి' మన భరతపుత్రుల కడగండ్లను కళ్ళకు కడుతున్నవి. శ్రీ తుమ్మల వెంకటరామయ్యగారి 'మీరు గెలుస్తారు!', అన్నకథ తెలంగాణా ప్రజల విజయఘట్టానికి నాందీ ప్రస్తావనలా వుంది. ఇలాగే తక్కిన అన్ని కథల్లోను ఒక్కొక్క ప్రత్యేకతా, ఒక్కొక జీవిత పరిశీలనా ఇమిడి వున్నాయని చెప్పవచ్చు. ఈ కథలసంపుటిని ఆంధ్రప్రజలు ఆదరిస్తారని ఆశిస్తున్నాం.

## సంసారసుఖం
## (నవల)

రచన: టాల్‌స్టాయ్......

అనువాదం: ఉమారాజేశ్వరరావు,
శ్రీనివాసరావు.

వెల: రూపాయిన్నర

దొరికేచోటు: ప్రగతి ప్రచురణాలయం
నిడమర్రు,

వయా, పెంటపాడు ప.గో.జిల్లా.

ఉన్నతవర్గాల సాంఘిక జీవితంలోని కృత్రిమ సంబంధ బాంధవ్యాలనూ, ఆస్తిని కేంద్రం చేసుకుని చుట్టూ అల్లుకొనే అన్నివా వ్యామోహాలనూ, పతనమై పోతున్న ఉన్నత వర్గాల నైతికవిచ్ఛిత్తినీ టాల్‌స్టాయ్ ఈ నవలలో చిత్రించాడు. ఆయా మనస్తత్వాలను వాస్తవికంగా వ్యక్తీకరించాడు.

టాల్‌స్టాయ్ వంటి వారి ఉత్తమ గ్రంథాలను ఆంధ్రపాఠకలోకానికి అందిజేయ బూనుకున్న ప్రచురణకర్తలు ప్రశంసార్హులు. వారి ప్రయత్నాలకు పాఠకులు దోహదమిస్తా రని ఆశిస్తాము.

## కొత్త పత్రికలు:

### "సంఘం" వారపత్రిక

సంపాదకులు :—

గోపరాజు రామచంద్రరావు

విడిప్రతి రెండణాలు–సంవత్సర చందా 6-8-0

కార్యాలయం:—పటమట, విజయవాడ

ఈపత్రిక ప్రథమ సంచిక మా కార్యాలయానికి చేరింది. "సంఘం" పత్రికా సంపాదకులు తమ సంపాదకీయంలో "ప్రతి పత్రికకు ఏదో ఒక ప్రత్యేకదృష్టి ఉంటుంది. 'సంఘం' దృష్టి నాస్తికత్వం" అని తమ పత్రికాశయాన్ని తెలియజేశారు.

***

### "కర్షక" వారపత్రిక

మేనేజింగ్ ఎడిటర్: వాసిరెడ్డి వెంకయ్య

సంపాదకులు :

బండ్లమూడి శివరామకృష్ణ
ఉప్పల వెంకటేశ్వర్లు

విడిప్రతి మూడణాలు - సం॥ చందా రు 10

కార్యాలయం :—

అరండల్ పేట 14 వ లైను, గుంటూరు

ఈ 'కర్షక' పత్రిక ఆచార్య రంగాగారి ఆశీర్వాదంతో వెలువడుతున్న "జాతీయ వారపత్రిక."

---

(73వ పేజీ తరువాయి)

తీవ్రంగా వేట జరుగుతూ ఉంది. భారత ప్రజాస్వామికశక్తులూ, గ్రామాల్లో, పట్టణాల్లో ఉన్న కష్టజీవులూ, కార్మికవర్గ నాయకత్వాన ఈ పోరాటాన్ని సాగిస్తూ ఉన్నారు. పరిపాలక ముఠాలు పోలీసు దౌర్జన్యాన్ని ఎంత తీవ్రంగా ప్రయోగించినా లెక్క-చేయకుండా భారతప్రజలు ఈ ప్రపంచంలోని తమ సోదర జాతులతో పాటు సరిసమానంగా స్వేచ్ఛాస్వాతంత్ర్యా లనుభవించుటకు తమకు గల హక్కుకై వీరోచితంగా పోరాడుతున్నారు.

(న్యూ టైమ్సు నుండి 12-1-49)

# వార్తలూ - విశేషాలు

## నాన్‌కింగ్, షాంఘైలలో:

### వంద సంవత్సరాలలోపు కనీ వినీ ఎరుగని భయంకర కరువుదృశ్యాలు

బియ్యంధరలు విపరీతంగా పెరిగిపోవడం వల్ల షాంఘైలో ఆర్థికంగా యింతకుముందెన్నడూ లేనంతగా భయంకర కరువుపరిస్థితులేర్పడ్డాయి. దైనిక జీవితావసర వస్తువుల ధరలు 1948 ఆగస్టు 19 సీలింగురేటులో పోల్చిచూస్తే 1948 నవంబరు 8వ తేదీనాటికే నూటికి రెండువేల చొప్పున పెరిగాయి.

టోకువ్యాపారం చేసేమార్కెట్టులో ఎంత ధర పెట్టినా షావుకార్లు అమ్మడానికి నిరాకరించారు. అందువల్ల అమ్మడం, కొనడం బందు అయిపోయింది. బియ్యంకోసం నగరమంతటా కొట్లాటలు జరుగుతున్నాయి. ఆకలితో అల్లాడుతున్న వందలాది ప్రజలు సాయుధ పోలీసులను సహితం ధిక్కరించి బియ్యపుకొట్లపై బియ్యపు ఓడలపై ఎగబడుతున్నారు.

(ఈ వార్తను నాన్‌కింగ్‌లో ప్రచురించబడే 'టు - కుంగ్ - పావ్' అనే పత్రిక 9-11-48 న ప్రచురించింది.)

### బియ్యంకోసం జరిగే తొక్కిడిలో ముగ్గురి మరణం

10-11-48న అసోసియేటెడ్ ప్రెస్ యీ క్రింది వార్తను పంపింది. (బూర్జువా పత్రికలేవీ ఈ వార్తను ప్రకటించలేను.)

"ఆకలికోసం అలమటించి పోతూవున్న గుంపుల తొక్కిడితో నానకింగ్ నగరవీధులన్నీ హడావుడిగా వున్నాయి. ఈ హడావుడిలో, తొక్కిసలాటలో ముగ్గురు మరణించారు. షాపుల తలుపులనూ, కిటికీలనూ బ్రద్దలుకొట్టి, యజమానుల త్రోసివేసి కనపడిన ఆహారపదార్థాలను ప్రజలెత్తుకు పోతున్నారు. సాయుధులైన పోలీసులు ప్రజల దాడులను ఆపుచేయలేక పోతున్నారు.

ఒక దోపిడిచేసే మనిషిని విలేఖరులు ప్రశ్నించగా అతడు యెన్నో రోజులనుండి "అన్నంరుచి ఎలా ఉంటుందో తాను చూడలేద"ని చెప్పాడు. ('చైనా డైజెస్టు' నుండి)

* * *

## దక్షిణాఫ్రికా చరిత్రలో నూతనాధ్యాయం

దక్షిణాఫ్రికాలోని కేప్ వెస్టర్న్ నియోజక వర్గంనుంచి కామ్రేడ్ కాక్ శాసన సభ్యుడుగా ఎన్నుకోబడ్డాడు.

కామ్రేడ్ కాక్‌కు పోటీచేసిన వారిద్దరూ పేరుకు స్వతంత్రులయినా ఒకరికి మలాన్ పార్టీ అండా, మరొకరికి స్మట్స్‌పార్టీ అండా ఉంది. కామ్రేడ్ కాక్‌కు 3780 వోట్లువస్తే బుచనన్‌కు 754 వోట్లూ వాన్ డెర్ మెర్వేకు 194 వోట్లు మాత్రమేవచ్చాయిఅంటే ఆఫ్రికా ప్రజలు కమ్యూనిస్ట్‌పార్టీని ఎంతగా బలపరుస్తున్నారో స్పష్టమవుతుంది.

దక్షిణాఫ్రికా శాసనసభలో ఉన్న మొత్తం 153 స్థానాల్లో ఆఫ్రికా ప్రజలెన్నుకునేవి 3 స్థానాలు మాత్రమే. ఈముగ్గురిలో కామ్రేడ్ కాన్ ఒకడు. ఇది దక్షిణాఫ్రికా చరిత్రలో ఒక నూతనాధ్యాయం.

## ఇజ్రాయెల్ కమ్యూనిస్ట్ పార్టీ

ఇజ్రాయెల్‌లో వున్న యూదు కమ్యూనిస్టులూ, అరబ్ కమ్యూనిస్టులూ కలసి ఒకే ఇజ్రాయెల్ కమ్యూనిస్టుపార్టీలో ఐక్యమయ్యారు.

ఇజ్రాయెల్ కమ్యూనిస్టు పార్టీలో ఇంత వరకు ఒక్క యూదు కమ్యూనిస్టులే వుండేవారు. ఇప్పుడు వచ్చిన ఐక్యత ఫలితంగా ఇజ్రాయెల్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీలో అరబ్ సభ్యులనుకూడా తీసుకోవడం జరిగింది.

ఇజ్రాయెల్ స్వాతంత్ర్య పోరాటానికి ఈ ఐక్యత ఎంతైనా వుపకరిస్తుందని ఇజ్రాయెల్ కమ్యూనిస్టుపార్టీ ప్రకటించింది.

***

జపాన్

## సోషలిస్టు పార్టీనుంచి కమ్యూనిస్టు పార్టీలోకి

జపాన్ సోషలిస్టుపార్టీలోనూ, కార్మిక - కర్షక పార్టీలోనూ అతివాదులుగావున్న సభ్యుల్లో పెక్కుమంది కార్యకర్తలు తమ పార్టీలకు స్వస్తిజెప్పి జపాన్ కమ్యూనిస్టు పార్టీలో చేరుతున్నారు.

'అకహాటా' అనే పత్రిక ప్రకటించిన వార్తల ప్రకారం జపాన్ రైతుసంఘ టొట్టోరిశాఖా ప్రధానకార్యదర్శి, 'ఔమోరీ' జిల్లా పోస్టల్ వర్కర్స్ నేషనల్ యూనియన్ అధ్యక్షుడు వగైరాలు పెక్కుమంది కమ్యూనిస్టుపార్టీలో సభ్యులుగా చేరారు. అమెరికా ప్రభుత్వం అవలంబించే కార్మిక వ్యతిరేక చర్యలకు వంతపాడుతూన్న సోషల్ డిమాక్రటిక్ పార్టీ నాయకత్వంపై అతివాదుల్లో యెంత అసంతృప్తి వ్యాపిస్తూవుందో ఈ విషయం తెలియజేస్తూ వుంది.

***

జెకోస్లోవేకియా:

## ద్వివర్ష ప్రణాళికనుంచి పంచవర్ష ప్రణాళికకు

1947-48 సంవత్సరాలకు జెకోస్లోవేకియా ప్రభుత్వం వేసిన 'ద్వివర్ష ప్రణాళిక' పూర్తిగా జయప్రదమయింది. ఈ ప్రణాళికను భగ్నం చేయడానికి అభివృద్ధి నిరోధకులు తీవ్రంగా ప్రయత్నించారు. అనావృష్టి ఫలితంగా దేశములో పంటపూర్తిగా దెబ్బతిన్నది. అయినప్పటికీ కమ్యూనిస్ట్‌పార్టీ నాయకత్వాన జెకోస్లోవేకియా ప్రజలు చూపిన కార్యోత్సాహ ఫలితంగా 1947-48 ప్రణాళిక 100 కి 102 వంతులు పూర్తి అయింది. పారిశ్రామికోత్పత్తి 1937 నాటికంటె నూటికి పదివంతులు ఎక్కువగా పెరిగింది. ఈద్వివర్ష ప్రణాళిక సఫలీకృతం కావడంవల్ల కార్మికుల జీవితప్రమాణం పెంచడానికీ, ప్రజలకు వైద్య, విద్యాదిసౌకర్యాలను ఇతోధికంగా కలిగించడానికి అవకాశం ఏర్పడింది.

ఇప్పుడు నూతనంగా పంచవర్ష ప్రణాళికకు 1949 జనవరి 1 తేదీన బ్రహ్మాండంగా ప్రారంభోత్సవం జరిగింది:

జెకోస్లోవేకియా ప్రభుత్వమూ, ప్రజలూ ద్వివర్ష ప్రణాళికలాగే పంచవర్ష ప్రణాళికను కూడా అనుకున్న దానికంటె ఇంకా ఎక్కువగానే పూర్తిచేస్తారనడంలో ఎట్టి సందేహం లేదు.

# సోవియట్ లో గ్రంథాలయాలు

సోవియట్ యూనియన్‌లో ఉన్నన్ని గ్రంథాలయాలు ప్రపంచంలో మరే దేశంలోనూ లేవు. జారుకాలంలో మొత్తం 89 లక్షల పుస్తకాలుంటే ఇప్పుడు ఒక్క రష్యన్ లైబ్రరీ ఫెడరేషన్ ఆధ్వర్యాన్నే 50675 గ్రంథాలయాల్లో 95కోట్ల పుస్తకాలున్నాయి. ఈ ఫెడరేషన్ ఆధ్వర్యాన 3 లక్షలమంది లైబ్రేరియన్లు పనిచేస్తున్నారు. ఇవిగాక ఇంకా వివిధశాఖలకు సంబంధించిన అనేక గ్రంథాలయాలున్నాయి. నాగరికత శిఖరాలందుకున్నది అని చెప్పుకునే పెట్టుబడిదారీ అమెరికాలో 20 వేల 331 మందికి ఒక లైబ్రరీ ఉంటే సోవియట్ యూనియన్‌లో ప్రతి 2 వేల 197 మందికి ఒక లైబ్రరీఉంది. పెట్టుబడిదారీ దేశంలో సాంస్కృతికాభివృద్ధినీ సోషలిస్టు దేశంలో సాంసత్కృతికాభి వృద్ధినీ తెలుసుకోడానికి ఇదొక మచ్చుతునక.

# తప్పొప్పుల పట్టిక

| పేజి | కాలం | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 6 | 2 | 18 | (67 నుంచి 172) | (167 నుంచి 172) |
| 17 | 2 | 12 | వర్గరాహిత్య సంస్కరణధోరణి | వర్గసామరస్య సంస్కరణధోరణి |
| 17 | 2 | 33 | వర్గతారతమ్యాలను | వర్గ విభిన్నతను |
| 18 | 2 | 11 | ఉత్పన్నమైన వర్గతారతమ్యాలను | ఉత్పన్నమైన వర్గవైరుధ్యాలను |
| 18 | 2 | 12 | ఈ వర్గ తారతమ్యాలే | ఈ వర్గ వైరుధ్యాలే |
| 19 | 2 | 14 | హెచ్చుగా ఉన్నాయంటే | హెచ్చుగా ఉన్నదంటే |
| 20 | 2 | 8 | జమీందారులు స్వంతభూముల | జమీందారుల స్వంతభూముల |
| 20 | 2 | 14 | హరించబడిన భూములు | హరించబడిన భూములను |
| 22 | 1 | 25 | బయటకు లాగాయి | బయటకు లాగింది. |
| 26 | 1 | 15 | బింకీసభ | 'బబింకీ' సభ |
| 36 | 2 | 33 | (అంటే 27 ఎకరాలు) | (అంటే 2 ఎకరాల 70 సెంట్లు) |
| 43 | 1 | 11 | "లేబరువెంట" | "లేబరు రెంటు" |
| 48 | 2 | 32 | భూస్వామ్య ఏ | భూస్వామ్యమే |
| 57 | 1 | 26-27 | ప్రధాన సమావేశాలకు తమ రెండో సంఘం | ప్రధాన సమావేశాలకు రెండో సంఘం |

[ఇంకా కొన్ని చిన్నచిన్న తప్పులున్నాయి. పాఠకులు సవరించుకొన గోరుతున్నాం]

# ఏజంట్లకు హెచ్చరిక

మా వద్ద మీ డిపాజిట్లులేనిదే పత్రికలు పంపబడవు. మీకు పంపే పత్రికలకు సరిపడే డబ్బైనా కనీసం లేనిదే పత్రికలు పంపబడవు. ఈ రూలును మా కార్యాలయం ఖచ్చితంగా అమలుపరుస్తుంది.

ఏజెంట్లందరికీ వారిడబ్బు యెక్కడ ఎంతవుందో, యింకెంత పంపించవలసి ఉందో, తెలియపరుస్తూ ప్రతిపక్షం జాబులు వ్రాస్తాం. ఏజెంట్లు మాకు పంపించవలసిన డబ్బు ప్రతినెలా 13, 28 తేదీలలోపల అందేటట్లుపంపితేనే మేము సకాలంలో పత్రికలను అందజేయుడం సాధ్యమౌతుంది. అదనపు కాపీలు కావలసివస్తే ముందుగానే తెలియపరచాలి.

మీరు డబ్బు పంపేటప్పుడు అడ్రసును, సాధ్యమైనంతవరకు తెలుగులో విడివిడి అక్షరాలతో వ్రాయకోరతాం. ఇంగ్లీషులో అయితే అచ్చు అక్షరాలు వాడాలి. ఈ విషయంలో ఏ మాత్రం అశ్రద్ధచేసినా అడ్రసులలో తప్పలుపడి ఇబ్బందులకు కారణమవుతుంది.

మా వద్ద డబ్బు లేనిదే ఎన్నిఉత్తరాలు వ్రాసినా పత్రికలు పంపబడవనే విషయాన్ని ప్రతి ఏజెంటూ గుర్తించకోరతాం.

మేనేజరు, జనత

---

## ముఖ్యగమనిక

ఏజంట్లు, చందాదార్లు ఉత్తరాలు, మనియార్డర్లు పంపునపుడు వ్యక్తుల పేర్లతో కాకుండా మేనేజరు, 'జనత' అని వ్రాయాలి.

కొంతమంది ఉత్తరములు వ్రాయునపుడు అడ్రసులేకుండా వ్రాస్తున్నారు. అట్టి వారికి జవాబు యివ్వడం కష్టం.

చందాదార్లు పత్రికకు చందా పంపునపుడు తమ అడ్రసు, మనియార్డరు కూపనులో తెలుగులో విడివిడిగా వ్రాయాలి.

ఉత్తరములు వగైరా ఈ దిగువ అడ్రసుకు వ్రాయండి.

మేనేజరు, 'జనత' బకింగ్‌హాంపేట పోస్టు*

విజయవాడ

* బకింగ్‌హాంపేటపోస్టు అనేది వదలివేస్తే ఒకరోజు ఆలస్యంగా చేరతాయి.

---

## మీ ఫైలులోకి తక్కువైన 'జనత' సంచికలకు వ్రాయండి

మా వద్ద ఈ దిగువ సంచికలు కొద్దిగామాత్రం ఉన్నాయి.

2వ సంచికనుండి 7వ సంచికవరకు డబ్బుతోసహా వెంటనే మీ ఆర్డర్లు పంపండి.

Regd. No. 5296 JANATA 1st Feb. '49-As. 8



# నేటి ప్రపంచాన్ని మార్క్సిస్టు దృష్టితో అవలోకించాలంటే ... ...

నేటి ప్రపంచంలో 'మార్క్సిజం' ఒక మహత్తర శక్తిగా పరిగణించబడుతోంది. దీన్ని నిర్లక్ష్యం చేయడం ఈరోజున ఎవరితరంగాదు. ఇప్పటికే మొత్తం ప్రపంచంలో దాదాపు నాలుగోవంతు ప్రజలు మార్క్సిజాన్నే తమ జీవితాశయంగా, జీవిత పరమావధిగా ఆచరించి దోపిడీ, దారిద్ర్యం లేని నూతన సమాజవ్యవస్థను నిర్మించారు. నిర్మిస్తున్నారు. అలాంటి సమాజవ్యవస్థను నిర్మించడానికే యావత్ ప్రపంచ పీడిత ప్రజానీకం పాటుపడుతోంది. పోరాడుతోంది.

కాబట్టి మార్క్సిజాన్నిగురించీ, విప్లవశక్తులను గురించీ, సాంఘికాభివృద్ధికి సంబంధించిన శాస్త్రీయ సూత్రాలను గురించీ, సమగ్రంగా తెలుసుకోవాలని అభిరుచివుంటే మార్క్సిస్టు దృక్పథంతో వాటిని చూడగోరితే– విశ్వవిఖ్యాత మార్క్సిస్టుల వ్యాసాలనూ, రచనలనూ అధ్యయనం చేయాలంటే అందు కుపయోగించే పత్రిక లివిగో

* న్యూ టైమ్స్
* ఫర్ ఏ లాస్టింగ్ పీస్ ఫర్ ఏ పీపుల్సు డిమాక్రసీ
* లేబరు మంత్లీ
* చైనా డైజెస్టు
* సోవియట్ వీక్లీ
* పొలిటికల్ ఎఫెయిర్స్
* వరల్డు న్యూస్ అండ్ వ్యూస్

వీటినుండీ– ఇంకా అనేక అభ్యుదయ పత్రికలనుండీ మణిపూసల్లాంటి వ్యాసాలను ఏరి పక్షం పక్షా తెలుగులో ఆంధ్రమహాజనులకు అందజేసే ఒకే ఒకపత్రిక 'జనత'

Edited, Printed and Published by Gangineni Venkateswara Rao, Guntur
Printed at Rasatarangini Press, Vijayawada



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA134M108 |
| పుస్తకం పేరు | జనత |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 86 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | Triveni |
| స్కాన్ చేసినది | Chaitanya |
| పరీక్ష చేసినది | RUKSANA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |